# DEVIBHAGAVATAM.

## Skandha. 5.

BY


TIRUPATI VENKATESWARA KAVULU,

*SATAVADHANEES &c &c.*



FIRST EDITION
COPIES 1000

PRINTED AT

SREE BHYRAVA PRESS,

MASULIPATAM









1912.

శ్రీమత్పరదేవతాయై నమః.

# దేవీభాగవతము.

## పంచమస్కంధము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి,

శ్రీ భైరవముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

మచిలీబందరు.

దీనివెల రు 0-11-0.



1912.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

# విషయసూచిక.

శ్రీమత్పరదేవతాయైనమః.

# దేవీభాగవతము.

తిరుపతివేంకటీయము.

పంచమస్కంధము.



అసమానతేజ! పాండి
త్యసదృశనిరతాన్నదానతత్పర! విద్యా
ర్ధిసమేతపంక్తిభోజన!
కుసుమితసంతోష! బ్రహ్మగురుదోషజ్ఞా! ౧

(శివకేశవతారతమ్యము.)

వ॥ అవధరింపు మనంతరంబు శౌనకాదులు సూతుం గాంచి

క॥ శ్రీకృష్ణునిచరితమ్మును, మా కెఱుఁగం జెప్పితివి సమంజసముగ నే
మాకర్ణించితి మాను, శ్లోకునికథయందు శంక చొప్పడు ననఘా.

చ॥ హరియవతార మైనజగదాధ్యుఁడు కృష్ణుఁ డరణ్యమేగి శం
కరుని యజింప నాతఁ డెసకమ్మునఁ బార్వతితోడ వచ్చి మే
ల్వర మిడె నంటి శంకరుఁడు వారిజనేత్రునికన్న నెక్కుడే!
పరమవిరుద్ధ మియ్యది కృపన్ వచియింపుము మాకు నావుడున్.

చ॥ మునులు మహామహుల్! వినుఁడు మున్ను పరాశరపుత్రుఁ డట్లు చె
ప్పినచరితన్ గ్రహించి పృధివీపతి యాజనమేజయుండు వ్యా
సునిఁ గని పల్కె "నేల మధుసూదనునంశము కృష్ణుఁ డాచరిం
చెను దపమున్ శివుంగుఱిచి చెప్పుము సంశయ మయ్యె సన్మునీ.

గీ॥ సృష్టిరక్షాప్రళయములు సేయఁ జాలు, దేవదేవుండు సర్వసిద్ధిప్రదుండు
ప్రాకృతునిఁబోలెఁ గృష్ణుఁ డెప్పాటఁ జేసెఁ, దపము హరుఁగూర్చి
యితని కతండు లొచ్చె. ౨

చ॥ అనవుడు వ్యాసుఁ డిట్లను "జనాధిప! నీ వనినట్లు కృష్ణుఁ డెం
దును సధికుండు శక్తుఁడు సనూనమహామహిమానుభావుఁ డై
నను మనుజత్వ మందుకతనన్ దన కయ్యవి సంభవించె నొ
ప్పొనె మనుజత్వ మందియునుఁ బూర్వపురీతిని సంచరింపఁగన్. ౬

మ॥ గురులం గొల్చుట, వృద్ధసేవనము, మ్రొక్కుల్ విప్రులం, దవ్వియ
చ్చరపూజారతి, హర్షశోకములు, స్త్రీసంసర్గము, న్నిత్యసం
సరణవ్యాప్తియు, లోభమోహములు,లవశ్యమ్ముగన్ ఘటించుగన్ గుణో
ద్ధుర మా దేహమునందు నిర్గుణత యెందుం జొప్పడం బోలునే. ౭

వ॥ మఱియు శ్రీకృష్ణునిధనమ్మునకును యాదవనాశనమ్మునకును
నగ్రజగాంధారీశాపమ్ములు కారణమ్ములు, చోరకృతలుంఠనహరణాదికంబు
ను నయ్యెడ నర్జునునసమర్థతయుఁ బ్రద్యుమ్నానిరుద్ధహరణం బెఱుంగ
మియు నివి మానవజన్మసంభవమ్ములు. ౮

క॥ హరి నారాయణముని య, ప్పరమునియంశంబు యాదవశిరోమణి
నా, దరుఁడై యీతఁడు శివత,త్పరుఁ డగుటయు నబ్బురంబె! పార్థివ
ముఖ్యా. ౯

క॥ హరికి హరుఁడు కారణ మని, పరమామ్నాయమత మట్టి పరమాత్ము
శివున్, హరియంశ మవతరించిన, పురుషుఁడు కృష్ణుండు గొలువఁ
బోలదె యధిపా. ౧౦

శా॥ ఓంకారమ్మున నాద్యకారమున వాచ్యం డౌ నజుం, డయ్యుకా
రాంకుం డాతనితండ్రి విష్ణువు, మకారాంకుండు శంభుండు, త
త్సంకేతమ్మున నుత్తరోత్తరము ప్రాశస్త్యంబు వాటిల్లు ని
శ్శంకన్ బైఁ దగు నర్ధమాత్ర చెలఁగున్ శక్తిస్వరూపమ్ముగన్.

వ॥ దానంజేసి శక్తికి సర్వోత్కృష్టతయు బ్రహ్మవిష్ణుమహేశ్వ
రుల కుత్తరోత్తరాధికతయుఁ గలుగుకతన హరికి హరపూజనం బావ
శ్యకంబ యని వెండియు. ౧౨

గీ॥ మూలరుద్రునియంశంబు మూలముగను, బ్రహ్మవక్త్రంబునుండి సంభ
వము చెందె,నిచ్చమై నింక నొకరుద్రుఁ; డెల్లరకును,బూజ్యుఁ డీతఁడు
వరములు పొందుపొంబె. ౧౩

క॥ ఈరుద్రుఁడె త్రిజగమ్ముల, కారాధ్యుం డనిన మూల మగురుద్రుఁడు
కాఁ, డే! రాజేంద్రా! యితనికి, పారత దగుశక్తితత్త్వసాన్నిధ్యమునన్.

క॥ హరి యోగమాయకతమునఁ, బరతంత్రుం డగుచు నెత్తు బహుజన్మ
ము ల, పృరమాద్భుత మగుమాయకు, హరియు హరుఁడు నజుఁడు
దాసు లఖిలామరులున్. ౧౫

క॥ కనుఱెప్ప వేయునంతకు, జననము రక్షణము లయము సంధించెడిమో
హిని యోగమాయ యద్దా, నినిఁ గనుఁగొన నేర రెంత నేర్పరులు
నృపా. ౧౬

క॥ హరి సూతికాగృహమ్మును, దరలుట నందునిగృహంబు తనవాస
ముగాఁ, బోరయుట మథురాపురమున, కరుగుటయును యోగ
మాయ యలవరిచె నృపా. ౧౭

వ॥ పిదప భీతుండై మథురాపురమ్ము విడిచి ద్వారకకరుగుటయు
నయ్యోగమాయాబలంబని యెఱుంగునది. ౧౮

క॥ పదియాఱువేలపై యే, బదిమందిలతాంగులకును పైభార్యల కె, న్మిది
మందికి దాసుండై, మధుసూదనుఁ డుంట యోగమాయకతమునన్

చ॥ నరవర! యొక్కకాంత తగునైపుణి గల్గిన దయ్యేనేని య
బ్బురపువిలాసముల్ గొలిపి పూరుషు బద్ధునిఁ జేయఁ జాలు సుం
దరులు పదాఱువేలకును దక్కనపూరుషుఁ డెట్టిఁడని ద
త్పరుఁ డయి తత్సతీనికరపంజరకీరము గాక తీరునే. ౨౦

చ॥ అరయఁగ సత్యభామకయి యాహరి యాహరిధామ మేగి యు
ద్ధురగతి యుద్ధరంగమునఁ దొయ్యాలి మెచ్చఁగ దేవనాథు నో
సరిలఁగఁ జేసి కల్పకము చయ్యనఁ దెచ్చి ముదంబు గూర్చి సు
స్థిరముగ నాఁటునే పెరటిచెట్టుగ వశ్యుఁడు కాకయుండినన్. ౨౧

చ॥ అదియునుఁగాక చైద్యునకు నంగనగా గురుదత్త యైనయ
మ్మదవతి రుక్మిణిన్ గలన మర్దితశాత్రవుఁడై హరించి యా
త్మదయితఁ జేసికోలు నొకధర్మమె? యన్యకళత్ర మెంత ధ
ర్మదశకుఁ దప్పువాఁడును గ్రమమ్మెడఁ జేసి హరింపఁ బోలునే.

గీ॥ ప్రకృతిజన్యంబు హరిహరబ్రహ్మమూల, మగునహంకారమున జగ
మవతరించెఁ,దద్వశుం డయి మోహంబు దవిలి ప్రాణి,చేయుఁ దత్త
త్ప్రకృతులు మంచి చెడ్డ యసక. ౧౩

గీ॥ బ్రహ్మయైన సహంకారవశుఁడు కాక, యున్నవేళ విముక్తుఁడై
యుండు దానిఁ, దవులుచో సంసరణకృతితత్పరత్వ, మందు తత్తద్వి
శేషము లలవరించు. ౧౪

చ॥ అది విడువాఁడె ముక్తుఁడు, మహామహుఁడైనను నయ్యహంకృతిం
బొదలెడివాఁడె బద్ధుఁ డగుఁ బూరుషమాత్రున కంగనాదిసం
పదలును గేహముల్ సుతులు బంధము లందురు వీని కెక్కుడై
నదియని చెప్పఁగాఁ దగు నహంకృతి నిక్కము పార్థివోత్తమా.

గీ॥ ఏ నొనర్చెడివాఁడ నాచే నొనర్పఁ, బడియె నింతటికార్యంబు బలి
యురందు,నధికుఁడను నే నటంచు నహంకృతిం ద,విలి నరుఁడు బంధ
నమునఁ బొరలు నరేంద్ర. ౧౬

వ॥ మృద్విహీనం బగుఘటంబుపగిది నహంకారశూన్యం బగు
వస్తువు దుర్లభంబు; కారణవిముక్తం బగుకార్యంబు లేమి శాస్త్రప్రసి
ద్ధంబకదా! యని మఱియును. ౧౭

గీ॥ అయ్యహంకారసంపర్క మంది కాదె!, యెల్లజగములు పాలించు
నిందిరేశుఁ', డట్లుకాకున్న నతఁడు దుఃఖాబ్ధిమగ్నుఁ, డగునె! యవ
తారముల నెత్తి యవనినాథ! ౧౮

వ॥ అహంకారనిర్ముక్తులకు మోహంబును సంసారమ్మును లేకుండు
మఱియు బ్రహ్మాదులగుపురుషు లెల్లరును సాత్త్వికరాజసతామసభేద
మ్ముల మూఁడు దెఱఁగులవారు వీరియం దెల్లప్పుడును త్రివిధం బైన
యహంకారంబు వర్తించుఁ దద్బద్ధుండై మాయామోహితుండై యనే
కావతారమ్ములఁ దవిలి తత్తదనుగుణమ్ముగ హరి గ్రుమ్మరు నట్లు కాదేని
యెట్టిమందుండును వాంఛింప రొల్లని పరమసంకట మ్మగుగర్భవాస
మ్మున కతఁ డియ్యకొను నెట్లు. ౧౯

క॥ అతివిష్ఠాకులతా సం, గతిహేయం బైనదేవకసుతాగర్భ,స్థితికిన్
హరి యాత్మపద, చ్యుతుఁడై రానేల తాన యొడయం డైనన్.

ఆ॥ వె॥ బ్రహ్మమొదలు స్తంబపర్యంతము జగంబు, యోగమాయవశత
నొప్పు దాని, నుడిపి యుడుప లేక యూర్ణనాభియుంబోలె
హరిహరాదు లుందు రవనినాథ. ౩౦

క॥ అనవుడు జనమేజయుం డిట్లను యోగీశ్వరి మహామహాశక్తి నాకున్
మునివర! చెప్పితి వద్దా,నిన నెందియు వినంగ వలతు నీదగుకరుణన్.

ఆ॥ వె॥ మూడుమూర్తులకును మూలభూతంబయి, యఖిలజగము తాన
యై వెలుంగు, దేవదేవిమహిమం దివిరి వినకయుందు, చెనటి
యెందుం గలండె చెప్పు మనఘ. ౩౧

వ॥ నావుడు వ్యాసుం డిట్లను రాజేంద్రా! యియ్యది శ్రద్ధ గల
శాంతునకు నుడువం దగినది యని యెఱుంగుము మున్ను మహిషుం
డనురాక్షసరాజుకాలమ్మున దేవదానవులకు ఘోరంబగుయుద్ధంబు
జరిగె నది యెట్లంటేని. ౩౨

క॥ కనకగిరి కేగి మహిషుం, డనిమిషులకు నెల్ల విస్మయము గదురంగం జే
సెను వర్షాయుతము తపం, బును బర దేవతను హృదయమున నిల్పి
నృపా. ౩౩

మహిషాసురోత్పత్తి.

క॥ ఆతపమున కెద మెచ్చి కృ, పాతత్పరుఁడై విరించి వర మిడుటకున్నె
యే తెంచి కోరుకొ మ్మన, నాతని కమ్మహిషుం డిట్లు లనె భక్తి
మెయిన్. ౩౪

వ॥ మహాత్మా! నాకుం గూర్చిని మృత్యువులేమిం బ్రసాదింపు మన
వుడు నతం డిట్లనియె. ౩౫

క॥ పుట్టినవారలు గిట్టుట, గిట్టి మరలం బుట్టుటయు నిఖిలజీవుల కే, పుట్టు
నం దప్పనియది నీ, కెట్టుగ నీ వచ్చు మృత్యు వెడం జేయంగన్. ౩౬

వ॥ భూభూధరసముద్రాదికంబులకైనను గాలవశమ్మున నాశమ్ము
దప్ప దట్లుండ నీ కెట్లు మృత్యుభయంబు లేకుండ వరంబొసంగుదు
నొక్కయుపాయమ్ము చెప్పెద మరణమ్మున కొకింతయేని యవకాశం
బునిచి కోరుకొమ్మనవుడు వాం డిట్లనియె. ౩౭

క॥ సురదైత్య మానవులలోఁ, బురుషుఁడు ననుఁ జంపకుండఁ బూరిం
పుము నా, వర; మాఁడుది ననుఁ జంపం,బరమే యఁద్దాని నొక్క-తక్
విడువు మొగిక్. ౪౦

క॥ అనవుడు నీ కెప్పటికే, నిని మానినివలనఁ దొడరు నిధనం బిఁకఁ ద
క్కి-నవారివలన భీతిం, గొనకుము నీ వంచు నేగెఁ గువలయనాధా!

వ॥ అంత నారక్క-సుండును సంప్రాప్తమనోరథుండై నిజనికేతన
మ్మున కరిగె నాపుడు "వాఁ డన నెవ్వఁ డేకతమ్మున మహిషాకారంబు
సంపాదిల్లె! నెవ్వనికొమరుం! డెఱింగింపవే యనుడు వ్యాసుం డిట్లను.౪౨

క॥ రంభకరంభులు మహితా, రంభులు నిరువురును సుతులు ప్రబలుదు
రతిసం,రంభునకు దనువునకు వా, రంభోజాప్తునికి నెక్కు- డగుదురు
దీప్తిక్. ౪౩

వ॥ అయ్యిరువురును సంతతిలేమింజేసి బహువత్సరమ్ములు తపం
బొనర్చి రందుఁగరంభుండు పంచనదమ్మున జలమగ్నుం డయ్యును రంభుం
డొక్క-భూరుహం బారోహించియు ఘోరం బగుతపం బొనర్చుచు
న్నంతఁ దత్తపోభీతుం డగునింద్రుం డటకేతెంచి మొసలియై యప్పంచ
నదంబు సొచ్చి కరంభునిపాదమ్ములం బట్టి వధించిన రంభుండు భ్రాతృ
మరణదుఃఖితుండై. ౪౪

క॥ మన మెఱియఁగఁ దనశీర్ష, మ్మును వహ్నికి నీఁగ నెంచి మొగిఁ దెగ
నఱుకం, గను దక్షిణకర మాయుధ, సనాధముగఁ జేయుదుక్
కృశానుఁడు పేర్మిక్. ౪౫

చ॥ ఎటుటికి వచ్చి "శీర్ష మిటులేటికిఁ ద్రుంచెద వాత్మహత్య చే
యఁదగునె! చేయుదుక్ బరమునందు సుఖం బెడ యా భవత్తపం
బెదకు ముదం బొసంగఁ గొను మిచ్చెద నీకు వరంబు; చచ్చి యె
య్యది గొనువాఁడ వీ! వనుడు నద్దనుజుండు విముక్తశీర్షుఁడై. ౪౬

గీ॥ దేవ నాయెడ నీకు సంతృప్తియేని, కామరూపియు నఖిలలోకవిజయి
యును, దేవదానవమానవాదిప్రభృతుల,కును నజేయుని గొమరు
నాకు నిడు మయ్య. ౪౭

వ॥ నాథుఁడుఁ బావకుం డట్లగుంగాకేమి యిఁక మరణోద్యోగంబు విరమింపుము నీ కెయ్యది గూర్చు నద్దానియంద యిట్టి పుత్రుండు వొడము ననుడు రంభుం డవ్వీతిహోత్రున కెఱఁగి వీడ్కొని యరుదెంచునాఁడు ముందట యక్షరక్షితం బగునొక్క మనోహరప్రదేశమ్మున నున్న మహిషి నతిమత్తనందంబగుదానిఁ జూచి కామించిన నయ్యదియు రంభుం గలయుట కియ్యకొనియె నంత భావికార్యవశమ్మున రంభుం డద్దానితో రమించి గర్భిణి యగుదానిం గొని యితరమహిషంబుల వలనిభయము దొలఁగించుచుఁ బాతాళమ్మునకుఁ దోలికొని చనియె.

క॥ ఒకనాఁడమ్మహిషిని వేఱొకమహిషము చూచి మోహయోగమ్మున
నఁ దా, శక పైకొన నుంకించినఁ, బ్రకోపనుఁడు దానిఁ గొట్టె
రంభుఁడు కడఁకన్. ౪౯

వ॥ అంత మహిషంబును దనకు విఘ్నకారి యగు నద్దనుజుని శృంగంబులం బొడిచి యెత్తి మృతునిం గావించిన నమ్మహిషియు భర్తృమరణమ్మునకు శోకించుచుఁ దనపూర్వనివాసమ్మునకుం జని యక్షుల శరణుఁ జెందె నవల దానిపిఱుందన యమ్మహిషంబును గామార్తం బగు కతన నరిగి యయ్యక్షులతోఁ బెనంగి తచ్ఛరతాడితం బయి ద్రెళ్ళె పిదప యక్షులు నమ్మృతదనుజకళేబరముం గొని తెచ్చి యమ్మహిష శవంబుతోఁ జితాసంస్కారంబు చేయనుంకించిన నమ్మహిషియు సహగమనపరాయణయై యక్షనివారిత యయ్యు వెనుఁదీయక యయ్యనలమ్మునం బడియె మీఁదఁ జితామధ్యంబునుండి మహిషుండును రక్తబీజుండు ననునిరువురు రక్కసు లుదయించి రందు మహిషుండు రాక్షసులచే రాజ్యాభిషిక్తుండయ్యె రక్తబీజుండును సురాసురల కవధ్యుండై చరియించుచుండె నిట్లు చతుస్సముద్రముద్రితం బగుధరామండలంబు నమ్మహిషుం డేకచ్ఛత్రమ్ముగ నేలుచుండి మహాబలుం డగుచిక్షురుండును సేనాయుతసమావృతుం డగుతామ్రుండును నసిలోముండును నుదర్కుండును బిడాలుండును బాష్కలుండును ద్రినేత్రుండును గాలబంధకుండును దనకు సేనానాయకులుగా రాజవర్గంబు లరివెట్ట విప్రులజన్నమ్ములు కలఁచుచు మదోద్ధురుండై యొక్కనాఁడు. ౫౦

మ॥ వరదానోద్ధతగర్వుఁడై యతఁడు స్వర్వాసంబు వశ్యంబుఁ జే
యురహిన్ సేవకుఁ బంచె “నింద్రుఁడు ననున్ యుద్ధమ్మునన్ గెల్చునో!
శరణం బంది దివంబు నా కిడునొ! నిస్సందేహ మారీతి నా
సురనాథుం గని నిశ్చయింపఁ దగు నంచున్ జెప్పి సిర్ఛితిమై. ౪౧

వ॥ అంత దూత దివమ్మున కరిగి యింద్రున కిట్లనియె.

చ॥ విను సురనాథ! నే మహిషవీరునిదూత నతండు పంప నిన్
గనుఁగొన వచ్చినాఁడ నిఁక గర్వము చెందక పీడు వీడి మా
జనపతిసేవకుండ వయి చక్కఁగ నుండెద వొండె యుద్ధమున్
బనుపడి చేసె దొండె రోకపద్ధతి సేయుము నాఁగ నింద్రుఁడున్.

ఉ॥ వానికి నిట్లు పల్కు బలవద్రుమ “నోరి మదాంధ! యిట్లు క
న్గానక నీవిభుం డనిపెఁ గా! నిను మంచిది వానిరోగ మె
ల్లెని యడంతు నాయెదుట ని ట్లనఁ జెల్లునె నీకు! దూతయా
వానినిఁ జంప రామి విడువం బడి నీపతి కిట్లు సెప్పుమా! ౪౩

ఉ॥ ఓమహిషీకుమార! నను యుద్ధమునందు జయించు నిచ్చ ని
కీమెయిఁ బుట్టెనే! తృణము లెంతయు మెక్కుటచేత మిక్కుటం
బై మద మెక్కెనే! జముఁడ వంచు నెఱుంగుదు నిన్ను నీకు ను
ద్దామత నిచ్చుశృంగములఁ ద్రవ్వి తెగన్ బొనరింతుఁ జాపమున్.

వ॥ అనవుడు దూత వైళంబ చని మహిషుం గాంచి నమస్క
రించి యిట్లు విన్నవించె. ౪౪

క॥ నిను గణియింపక సురపతి, పనిచినపలుకులను జెప్ప భయమొదవెడి
వా,నిని విడిచి నీకుఁ బ్రియ మగు, నసృతము వచియింప నర్హమ
గునె తలంపన్. ౪౬

క॥ ప్రియమును సత్యముఁ బల్కుట,య యుచిత మగు భృత్యునకు నృపా
గ్రమ్మున నే నేఁ, బ్రియముగ వినిచితి నేని య, దియు నీకార్యమ్మున
కుఁ బ్రతిఘటించు నొగిన్. ౪౭

చ॥ ఇఁక రిపుఁడెట్లు వల్కె నటులే వచియించెద నన్ను నెందు సే
వకునకు శోభనార్థి కిది భావ్యము గాదు రిపుల్ వచించుఘ

క్కఁ యన మిత్తిపల్కులను గేలి యొనర్చు నెటుల్ వచింతు న
ట్టికుటిలవాక్యముల్ గలన డీకొను మార్తురమాడ్కిఁ దెంపునన్.

క॥ అని హేతుగర్భముగఁ జెప్పినపల్కులయర్థమును సవిస్తరముగఁ గై
కొని పెచ్చుపెరుఁగు కోపం,బున మహిషాసురుఁడు గర్వమూర్ఛితుఁ
డగుచున్. ౫౯

శా॥ లాంగూలమ్మును బృష్ఠదేశమున వాలాయమ్ముఁ గీలించి భ్రూ
భంగం బొప్పఁగ నెఱ్ఱనౌకనులు కోపం బంతటన్ గ్రుమ్మరిం
పం గై పెక్కుడుమూత్రమున్ విడుచుచున్ "మత్తాత్ముఁడై యింద్రుఁడీ
బ్భంగిం బల్కుట వింటిరే! యిఁక వధింపం బోలదే దుష్టునిన్. ౬౦

ఉ॥ వాఁడన నెంత, వానిబలవైభవ మెన్నఁగ శాంతులందు, మా
రాడనితాపసోత్తములయందుఁ బరాంగనలందుఁ జెల్లుఁ బో
రాడుట కప్సరోంగనల కౌనె తపమ్ము లడంచు భంగిఁ, దూ
టాడెదఁ గోటియింద్రు లొకలై యని నన్నెదిరించిరేనియున్.

క॥ నముచిం జంపెను విశ్వా,సము చొప్పడ సంధిఁ జేసి శపథమ్ములకున్
గ్రమ మెడలి;యట్టి దుష్టున్,క్షమింప సజ్జనుల కెట్లు సంతసమెసఁగున్.

వ॥ ఇది యిట్లుండఁ దత్సహాయుం డగు హరియు నిట్టిఁడ యది
యెట్లంటేని. ౬౩

క॥ కపటాచార్యుఁడు కుహకుఁడు, శపథాకరుఁ డతఁడు మున్ను చంపఁ
డె కిటియై, న్నెపమునఁ గనకాక్షుని సిం,గపుమానిసియై హిరణ్య
కశిపు బలాఢ్యున్. ౬౪

వ॥ కావున నింద్రోపేంద్రులయెడ విశ్వాసం బెగ్గగు నాకీదేవ
పతి యన నెంత! మహాదేవుం డెదురైనను ననికిఁ గడంగుదు ౬౫

ఉ॥ కావున నష్టదిక్పతులగర్వ మడంచి నిలింపసంతతుల్
చేవకుఁ దక్కి దైన్యమునుఁ జెంది కృశింపఁగ నాకలోకసు
శ్రీవిభవంబు గైకొని యశేషమఖమ్ముల నిచ్చభాగముల్
కేవలరాక్షసార్థముగఁ గీల్కొనఁజేసి చరింతు నెంతయున్. ౬౬

క॥ సురనరకిన్నరు లాదిగఁ, బురుషులు ననుఁ జెనకఁ దగరు పూఁబోఁడికి
నగు, బోరిఁగొనఁ దరమే!నాదగు, వర మెఱుఁగరె యొకఁడు మనకు
వశ్యుఁడు కాఁడే. ౬౭

వ॥ మీరు పాతాళమ్మునకును బర్వతమ్ములకును జని యచ్చట
చ్చట నున్నదానవులం బురికొల్పికొని యనికిఁ గడంగు నది యని
వెండియు. ౬౮

ఉ॥ ఏ నొకరుండనే సురలనెల్ల జయించెద మత్సురాహతిం
బూనియు నాదుశృంగములపోటులు నాఁటియు నెవ్వఁడేనియుం
బ్రాణములం ద్యజింపఁడె? దురమ్మున బాసట యేల! నిక్కమో
దానవులార! మీరలును దక్కటియోధులు నా కలంకృతుల్. ౬౯

మ॥ నవమందారసుమస్రగావళులతో నాకాంగనాసౌఖ్యులై
భవలీలన్ దులఁదూఁగుచున్ నిరతసంపద్ధాత్రియౌ కామధే
నువుపాల్గ్రోలుచు నాకలోకమునయందున్ మీరు క్రీడల్ పొన
ర్పవలెన్ రక్కసులార! సంగరసమారంభస్థితిన్ నిల్వుఁడీ. ౭౦

చ॥ నిరతము నాటపాటలకు నేర్పరులై గడిఁదేరినట్టి సుం
దరు లగురంభ, యూర్వశి, ఘృతాచి, తిలోత్తమ, మేనకాప్రియం
ద్వరలును, విప్రజిత్తియును, దక్కటియచ్చరలున్ బ్రమోదబం
ధురలయి మిమ్ముఁ గొల్వఁ దులఁదూఁగుఁడు నందనమందు దానవుల్

వ॥ అని చెప్పి సేనాసంరక్షణార్థంబుగాఁ బురోహితుం డగుభా
ర్గవుం బిలిచి పూజించి మహిషుం డున్నంత. ౭౧

చ॥ దివిజవిభుండు సత్వరగతిన్ దిగధీశులఁ బిల్వఁ బంచి వా
రు వినఁగ నిట్లు పల్కె ''మదగూఢుఁడు రంభసుతుండు బ్రహ్మద
త్తవరమహోద్ధతుండు సురధామము గైకొన నెంచి సేవకుం
బవరముసేతకై పిలువఁ బంచె వినుం డతఁ డాడుమాటలన్. ౭౩

చ॥ ప్రమద మెలర్ప మామహిషరాజునకున్ శరణాగతుండ వై
యమరులతోఁ బనిం గొనుచు నాతనిభృత్యుఁడ వౌట యొండె యు
ద్ధమునకు వచ్చు టొండె నొకదానికిఁ బూనుము మావిభుండు కో
ప మెఱుఁగఁ డెప్డు భృత్యులను బాలన సేయు దయాంబురాశి యై.

(ఇంద్రుఁడు విమర్శించుట).

వ॥ అని చెప్పి యమ్మహిషుదూత చనియె నియ్యెడ మనకుఁ గర్తవ్యంబు నిర్ణయింపుఁడు శత్రుండు దుర్బలుండైనను క్షమింపఁ దగదు జయాజయమ్ములు దైవాధీనమ్ములయ్యును యత్నం బవశ్యకర్తవ్యంబు.

గీ॥ సంధియోగంబు ముఖ్య మాసంధి యిట్టి, ఖలునియెడ విషమించు నిక్కముగ యాన, మైన యోజింపక యొనర్చు టనభిమతము, తన బలముఁ బరబలమును దలఁప వలయు. ౭౬

వ॥ కావున వానిసైన్యాదివివేచనం బొనర్ప నొక్కనిం బుచ్చి తెలిసికొనుట యుచితం బని యొక్క ప్రణిధిం బంచిన వాఁడు ను నతి త్వరితగమనమ్మునం జని మగుడవచ్చి యవ్వానిబలవిశేషమ్ములం జెప్పిన వాసవుండు విస్మితుండై మంత్రవేది యగుపురోహితుం బిలిచి యిట్లనియె

క॥ దానవుఁడు మహిషుఁ డున్నత, సేనావృతుఁ డగుచు మనకుఁ జెట్ట దలఁచి తా, రా నుండె నిట, కుపాయము,దీనికి యోజించి యొకటిఁ దెలుపుము దేవా! ౭౭

వ॥ దానవులకు శుక్రునట్లు మా కీవు సర్వకార్య ప్రవర్తకుండవు విఘ్నపరిహర్తవు ననుడు బృహస్పతి సురేంద్రా! వ్యసనంబు సంప్రాప్తం బగుడు బుద్ధిమంతులు ధైర్యంబు వీడ రట్లగుట నీవు ధైర్యమవలంబింపుము. ౭౮

క॥ అగునది కాకుండదు దై,వగతికిఁ బ్రతిసేయఁగల్గు వారమె! చేయం దగునైనను దోఁచిన య,ట్లగణితమగు యత్నమును సురాధపవింటే.

వ॥ దీని నెఱింగియేగదా మునులు ముక్త్యర్థంబు సంతతధ్యాన యోగమ్ముల యత్నింతురు. పురుషకారంబు లేకున్నఁ గేవల దైవం బుకతనఁ గార్యంబు నెఱవేఱ దది యెట్లన్నఁ జీకును బిచ్చుకకుంటును నన్యోన్యసాహాయ్యంబు లేమి నకించిత్కరులయ్యె నది గల్గినఁ గృతకార్యు లగుదు రొక్కెడఁ బురుషకారంబు గల్గియుఁ గార్యసిద్ధి యలవడకుండు నచ్చోట దూషింపఁ దగ దయ్యది రథసైన్యమంత్రాదికంబుల నుండక దైవాధీనంబై యుండు నెట్లంటేని. ౭౯

చ॥ బలియుఁడు క్లేశ మందుట యపాస్త్రబలుండు సుఖమ్ము చెందు టు
జ్జ్వలమతి గల్గుధీరునకు సంపద లేమియుఁ దెల్వి లేనివాఁ
డలఘుగతిఁ మహావిభవ మందుట శూరపరాభవంబు భీ
తులవిజయంబు న న్నది బుధుల్ పరికింతురు దైవికంబుగా ౮౨

సీ॥ కాఁ దగుదానికి గతి దైవ మని యత్న మొనరింపు మవల నయ్యు
ద్యమమ్ము, ఫలియించు నొండె విఫలమగు నొండెఁ గా కయ్యెడ
హర్షశోకాప్తి గనఁ గ, దగ,ద ధైర్యంబు సంతాపకారణ మగు దుః
ఖయోగం బాత్మఁ దొడరు నప్పు, డెయ్యది దుఃఖ మే నెవ్వఁడ నిరు
వదినాలుగు వీడి న నాకునిర్గు॥ ఆ॥ వె॥ ణాత్మకునకు దీన నయ్యెడి
దేమి!యాఁ,కలియు డప్పిపా్రణగతములు సుఖ, దుఃఖములు మనమ్ము
తో నుండు జరయు మృ,త్యువు శరీరమునకుఁ దొడరు మఱియు.

వ॥ షడూర్మిరహితుండ నగునేను శరీరం బొండెఁ ద త్సంబంధి నొండెఁ గాను చతుర్వింశతితత్త్వభిన్నుండ నగునేను సదానందుండఁ బ్రకృతివికృతిభిన్నుండ నని తలంచుకొని నిర్మమత్వంబు నొందు మి య్యది దుఃఖనాశమ్మునకుఁ బ్రథ మోపాయంబని వెండియు. ౮౪

గీ॥ మమత దుఃఖమ్ములకు నెల్ల మనికిపట్టు, దాని విడిచినవాఁడె తద్దయు
సుఖాత్ముఁ, డమరనాయక! సంతోష మన్నిగతుల సౌఖ్యమొనఁగూ
ర్చు దానికి సవతు లేదు. ౮౫

ఉ॥ నీకు మమత్వము న్విడుచునేరుపు చాలకయున్న భావికా
ర్యాకలనంబునం దగిన యత్న మొనర్పుము బుద్ధియుక్ సురా
నీకము తోడు గాఁగఁ బయి నీవా రిపుండో జయమ్ము గాంచి సౌ
ఖ్యాకరులై యెసంగఁ గల రయ్యది దైవము నేఁత గాఁ దగుక్.

వ॥ ఎవ్వరికిని సుఖంబు పుణ్యక్షయ మ్మనియు దుఃఖమ్ము పాప క్షయ మ్మనియు నెఱుంగు మింతయేల నీబుద్ధికిం దోఁచి నట్లొనర్పు మన వుడు సు రేశ్వరుండు మహాత్మా! దుష్టుం డగునమ్మహిషు నశింపఁ జేయుట య నాకుం దోఁచినవిధం బగుట యుద్ధోద్యోగం బొనరించెద నుద్య మంబు లేకున్నఁ గార్యంబు సిద్ధింపదు. విజ్ఞానంబు యతులకును,

సంతోషంబు విప్రులకును, శత్రుహననంబు పార్థివులకును, భూషణం
బులు. ౮౭

క॥ మును త్వష్టకుమారు ని నము, చిని జంపితి నుద్యమంబు చేసి యటు
ల యి, ద్దనుజుఁ బరిమార్చ్ సీమం, త్రనియోగముఁ బవియు విజయ
దాయకములు గా. ౮౮

వ॥ నాకు నెల్ల సంగరమ్ముల నీవును వజ్రాయుధమ్మును హరి
హరులును సహాయులు. రక్షోఘ్నంబు లగుమంత్రమ్ములం బఠించి దీనికి
నీ వనుకూలుండవు గ మ్మనవుడు స్మితపూర్వకంబుగ నతం డతని కి
ట్లనియె. ౮౯

క॥ సురనాథ! నిన్ను యుద్ధా, పరునిఁ వల దనియుఁ బోవఁ దగు నని
యును నే, నిరుదెఱఁగు చెప్ప నోప నె, వరికిఁ జయము నజయంబు
వక్తవ్యములే. ౯౦

మ॥ భవితవ్యంపువిధంబు నాతరమె చెప్ప న్నాకలోకేశ! యే
ది విధేయం బది యాచరింపు మెవఁడేఁ దీర్ఘఁ సమర్థుండె దై
వవిధిఁ బైఁ బాసు మంచిచెడ్డల; ననుఁ వంచింపఁడే మున్ను మ
ద్ధవళాక్షిం గొని చంద్రుఁ; డప్పు డతిచింతఁ జెందనే యే నొగిఁ. ౯౧

వ॥ నన్ను మీర లందఱును బుద్ధిమంతుం డని కదా! కొనియాడు
చుందు రయ్యెడ నాబుద్ధి యేమయ్యెఁ గావున నోపినకొలఁది నుపాయంబు
చింతింపుఁడు సిద్ధ్యసిద్ధులు దైవాధీనంబు లనవుడు బ్రహ్మ కడకుఁ జని
శరణంబు వేఁడి యిట్లనియె. ౯౨

చ॥ మహిషుఁ డనంగ నొక్కరుఁ డసుర్వ్యవిరోధి మదోద్ధతుండు నా
కహిత మొనర్చి నాకమున కాపదఁ గూర్పఁగఁ దైత్యవాహినీ
సహితుఁడు సంగరమ్మునకు సన్నహనం బొనరించు వాఁ డా వా
నిహతికి భీతి చెందితి గణింపుము నాదురవస్థ నావుడున్. ౯౩

వ॥ పితామహుండు హరిహరులం బురస్కరించుకొని సంగరం
బొనర్చుట కర్జం బగు మనమందఱ మియ్యెడఁ గైలాసమ్మున కరుగుద
మని చెప్పిన నిందుండు చతుర్ముఖపురస్సరంబుగాఁ గైలాసమ్మున కరిగి
వేదమంత్రమ్ములచే నతని సన్నుతించి ప్రసన్నుం డగునద్దేవుఁ బురస్స

రించుకొని వైకుంఠమ్మున కరిగి యబ్జనాభు శరణంబు వేఁడి మహిషా
సురుం డొనర్చు దుర్ణయమ్ములు సెప్పిన నతం డింద్రపురోగముల కిట్లని
యె మనమెల్లఁ గలసి యద్దానవు నిర్జించుట కర్జం బయ్యెడి నాహవ
సన్నద్ధుల రగుఁ డనిన వారు వారివారివాహనమ్ముల నధిష్ఠించి సంగ
రాభిముఖులై రి. ౯౪

గీ॥ అంచనెక్కె విరించి ఖగాధిపుపయి, హరి వెలిఁగె వృషవాహనుఁ
డయ్యె శూలి, నెమ్మిపై నడచె గుహుఁడు గజమ్ము దేవ, పతి యధి
ష్ఠించె సంగరప్రమద మొదవ. ౯౫

వ॥ ఇట్లు సన్నద్ధులై హరిహరవిరించిప్రముఖనిలింపులు వెడలిన
నమ్మహిషుండును దైత్యవాహినీసహితుండై యుక్కు మిగిలి ధరణీ
తలంబు గ్రక్కదలఁ జనుదెంచె నిట్లయ్యుభయవాహినులును గలసి యెదిరిన
సంగరంబు బెట్టిదం బయ్యె. ౯౬

మ॥ గదలన్ బట్టసశూలతోమరములన్ గాఢచ్చుసుం బోనిబె
ట్టిద మాని స్త్రింశకంకపత్రన్ విప్రుంధాటిన్ మేటిగాఁ బోరి రు
న్నదులై యాజి సురాసురుల్ భువనసంవాతంబుగాఁ జూగనల్
సెదరన్ రక్తనది యోఘమ్మై పొంగి నిస్సీమప్రతాపోన్నతిన్. ౯౭

ఉ॥ మానితశౌర్యధుర్యుఁ డసమానపరాక్రముఁ డైనవానిసే
నాని గజాధిపాధ్యుఁ డయి నాకపుఁ జొచ్చురుఁ జేసె శస్త్రవి
ద్యానిపుణుండు బాణముల నైదిట; నింద్రుఁడు వానిబాణసం
తానముఁ ద్రుంచి వక్షమున నాఁటె నవం బగునర్ధచంద్రముల్.

వ॥ చిక్షురుండును దదాశుగమ్మున మూర్ఛవోయి యెనుఁగుపై
నొరగుడు సురపతి శతకోటిం గొని యక్కరికరంబు దెగ్ల నేసిన
నయ్యది సంగరరంగంబు విడిచి పలాయనం బొనర్చె నంత మహిషుండు
క్రోధతామ్రాక్షుండై. ౯౯

శా॥ కాలాభీలు బిడాలనాముకుని సంగ్రామైకవీరున్ మరు
త్పాలాద్యష్టదిగీశులన్ క్షణములో భంజించి రమ్మంచు దు
శ్శీలుం బంచిన వాఁ “డిదెంత” యని జేజేరాజుపై నేగె నా
భీలోన్మత్తగజంబు నెక్కి సురలున్ బెంపేది యల్లాడఁగన్. ౧౦౦

ఉ॥ వచ్చెడివానిఁ గాంచి సురవల్లభుఁ డెక్కుడుశౌర్యమొప్ప మే
నుచ్చిచనంగ నేసె సురగోగ్రము లైనశరమ్ములన్ వడిన్
హెచ్చిన తీవ్రకోపమున నింద్రుశరమ్ములు ద్రుంచి వాఁడు పై
పెచ్చుగ నొక్కయేబదిగ భీరశరమ్ములు నించె నేడ్తెఱన్. ౧౦౧
చ॥ నడుమన వాని శస్త్రములు నాకవిభుండు మరల్చి క్రోధ మె
క్కుడుగను వాఁడె యైనశరకోటి వెసన్ బరఁగింప వాఁడునుం
బాడిగ నొనర్చె దేవవిభుపూనిక వమ్ముగ శస్త్రసంతతిన్
దడయక యమ్మహత్పతి గకం గొని యేసె గజమ్ము నక్కఱన్. ౧౦౨
క॥ ఆగదాఘాతమునఁ గరి యాహావ, నీతలము వ సె నార్తంఘని
స్వనంబు, చెలఁగ; నవ్వాఁడు క్రోధ మగ్గలము గాఁగఁ, దివిరి యాని
నేసె నేడ్తెఱఁ జేరి చెక్కి. ౧౦౩
చ॥ సురరిపు లేరు చూచి బలసూదనుఁ డాహవకోవిదుండు దాఁ
గురిసె నుదగ్రమార్గణపుంగోటుల; దానికి వాఁడు నల్గి మే
దురముగ నస్త్రముల్ గడకతోఁ బరఁగించె ననంతసంఖ్యఁ; ద
చ్ఛరముల కజ్జమైఘనులకు సంగర మవ్విభ మయ్యె నయ్యెడన్.
వ॥ పిదప నింద్రుండవ్వానికోల్తలకు శంకించి జయంతుం దనక
గ్రమ్మున నిడికొని బాసటయై తానును బోరుచుండె నట్టియెడ. ౧౦౪
మ॥ కడఁకన్ మార్గణపంచకమ్మున మహోగ్రక్రూరుఁ డై
వడిమై నేసె జయంతుఁ డయ్యసురు దుష్ప్రారంభు, వాఁడున్ మహో
బడబాగ్నిప్రభ లైనచ్ఛరతతుల్ వక్షమ్మున న్నాఁటె కీ
డ్వడి యత్తేరువ మ్రొగ్గతెల్లఁబడె దుర్వారంపుమూర్ఛాగతిన్.
వ॥ అంత సారథి రథంబు దొలికొని వేఱొక్కయిమ్మునకరిగిన
జయశబ్దంబు లొక్కపెట్టఁ జెలంగ సురలు తనుజసహితంబుగ సురపతి
నగ్గించిరి. ౧౦౫
ఉ॥ ఆజయశబ్దముల్ విని మహాగ్రహవిగ్రహుఁడై హయారి తే
త్తేజము సైఁప లేక కడుఁ దెంపరి నస్త్రవిదున్ మహామహో
భ్రాజనుఁ దామ్రుఁ బంపె నతిపాటవమొప్పఁ గఁ దామ్రుఁ డభ్రవి
భ్రాజన మొప్ప నస్త్రములు వర్షముగాఁ గ నిగిడ్చె నిందుపై.

వ॥ అంత.

చ॥ వరుణుఁడు పాశముం గొని సవాహనుఁడై యెదిరించెఁ బాశికిం
దురమునఁ దోడుగాఁ; మిగుల దోర్బల మేర్పడ దండధారియై
యరిగె జముండు; వెంటనె మహామహిషార్భటి మిన్నుముట్టఁ దా
నిరువుర కొక్కఁడయ్యుఁ దనియించె సురారి శరాళిపెంపునన్.

శా॥ ఘోరంబై విలసిల్లునారణమునన్ గోపమ్ముమై ధర్ముఁ "డో
రోరి! రాక్షస! పోకు పోకు" మని దండోద్యత్కరుండై బల
స్ఫారున్ దామ్రిని వైచుడున్ జలమునన్ బాటింప కమ్మేటి యు
ద్ధారంభుం డయి యింద్రుఁ దొట్టి సుర లాహా! నాఁగ జృంభించినన్.

చ॥ నిలు నిలు పోకు మంచు సురనేతకుఁ దోడయి దేవతల్ సుని
శ్చలు లయి మార్గణమ్ముల నసంఖ్యగతిన్ బరఁగించి రక్కసున్
బల మఱఁ జేసినన్ బడియె వాఁడును మూర్ఛ మునింగి సంగర
స్థలమున రక్కసుల్ మిగుల దైన్యము నొంది కలంగి పాఱఁగన్.

క॥ తా(మ్రుఁ డటు మూర్ఛఁ జెందిన, నా(మ్రేడితకోపఘూర్ణితాక్షుల
కాంతుల్, తా(మ్రప్ర(క్రియఁ బర్వఁగఁ; దా (క్రింగెడిభాతి సురలఁ
దాఁకె మహిషుఁడున్. ౧౧౨

దేవదానవయుద్ధము.

వ॥ ఇట్లు గజారూఢుండై గదం గైకొని పోకు మని యదల్చి సుర
నాథు నేసిన నతండును బిట్టలిగి వజ్రమ్మున నగ్గదం బొడి చేసె. ౧౧౩

చ॥ తనుఁ దునుమంగ బెట్టిదపుదంగడి మీఁదికి వచ్చు నింద్రు నొ
య్యనగని యెక్కుడౌ నలుక నార్చి ఫణీడ్నిభ మైనఖడ్గముం
గొని మహిషుండు దా నెదురుకోలు ఘటించిన నంత నిర్వురున్
గనుఁగొనువారు మెచ్చఁగ నఖండముగా నని చేసి రుద్ధతిన్. ౧౧౪

గీ॥ అంత దైత్యుండు శాంబరి నఖిలలోక, మోహకరి గాఁగ మాయఁ
దా మొనయఁ జేసె, నధిప! యెయ్యెడఁ జూచిన నాత్మసదృశు; లొప్పి
రొకకోటి యమ్మాయఁ గుప్పలుగను. ౧౧౫

వ॥ ఇట్లు మాయాపరిభావమ్మున నెల్లెడఁ దానయై మహిషుండు విజృంభించి తమసేనల రూపడంచుటకు నిందురిం డత్యాశ్చర్యపర్యాప్తుండై చేయునది లేక పుల్లవడియె. ౧౧౬

ఆ॥ వె॥ వరుణుఁడును జముండు సరసిజాప్తుండు వహ్నియు శశాంకుఁ
దొట్టి యితరు లమరు, లధికభయము దొడర నందంద మారిన్పడి
పాఱఁ జొచ్చి రసురబారి కెడలి. ౧౧౭

ఉ॥ ఈగతి నార్తులై యమరులెల్లఁ ద్రిమూర్తుల నాత్మ నిల్పి మా
కాఁగఁగ రాదు వీని నని నంచు మొఱ్ఱ బచరించుమాత్రఁ న
య్యాగమవేద్యు లయ్యెడను హంసఖగేశవృషాధిరూఢులై
మూగురు నేగుదెంచిరి సముద్ధతులై మహిషుఁ వధింపఁగన్.౧౧౮

వ॥ పదంపడి చక్రి చక్రంబు వైచినఁ దత్తేజమ్మున నవ్వాని మాయ పంచబంగాళంబై విరిసె దానికి సహింపక మహిషుండును, జిక్షురుండును, నుగ్రాస్యుండును, నుగ్రవీరుండును, నసిలోముండును, దిగ్నేత్రుండును, బాష్కలుండును, నంధకుండును, దక్కుంగల రక్కసులును నొక్కటై పరిఘాద్యాయుధమ్ములు ధరించి ప్రతిఘటించినఁ బోరు ఘోరం బయ్యె నయ్యెడ. ౧౧౯

ఉ॥ రక్కసులెల్ల నుక్కునఁ గరమ్ములఁ జాపము లొప్ప దిక్తతుల్
గ్రిక్కదలంగఁ దాఁకి యమరప్రతతిన్ వృకముల్ గడంగి దా
మెక్కటి వత్ససంఘముల నేపునఁ దోలినభంగిఁ దోలి రి
ట్లుక్కటియున్ సురల్ వాడిచి రోడక యోపినవట్టు పోరుచున్.

క॥ కడు నడరుబాణవర్షము, పుడమియు నాకసము గప్పఁ బోరు భరంబై
దొడరిన నయ్యెడ నంధకుఁ, డుడుసంఘము రాల నార్చి యోధులు
తలఁకన్. ౧౨౧

శా॥ ఆకర్ణాంతము చాపముం దిగిచి పంచాస్త్రమ్ములన్ వీఁక నా
శీకాక్షుం గుఱిఁ జేసి యేసిన విషాలీఢమ్ము లౌవాని నా
లోకారాధ్యుఁడు బిట్టు దున్మి సుర లాలోకించి యగ్గింపఁ దీ
ర్ణాకారమ్ముల నైదుబాణముల దేవారాతిపై నించినన్. ౧౨౨

వ॥ దానఁ బోరు ఘోరం బయ్యె నిట్లు హరితోఁ బెనంగి యంధకుండు హరుం దాఁకెఁ బదంపడి యిరువురకును నేబదిదినమ్ములు సమస్త లోకలోమహర్షణం బగునాహవంబు ప్రవర్తిల్లె నయ్యెడ బాష్కలుం డింద్రుం దాఁకి యు మహిషుండు రుద్రు నదల్చియుఁ ద్రినేత్రుండు జము మార్కొనియు మహాహనుండు గుబేరునిపైఁ గవిసియు నసిలోముండు వరుణుపై నురువడించియు నతిదారుణంబుగఁ బిఱుసనక సంగరం బొనరించి రట్టియెడ నంధకుం డుక్కు మిగిలి. ౧౨౩

క॥ గదఁ గైకొని యమరులు గ్ర, క్కదలఁగ హరి నురువడించి కడు
బెట్టిదమై, యదరిపడ గరుఁడు నేసిన, మదమఱి యాతండు గొంత
మ్రాన్పడె నధిపా. ౧౨౪

ఉ॥ అంత జనార్దనుండు విహగాధిపుమేని నొకిఁత దువ్వి వి
క్లాంతిఁ దొరంగఁజేసి విశిఖమ్ముల నంధకుఁ గూర్చి యేయ వాఁ
డంతఁ దదీయమార్గణము లన్నియు నుగ్గుగఁ జేసి యబ్ధిజా
కాంతుని నేసె నేబదియఖండశరమ్ముల శౌరి పెల్చనన్. ౧౨౫

ఆ॥ వె॥ వానిబాణములను వమ్ముగాఁ జేసి వే,యంచు లొప్పి దీప్తిమించు
తనను, దర్శనంబు వాని తల గుఱి చేసి వై, చిన సురారి మిగులఁ
జేవ దవిలి. ౧౨౬

మ॥ అనివార్య మ్మగుశౌరిచక్రమును వార్య మ్మా నటుల్ చేసెఁ గై
కొని చక్రం బొకఁ జేసి; దాని కసురుల్ గోలాహలం బొప్పఁ బెం
పున నగ్గించిరి యంధకున్; సురవరుల్ పొల్పెఱి "యేమిమీ! సుద
ర్శన మి గ్లానె!" యటంచు నొక్కమొగి నాక్రందించి రత్యార్తులై.

క॥ సుర లాక్రందించిన నా, హరి కనలి యమర్చి యేసె నయ్యంధకుపైఁ
ద్వరితగతిన్ గౌమోదకి,శిరమునకుం దాఁకునట్లు చేకొలఁది వెసన్.

వ॥ పిమ్మట నగ్గద శిరమ్మునకుం దాఁకుడు దిమ్ము గదిరి యమ్మావాదుండు సొమ్మసిలిన నమ్మహిషుం డమ్మధుసూదనుం దాఁకుటయు.

ఉ॥ చాపము కేలఁ బూని పెలుచన్ గుణనాదము మ్రోయ నుజ్జ్వల
త్కోపపరీతుఁడై మొనముకోలు ఘటించెడివానిపై మహా

టోపత బాణవర్షము గదుర్ వెలయించిన వర్షధారలన్
జోపెడిదున్న పోల్కి మధుసూదనుఁ దాఁకె హయారి ధీరుఁడై. ౧౩౦
వ॥ ఇట్లు నిరంకుశుండై మహిషుండు హరికార్ముకనిర్ముక్తశర పరంపరలఁ గ్రమ్మరించుచుఁ గదిసిన నిరుపురకును సంకులక్రమమ్మునఁ గొంతవడి ద్వంద్వయుద్ధంబు ప్రవర్తిల్లె. ౧౩౧
చ॥ హరి గద కేలఁ దాల్చి రయ మారఁగ నమ్మహిషాసురున్ రణా
దరు మదమత్తు మొత్తినఁ బదంపడి శీర్షము వ్రయ్య మూర్ఛ రా
ధరణిపయిం బడెన్ సురలు దైన్యము దక్కఁగ రక్కసుల్ పర
స్పరవదనమ్ములన్ గళలు జాఱఁగ వందురి కందు నొందఁగన్. ౧౩౨
శా॥ మాత్రన్ దైత్యుఁడు మూర్ఛఁ దేరి హరిపై మాత్సర్య మొప్పారఁగా
నేత్రమ్ముల్ గడు నెఱ్ఱఁగాఁ బరిఘమున్ శీర్షమ్మునన్ వైవ దే
వత్రాణుండును దానితాఁకునకుఁ దత్పక్షీంద్రుపై మూర్ఛలెన్
సుత్రామాదులుసూడ నొండెడకుఁగొంచుం బోయెఁబక్షీంద్రుఁడున్
చ॥ అమరులదైన్యముం గని «భయంపడకుం» డని చెప్పుచున్ మహో
ద్యముఁ డయి శంకరుండు మహిషాసురుపైఁ దనశూలము న్నిగు
డ్చ మహిషుఁ డేడ్తెఱన్ విడిచెఁ బ్రాకటమై తగుశక్తి వక్షమం
దు; మదనహారి తద్ధతికి నోవక హెచ్చినతామసమ్మునన్. ౧౩౪
గీ॥ తనత్రిశూలమ్ము గొని వాని దాఁకి యేయఁ,దొడఁగె వాఁడునుబోరా
డఁ గడఁగె నిట్టు,లున్న యెడ హరి మూర్ఛ దా నుడిగి శంక,రునకుఁ
దోడ్పడెఁ జక్రమ్ము గొని కరమున. ౧౩౫
వ॥ ఇట్లు చక్రశూలమ్ములం గొని హరిహరులు సంగరసన్నద్ధులై విజృంభించుటయు మహిషుండు పే లెత్తినకోపమ్మున. ౧౩౬
మ॥ మహిషాకారము దాల్చి పుచ్ఛ మతిసంపాతమ్ముగాఁ ద్రిప్పుచున్
మహిభృచ్ఛృంగసమున్నతం బయి యసామాన్యంబునై భీతిధూ
ర్వహమై దేహమెసంగ శృంగముల భూధ్రమ్ముల్ వెసంగూల్చుచున్
పిహ్మాతిం దాఁకె హరిన్ హరున్ విపులగంభీరధ్వనం బొప్పఁగన్.
ఉ॥ దానికి నల్గి యిర్వురును దారుణబాణపరంపరల్ ధను
ర్ధ్వానపురస్సరంబుగ నిదాఘరవిప్రభ లొప్ప నేయ న

మ్మానవఖాది బిట్టలుక మూర్కొని భూధరశృంగ మాత్మపు
చ్ఛానుగతంబుగా విసరె నాహరిపై హరుపై రయమ్మునన్. ౧౩౮

క॥ ఉరవడిఁ బఱతెంచెడి త, ద్గిరిశృంగము గాంచి హరి యొగిన్ దీక్ష్ణ
ములౌ, శరముల నణుముగఁ జేసి య, సురపైఁ దనచక్ర మపుడు
జొనివెఁ జొనిపినన్. ౧౩౯

ఉ॥ ఆహరిచక్ర మద్దనుజు నయ్యెడఁ దాఁకిన మూర్ఛ వోయి తా
నాహవరంగమందుఁ బడి యంతన లేచి మనుష్యదేహియై
బాహువు నప్పళించి గదఁ బాణి ధరించి నితాంతసంగరో
త్సాహమునన్ మహాభ్రనినదం బొనరించె గిరుల్ చలింపఁగన్.

వ॥ అమ్మహానాదమ్మునకు నమరులెల్లఁ దలంకి రట్టియెడఁ గమలాక్షుండు పాంచజన్యంబు పూరించిన దానవులెల్లరును సురలంబలె నిశ్చేష్టు లైరి. ౧౪౧

## దేవతలు పాఱిపోవుట.

గీ॥ పాంచజన్యారవమ్మున భయము చెంది, కుందునసురుల వీక్షించి కోప
మడర, మానవాకార మెడలి యమ్మహిషుఁ డంత, సింహరూపమ్ము
దాల్చి గర్జించి మించి. ౧౪౨

చ॥ అమరులనెల్లఁ దీవ్రనఖరాగ్రములం బొడి చేయుచున్ గ్రమ
క్రమమున శ్రీహరిం గదిసి గ్రన్న ఖగేంద్రునిఁ బట్టి చీరి యు
గ్రముగ రమాధినాథుభుజకాండము వ్రయ్యఁగఁ జేయఁ గ్రోధవే
గమున సుదర్శనంబు గొని కంజదళాక్షుఁడు విక్రమించినన్. ౧౪౩

క॥ ఆతనిచక్రము తనపై, కేతెంచిన నంతఁ గోన మృగరాడ్రూప
స్ఫీతి విడనాడి శృంగా, ఘాతమ్ముల నతని నొంచెఁ గాఱెనుబోతై.

వ॥ హరియును వానికోల్తలకుఁ దలఁకి సంగరరంగమ్ము విడిచి పలాయనం బొనర్చి నిజభువనమ్మున కరిగె శంకరుండును వాని నవధ్యుఁగాఁ దలంచి పిఱుందన కైలాసమ్మున కేగె బ్రహ్మయు నట్లు లొనరించె.

చ॥ కరమున వజ్రముం గొని యొకండును నిల్చె బలారి; శక్తి దా
పరుణుఁడు దాల్చి యొప్పె, బలవంతుఁడుఁ దండసహాయుఁడై రణ

స్థిరత నెసంగె ధర్ముఁ; డనిఁ జేయఁ గుబేరుఁడు నగ్నియున్ బర
స్పరముగఁ దోడు వచ్చిరి వెసన్ బఱతెంచిరి సూర్యచంద్రులున్.

ఉ॥ వీరలకన్న నెక్కుడగువీరులతోడ లులాయరూపియై
ధీరుఁడు దానవుం డరుగుదెంచెఁ బరస్పరముక్తమార్గణా
సారపరంపరల్ ప్రబలె జ్యానినదమ్ములు సింహనాదముల్
భోరన భూనభోంతరము పూరటిలంగఁ జెలంగి మించఁగన్. ౧౪౭

గీ॥ శృంగములచేతఁ బర్వతశృంగములను, నుక్కుమైఁ జిమ్ముకొంచుఁ
గై పెక్కు మహిషుఁ; డెల్ల యమరులఁ దాడించె నిద్ధబలుఁడు, పుచ్ఛ
సంఘాతముల ఖురస్ఫోటనముల. ౧౪౮

శా॥ ఉగ్రుండై పఱతెంచు న్మహిషాసురుద్ధోద్యోగముం జూచి భీ
తిగ్రస్తుం డయి పాఱె నింద్రుఁడు; జవాధిక్యమ్మునన్ బాశియున్
వ్యగ్రుండై చనె; ధర్ముఁడుం బరుగిడెన్; యక్షేశవహ్న్యర్కు లా
శాగ్రంథిన్ విడనాడి యేగి; రరిగెన్ జంద్రుండు సాంద్రత్వరన్.

వ॥ ఇట్లు మహిషాసురుండు నూఱువత్సరమ్ములు పరమదారుణం బగుసంగ్రామం బొనరించి నిలింపులనెల్లఁ దఱిమి జయాధిక్యమ్మునం బొలిచి దైత్యసహితమ్ముగ స్వర్గం బాక్రమించుకొని వలయు దైత్యుల వల నగు నెడల నియోగించి యమరపతిస్వత్వమ్ము లగుధనాగారమ్ములును నైరావతోచ్చైశ్శ్రవఃకామధేనుకల్పవృక్షమ్ములును నాత్మాయత్తంబులుగ నొనర్చి యింద్రాసనమ్ము నధిష్ఠించి యథేష్టంబుగఁ బరిపాలనం బొనర్చుచుండె. ౧౫౦

గీ॥ వానిధాటికిఁ దాళక వాఁడి దరిసి, యరిగి గిరిగహ్వరమ్ముల నాశ్ర
యించి, యచటఁ బెక్కులు వర్షమ్ము లార్తి గూర, నమరులు వసించి
కృశియించి రవనినాథ. ౧౫౧

వ॥ పదంపడి యొక్కనాఁడు దేవతలందఱును బ్రహ్మలోకమ్మునకరిగి వేదవేదాంగపారంగతు లగుమరీచిప్రభృతిమహామునులు సేవింపఁ బద్మాసనం బలంకరించి యున్న వేదగర్భుఁ జతుర్ముఖు ననంతతేజోనిధి రజోమూర్తిం గాంచి సన్నుతించి యిట్లు చెప్పకొనిరి. ౧౫౨

చ॥ అసురుల మయ్యు నొక్కమహిషాధముచే నిటు లుక్కు దక్కి వి
క్రమ మొనరింప లేక గిరిగహ్వరముల్ గృహసీమలై పొసం
గ మహిమ మేది నట్టిమముఁ గాంచఁగ రాదె మహాత్మ! తండ్రి యే
క్రమమున నున్నఁ బుత్రులఁ గరమ్ము ననుగ్రహబుద్ధిఁ జూడఁడే.

మ॥ అమరస్థానము వానిరాజ్యముగఁ గల్పాగప్రసూనమ్ము ల
య్యమరారాతి పరమ్ముగా మఖము లయ్యశ్వారి పాల్గాఁగ సం
ద్రమునం బుట్టినగోవు వానిదిగ నద్దైత్యుండు పెంపొంగ దై
న్యమునన్ మున్గి సురేంద్రులిట్లగుటయు న్యాయంబె లోకేశ్వరా.

వ॥ సర్వజ్ఞుండ వగుటనీ కెఱుఁగ రానిదొం డుండదు మాపడెడి
యవస్థ యే మని చెప్పికొందు మట్లు స్వర్గంబు వానిపా లొనర్చి యద్రి
గహ్వరముల నచ్చటచ్చట వసియించుమమ్ముల నెద్దియే నొకనిమిత్తంబు
గల్పించి పీడించుచున్న వాఁ డట్లగుటం జేసి రక్షకుండ వని నీపాదమ్ములం
బడితిమి మాకెద్దియేని గతి గలుగం జేయు మని మాటికిం బ్రార్థించు
నమరులకుఁ గృతాంజలులకుఁ బితామహుండు ప్రేమార్ద్రుండై యి
ట్లనియె. ౧౫౫

ఉ॥ చేసెడిదేమి! దానవుఁ డశేషసురాసురమర్త్యులందు ద
న్నోసరిలంగఁ జేయ నొరుఁ డుండమి మత్తత నిట్లొనర్చువాఁ
డీసరణిన్ వరమ్ము గొనె నెవ్వఁడునుం బురుషుండు తన్ననిం
జేసి వధింపకుండ నిఁకఁ జేడియ వాని వధింపఁగావలెన్. ౧౫౬

వ॥ కావున మనమందఱమును గైలాసమ్మున కరిగి కార్యవిశా
రదుం డగు శంకరుతో యోజించి తత్సహితులమై మాధవునొద్ద కేగి
కర్తవ్యాకర్తవ్యమ్ములు నిర్ణయింత మని చెప్పి హంసారూఢుండై దేవ
తలం గలిసి కైలాసమ్మునకుఁ జనిన నంత నద్దేవదేవుఁడు ప్రసన్నుండై
యెల్లర నుచితసత్కారమ్ముల గారవించి కుశలప్రశ్నపూర్వకమ్ముగ నాగ
మనకారణం బడిగినఁ జతురాననుం డిట్లనియె. ౧౫౭

చ॥ తెలియనికార్యమే! యిదియు దేవరకున్; మహిషాసురుండు వీ
రల నిరసించి స్వర్గము కరంబు తిరంబుగ నేలుచున్న వాఁ

దలఘుఁడు యజ్ఞభాగముల నన్నిటి దైత్యులతోడ వాఁడ యి
మ్ములఁ గొనుచున్నవాఁడు వనముల్ గతి యయ్యె నిలింపపాళికిన్.

వ॥ వాసవుఁ దొట్టి యీగీర్వాణులెల్ల నన్ను శరణంబు వేఁడిన నిన్నుం గన వచ్చితి నీకార్యభారంబు నీయంద నిలిచినది నావుడు మందహాసకందళితముఖారవిందుండై శంకరుండు విరించి కిట్లనియె.

ఉ॥ తెచ్చితి వీయనర్థమును దేవతలందఱకున్; వరంబు ము
న్నిచ్చి; యిఁ కేమి సేయ నగు నెవ్వని కేనియు వాఁ డవధ్యుఁ డౌ
నచ్చపలున్ వధింపఁ దగునంగన లెవ్వరు! నీసతీమణిం
బుచ్చెదొ! మత్తలోదరినిఁ బుత్తునొ! పుత్తుమొ! వాసవాంగనన్.

క॥ మనభార్యలందు నొక్కతె,యును యుద్ధమునందు నేరు వొప్పెడి
సతి లే, దనఘా! కర్తవ్యం బ, వ్వనజాక్షునివలన వినఁగ వలయుఁ
గడంకన్. ౧౬౧

వ॥ అతండు బుద్ధిమదగ్రేసరుం డగుట నిప్పట్లు వల నగునుపాయం బెఱిఁగించు నయ్యెడ కరుగుద మని శంకరుఁడు తత్సహితుండై విష్ణులోకమ్మున కరుగునెడ ననుకూలవాతమ్ములు వీతెంచె మార్గమ్మున నెల్లెడఁ బక్షులు శుభసూచకమ్ములయ్యె నాకాశంబు నిర్మలంబుగాఁ దోఁచె దిక్కులు తెలుపొందె నిట్లు శుభోదర్కమ్ముగా వెడలి యమ్మహాదేవుండు ముందట. ౧౬౨

సీ॥ హంససారసచక్రసంసేవితము లైనకమలాకరమ్ములు గలుగుదాని
మందారవకుళచంపకమల్లికాశోకవనము లెల్లెడ నొప్ప వఱలుదాని
నవరత్నఖచితసుందరసౌధభాసురవీథీశతమ్ములు వెలయుదాని, నిగ
మముల్ సెప్పుమునివరేణ్యులును గాయకులు నచ్చరలు గల్గి కులుకు
దాని॥ గీ॥ నలఘులు సునందనందనాదులు నితాంత, భక్తిశీలురు
నలుగడఁ బరఁగుదాని, విష్ణుభువనంబు గని యందు వెలయున మ్మ,
హాత్ము భవనంబు గనియె ననంతరంబు. ౧౬౩

వ॥ ఇట్లు దేవత లందఱు నయ్యెడ కరిగి ద్వారపాలకుం గాంచి మే మేతెంచితి మని మధుసూదనున కెఱిఁగింపవలయు ననిన నందొక్కరుం డగువిజయుం డరిగి యమ్మధువైరికిం జెప్పె నంత విష్ణుండు

సదసంబు వెలువడి వార లున్నయెడ కేతెంచిన నందఱను నమ
స్కరించి వేదవాక్యమ్ముల సన్నుతించిరి యద్దేవుండును గరుణా
ర్ద్రహృదయుండై యెల్లరఁ గుశలం బడిగి యాసనమ్ముల నుండ నియోగించి
యాగమనకారణం బేమని వార లిట్లనిరి. ౧౬౪

మ॥ వరదానమ్మున దృప్తుడై మహిషుఁ డాపత్కారియై మాకు న
ధ్వరభాగమ్ములు ముట్టకుండ దినముం దా నేలుచుండె మమ్ము భూ
ధరదుర్గమ్ములపాలు చేసెఁ బుడమి ధర్మ ప్రక్రియం బోల్చునాసురు
వైరిం బరిమార్పఁగా వలను సంశోధింపు మేదేనియున్. ౧౬౫

వ॥ మహాత్మా! యవ్వాని వధించు పాటిసామర్థ్యం బుమారమా
సరస్వతీశచ్యాదులం దేయుంగ నంతకుం గల్గు నయ్యది విచారింపుము
శరణాగతుల మమ్ము దరి చేర్ప మనవుడు విష్ణుం డవ్వారల కిట్లనియె.

గీ॥ అమ్మహిషుతోడ మన మెల్ల మున్నాహవం బొనర్చితిమి కాదె వాఁడు
మనకు నవధ్యుఁ, డెల్ల సురలయంశమ్ములు నేకముగఁ బొనర్చి, సంగున
ట్లోకకాంతఁ జేయంగ వలయు. ౧౬౬

క॥ మానమున యంశమ్ములఁ బుట్టిన యవ్వామాక్షి వాని డీకొని పోరన్
దునుము ననంతసముగ న, వ్వనితకు మన మాయుధములు
వలయు నొసంగన్. ౧౬౭

దేవీప్రాదుర్భావము

వ॥ అని యతండు వలుకున య్యెడఁ జతురాననుమొగమ్ము నుండి
యొక్క తేజమ్ము రక్తవర్ణమ్మును గించిచ్ఛీతంబును గించిదుష్ణమ్మును శుభా
కారమ్మును మరీచిజాలకీలితంబును నైపొడమె నద్దాని నీక్షించి శివ
కేశవులు పరమాశ్చర్యపర్యాప్తులైరి. ౧౬౮

గీ॥ రౌప్యవర్ణంబు మిగులదుర్ధర్శ మధిక, తీవ్రము భయంకరంబు నై
దేవతలకు; వి స్మయుం బిచ్చు తేజంబు వెలికి వచ్చె, నద్రిసమ మయి
రుద్రదేహంబునుండి. ౧౭౦

వ॥ పిదప విష్ణుశరీరంబు నుండి సత్త్వగుణోపేతంబై శ్వేతవర్ణం
బైన తేజమ్మును పురందరుకాయమ్మునుండి సర్వగుణాత్మకంబై చిత్రవర్ణం
బగు తేజమ్మును వహ్నియమకుబేరవరుణాదు లగుతక్కటిసురలశరీర

మ్ములనుండి భిన్నభిన్నమ్ము లగు తేజమ్ములనుం బొడమి మహాతేజోరాశి యై హిమవత్పర్వతసన్నిభం బగునద్దానిం గాంచి యెల్లరును విస్మయం బందుచుండి రంత నత్తేజఃపుంజ మ్మొక్కదివ్యసుందరియై పదునెనిమిది భుజమ్ములును దెల్లనగు మొగమ్మును నల్లనినేత్రమ్ములును నరుణం బగు నోష్ఠమ్మును నెఱ్ఱనిపాణితలమ్ములును గలిగి నానావిధభూషణమ్ములు దాల్చి సన్నద్ధయై యమ్మహిషాసురుఁ జంప నుంకించె ననుడు జనమేజయుండు మహాత్మా! యమ్మహాదేవిస్వరూపమ్ము సంక్షేపమ్మున వచించుట గాదు విస్తరించి యేయేదేవతలయంశమ్ము లేయేయంగమ్ములుగాఁ బరిణమించె వినవలతు నావుడుఁ బారాశర్యుం డమ్మహాలక్ష్మీస్వరూపం బిట్లు వక్కాణించె. ౧౭౧

శా॥ ఆరూపం బిదమిద్ధ మంచు మునులున్ హర్యాదులున్ జెప్పఁగా
లే రూహింపఁగ నాకు శక్యమగునే! లేశంబుగాఁ జెప్పి వా
చారంభం బొనరించితిన్ శుభదమై యజ్ఞానవిధ్వంసమై
సారంబై సతమై చెలంగు నది విశ్వం బెల్లెడన్ వ్యాప్తమై. ౧౭౨

వ॥ నరేంద్రా! యద్దేవి యేకరూపిణియయ్యుఁ దత్తత్కార్యమ్ముల కనుగుణమ్ముగ నటునివడువున నానారూపమ్ముల నెసంగుచుండు నయ్యాయి రూపమ్ములకుఁ గార్యకర్త్రానుసారమ్ముగ నామంబులు దనరు నయ్యావి సగుణమ్ములును నిర్గుణమ్ములు నై యనంతమ్ములుగా నుండు నైనను నా యోపిన తెఱంగున వివరింతు నాకర్ణింపుము. ౧౭౩

క॥ హరుతేజమ్మున వక్త్రం, బురుహాము కడు వెల్లనగుచుఁ బొలిచెన్
గురు ల, భ్రరుచిం జెలువారెఁ బరే, తరాజతేజమ్ముపొలుపు దవిలిన
కతనన్. ౧౭౪

వ॥ ఆజగన్మాతృక నేత్రత్రయంబు పావకాంశం బగుకతనఁ గృష్ణ రక్తశ్వేతవర్ణమ్ములం బొలిచెఁ గనుబొమ లుభయసంధ్యలవలన నగుటం జేసి వక్రమ్ములును గృష్ణవర్ణమ్ములును స్నిగ్ధమ్ములును నై యొప్పె నాతి దీర్ఘమ్ములును నాతిహ్రస్వమ్ములుం గాక డోలాసమమ్ము లగుశ్రవణమ్ములు వాయుతేజస్సముద్భూతమ్ములు. ౧౭౫

సీ॥ తిలపుష్పముం బోలియలరెడునాసిక ధనదుని తేజంబు, మొనలు గల్గి
తనరారుదళ్కు-దంతములు ప్రాజాపత్య తేజంబు కావివాతెఱ ది
నేంద్రు, తేజంబు; మీఁదివాతెఱ కార్త్తి కేయుని తేజంబు, పొల్పారు
దీప్తి నలరు, పదియును నెన్మిదిబాహులు విష్ణుతేజం; బంగుళులు
వసుసంభవములు॥ గీ॥ స్తనయుగళ మంబుజారి తేజంబు త్రివళి;
సంయుతము మధ్య మింద్రు తేజంబు జంఘ, లూరువులు వరుణుఁడు
కటి యుర్వి యిట్లు, పుట్టె నద్దేవి శుభరూపము న న రేంద్ర. ౧౨౬
క॥ ఆయమఁ గాంచి సురలు మో, దాయత్త త మించి "మహిషు నడఁచు
మనకుఁ దా, నై యిచ్చు స్వర్గరాజ్యం, బీయంబిక" యంచు భయము
నెడలిరి తమలోఁ. ౧౨౭

వ॥ అంత విష్ణుండు సురలం గాంచి యీ యంబికకు మీ మీ
భూషణంబు లొసంగి మీమీ యాయుధమ్ముల తేజమ్ములనలన నాయు
ధమ్ము లుత్పాదించి యొసంగునది యనిన నిర్జరులు సంతుష్టులై యట్లొన
రించిరి. ౧౨౮

సీ॥ పాలసంద్రము మేల్మి చేలమ్ములును మంచి దైనరత్నపుహారమం
బకొసఁగె, నాపాదమస్తకంబమరఁదాల్పఁగ విశ్వకర్మ రత్నపుమేల్
నగల నొసంగె, నురమున శిరమున ధరియింపఁ దగుమాలికలు
రెండు వరుణుండు కానుకిచ్చెఁ, దనరారు వివిధరత్నమ్ములిచ్చుటే
కాక హిమవంతుఁడర్పించె నేన్గు గొంగ॥ తే॥ గీ॥ హరిఁయు హరుఁడును
వరుణుండు నాత్మచక్ర, శూలశంఖమ్ములవలన నోలి సృష్టిఁ, జేసి యొ
సఁగి రయ్యంబకు శ్రీకరములు, చక్రశూలశంఖమ్ములు జనవరేణ్య.

వ॥ మఱియు పావకుండుమనోజవమ్మును శతఘ్నియు నగునొక
శక్తియు వాయువు బాణపూర్ణంబగు నంబులపొదియును జాపంబును
నిందు్రిండు దనవజ్రమ్మునుండి యుదయించిన వేఱొకవజ్రమ్మును నైరావ
తమున కలంకరించెడి గంటయును యముండు దనదండమ్మునఁ బొడమిన
దండంబును బ్రహ్మదివ్యగంగాజలపూరితం బగునొక్క-కమండలువును
గాలంబు ఖడ్గమ్మును పలకయును విశ్వకర్మ తీక్ష్ణం బగుపరశువును గుబే
రుండు సురాపూర్ణం బగుకనకపాత్రంబును వరుణుండు దివ్యపంకజమ్మును

ఘంటాశతనినాదితం బగుకౌమోదకి యనునొకగదయుఁ ద్వష్ట యభేద్య కవచంబును నానావిధాస్త్రమ్ములును దివాకరుండు స్వకిరణమ్ములును నొసంగిన నవి దాల్చి వెలుంగునజ్జగన్మాతృకం గాంచి వార లందఱు నిట్లు నుతించిరి. ౧౮౦

మ॥ శివవై శాంతివి పుష్టివై సుఖదవై సిద్ధిస్వరూపంబ వై
భవసంహారిణి! కాళరాత్రి వయి యంబాదేవివై వృద్ధివై
యవనిం బొల్చియు దానిచే నెఱుఁగ రా కంతస్స్థితిం బొల్చి మా
య వెలింగించుచు దానికిం దెలియ రా వత్యంత గోప్యస్థితిన్.

వ॥ అట్టి వైష్ణవీరుద్రాణీంద్రాణ్యాత్మిక వగునీకు నమస్కరించెద మెల్లని మమ్ముం బీడించు నీహయారిని రయమ్మునం దునిమి కళ్యాణమ్ము లొసంగు మని మాటిమాటికి నుతించి చరణంబులం బడునయ్యమరుల కయ్యంబిక యిట్లనియె. ౧౮౨

చ॥ వినుఁడు సురల్! సురారి నొకవ్రేల్మిడిఁ ద్రుంచెద దీని కింత భీ
తినిఁ గొనువారె బ్రహ్మముఖదేవత లందఱు; కాలపర్యయ
మ్మును గడవంగ నేరికినిఁ బోలునె! యెంతటివింత యంచు నా
ననము సమందహాసముగ నాద మొనర్చె రిపుల్ భయంపడన్.

ఉ॥ మేరువు సంచలించె వడి మిన్నదరెన్ జలధుల్ గలంగె దు
ర్వారతరంబుగా ధరణి గ్రక్కదలెన్ దశదిక్కు లొక్కటై
భోరన మ్రోసె నారవ మపూర్వగతిన్ విని యాహయారియున్
ధీరతఁ దక్కి రక్కసులదిక్కు మొగం బయి యుల్లపెంపునన్.

వ॥ ఇయ్యది కడుఁగ్రొత్తయై యున్నయది దీనికిం గత మే మొకో! యని శంకించి వెండియు. ౧౮౫

ఉ॥ ఈరవ మాచరించురిపుఁ డెవ్వఁడొ! గన్గొని నానిఁ గట్టి దు
ర్వారత నాదుసన్నిధిఁ గరంబు తిరంబుగఁ బొందఁ జేయుఁ డ
ద్దారుణు మందబుద్ధి గతదర్పు నొనర్చి యమాలయాతిథిం
గా రచియింతు నెవ్వనికిఁ గాలము చేరువ యయ్యె నియ్యెడన్.

క॥ సుర లిట్లొనరించిరొకో, పరమాపద డస్సి నాదుభయమున గిరిగ
హ్వరములపాలై నిర్భి, తి రవం బొనరింప నింత తెగువ గలుగునే.

వ॥ అని పనిచిన దూతలు సని సర్వాంగసుందరియు నష్టాదశ భుజయు సర్వాభరణభూషితయు నాయుధసంపన్నయు హస్తమ్మునఁ జమకమ్ము గొని సారెసారెకు మధుపానంబొనర్చుచున్నదియు నగునప్పరాంబ నీక్షించి భయత్రస్తులై మహిషుపాలికిఁ జని యిట్లనిరి. ౧౯౦

ఉ॥ సింగము నెక్కి యెక్కుడగుచెల్వునఁ బొల్పెడియొక్కకాంత స
ర్వాంగసముజ్జ్వలన్మణిమయస్ఫూటభూషణ నిస్తులాయుధా
భంగురహస్త నిత్యమధుపానమదాలస చారుచంచలా
పాంగ గనంగ నయ్యెఁ గనినంతన భీతి యెసంగె మా కొగిన్.

వ॥ అత్తలోదరి సురకాంతయు నసురకాంతయు నని నిరూపింప రాక యపూర్వప్రక్రియ నొప్పుచున్నయది తత్తేజంబు దుర్దర్శం బగుకతన నిలువ నోడి యిట కరుదెంచితి మంతరిక్షమ్మున నుండి నిలింపులాయంగనామణి నెక్కుడుగ సన్నుతించుచుండి రవ్వరారోహ యేమికతమున నిట కేతెంచెనో తెలియుట మాకసాధ్యంబు, తద్దర్శనమాత్ర పలాయమానులమై దేవరకు విన్నవింప వచ్చితిమి. ౧౯౦

క॥ శృంగారాదిరసమ్ములఁ, బాంగాధీనములు గాఁగ నంగజశత మా
రంగ సృజయించు చెల్వున,నంగన రంగారు నేమి యనఁ దగు నధిపా.

వ॥ ఇంక నెయ్యది కర్తవ్యం బానతిమ్ము నావుడు మహిషుండు మంత్రిదిక్కు మొగంబై సాభిలాషమ్ముగ నిట్లను. ౧౯౨

మ॥ అనురాగిల్లి నతి త్తలోదరికి నే నయ్యంగనారత్నముం
గొని రమ్మే క్రియ నైన సామమున నాకోర్కుల్ ఫలింపఁగ నే
నొనరింతున్ బ్రియమారఁ బట్టమహిషీయోగంబు; తత్కన్యకా
జనచూడామణి, కింతకన్నఁ గలదె! సంతోష మెంతేనియున్. ౧౯౩

గీ॥ సామదానభేదమ్ముల సమ్మతించి, వచ్చెఁగా కేమి రాకున్న మచ్చెకంటి
నిటకు రప్పింపుమీ బలాత్కృతిగ నొప్పె,నేని రసభంగ మొనరింతు వేమొ మొదల. ౧౯౪

ఉ॥ ఆసరసీరుహాక్షి జలజానన యాతనుమధ్య లేని యీ
వాసవలోకసౌఖ్యములు వ్యర్థము; లచ్చెలిమిన్న విన్న నా

కాన జనించె వైళమ తదంగన నియ్యెడఁ దేవలోక రసా
భాసము గాక యుండ నొకపక్కిక నీదగునేర్పుకూర్పునన్. ౧౯౭

వ॥ అని యనిపిన సమ్మంత్రివరుం డరిగి దౌదవ్వుల నిలిచి వినయావనతుండై యిట్లను. ౧౯౮

ఉ॥ ఎందులదాన! వియ్యెడకు నేమికతమ్మున వచ్చియుంటివి! నీ
యందముఁ జందముల్ విని స్మరాతురుఁడై ననుఁ బంపె మావిభుం
డందుల కేగుదెంచెదో! రయమ్మున నాతనిఁ దోడి తెచ్చి నీ
కిందు నొసంగువాఁడనొ మృగేక్షణ! యాతడవేల చెప్పుమా.

మ॥ సరసీజాసనదత్తమౌ వరమునన్ స్వర్గమ్ము నిర్జించి యె
వ్వారికిన్ వధ్యుఁడు గాక యిచ్ఛ కనురూపం బైనరూపమ్ము దా
ల్చి రసజ్ఞత్వము గల్గి మావిభుఁడు నిస్సీమప్రతాపాదిభా
స్వరుఁడై వర్తిలు వేఱొకండు మహిషస్వామిస్థితిన్ బోలునే. ౧౯౯

చ॥ అనవుడు లేఁతనవ్వు నగి యజ్జగదంబిక వల్కు "దేవతా
జననిగ నన్నెఱుంగుము ప్రశంస యొనర్చితి కాన యంతయున్
వినిచెద మీవిభుం డిడెడివేదన కోపక నన్ను వేఁడినన్
బనిఁ గొని వచ్చితిన్ మహిషుఁ బట్టి వధించి సురాళిఁ బ్రోవఁగన్.

వ॥ ఇంతవట్టును నీయందలివినయవిధేయతలకు మెచ్చి వచించితి వేఱొక్కటెఱుఁగేని యిప్పుడ నిన్ను వధింతు నింకఁ జాగు సేయక పోయి మీరాజునకు నారాక యెఱింగించి యిటు వచియింపుము. ౨౦౦

## దేవీమహిషదూత సంవాదము.

శా॥ జీవింపన్ వలతేనిఁ దత్క్షణమ స్వర్భూమి వీడి పాతాళముం
బోవన్ జూడు మనుగ్రహించి విడుతున్ బో నేరకున్నన్ నినున్
దేవప్రీతిగ యుద్ధరంగమున మద్దివ్యాస్త్రపాతమ్ములన్
గావింతున్ మృతుఁ గా మదగ్రమున నీగర్వంబు దుర్వారమే. ౨౦౧

చ॥ ప్రతియుగమందు దుర్మదులు పల్వురు నీవలె దేవపీడ సం
తతగతిఁ జేసి మచ్ఛరశతమ్ముల రూపఱి పోయి రింక నీ
గతియును నట్లకాఁ దలఁచి గర్వము వీడుము ధాత నీకు మె
చ్చి తివిరి యిచ్చునవ్వరము చెల్లదు పొల్లగు మచ్ఛరమ్ములన్.

ఉ॥ కావున దేవసద్మమును గర్వముతోడన పీడి పొమ్ము లే
దా? వెఱపేది శస్త్రములు దాల్చి రణమ్మున కేగుదెమ్ము నీ
కావర మింతలో నడఁచి కాలునిప్రోలికిఁ బంపి స్వర్గ మా
దేవతలందు నిల్పెద విధేయులఁ బ్రోచుట నాకుఁ జెల్లదే॥ ౨౦౩

వ॥ అని మహిషునకుం జెప్పుము పొమ్ము నావుడు మంత్రి య
య్యంబిక కిట్లను॥ ౨౦౪

ఉ॥ ఎక్కడిమాట లియ్యవి! మృగేక్షణ! యౌవనగర్వసంపదన్
మిక్కిలి మీఱి పల్కెదు సమిద్ధపరాక్రమశాలి మావిభుం
డెక్కడ! బాల పీ వతని నెక్కటిపోరున నిగ్రహించు లా
వెక్కడ! నమ్మశక్య మగునే! విను మాతనిశౌర్యసంపదల్. ౨౦౫

ఉ॥ ఆతనిసైన్య మొక్కవిధ మైనది కాదు రథాశ్వనాగము
ఖ్యాతతమై పదాతినిచయాకులమై తగుఁ గామరూప వి
ఖ్యాతుఁ డతండు నిన్నడఁచు టబ్బురమే! లలితాంగి! దుర్మద
స్ఫీతగజంబు మాలతి నశింపఁగఁ జేయుటయున్ భరంబొకో. ౨౦౬

ఉ॥ నీయెడ మావిభుండు గడు నెయ్యము గల్గి చరించునప్పు డే
మోయువతీలలామ? కఠినోక్తులు పల్కి రసంబు భంగముం
జేయఁగ రామి నీ కిటులు సెప్పెద నుంటి మఱింత యేల నీ
పాియము సార్థకమ్ముగఁ గృపన్ గనుఁగొమ్ము వరింపు మాతనిన్.

గీ॥ అతనిరాజ్యమ్ము ధనమును సఖిలమునుఁ ద్వ, దీయ మగు భృత్యుఁ
డై సేవఁ జేయుఁ బట్టి, రాజ్ఞివై మమ్ముఁబాలింప రాదె! భక్తి, భావ
మున నీకు మ్రొక్కెదఁ బంకజాక్షి. ౨౦౮

వ॥ అని బహుభంగుల సామపూర్వకమ్ముగాఁ బోధించువానికి
నయ్యంబ యిట్లను. ౨౦౯

ఉ॥ నీదగు తెల్వితేటలును నేర్పును నింతియ నిన్ను మంత్రి గా
నూఁదినవానికిం దెలివి యొప్పునె! యోపశుబుద్ధి! యిద్ద ఱు
న్మాదులు నిద్దఱున్ హతమనస్కులు నిద్దఱు నిద్ద ఱే వృథా
వాద మిదేల! ధాత తగువారిని గూర్చె జగమ్ము నవ్వఁగన్. ౨౧౦

వ॥ ఏను స్త్రీస్వభావమ్మునం జేసి వానిబలపరాక్రమంబు లెఱుంగ నని కదా! ప్రేలితి,వయ్యది నిక్కంబ,ఏను బురుషుండ నొండెం దదనుగుణస్వభావ నగుస్త్రీ నొండె గాకుందు నని వెండియు. ౨౧౧

మ॥ అతిమూఢుం డయి మున్ను మీప్రభువు తా నాసించె స్త్రీచేతఁబం
చత నద్ధాతకతమ్మునన్, వినుము తచ్చాతుర్య, "మెంతే జగు
ప్సితమౌ" నంగనచేతఁ జచ్చు" టని తాఁ జిత్తమ్మునన్ రోయఁడ
మ్మతిహీనుం, డిపు డవ్వరం బెదిరెఁ దా మైమైఁ జనన్ బోలునే.

చ॥ "పురుషుని నన్ను నివ్వనిత పోర నెదిర్చి వధించునే" యటం
చరయక మృత్యు వీనెపము నందిన దంచు నెఱుంగునట్లు మీ
నరపతితోడఁ జెప్ప నొకనాతియ కాదు తృణంబు వజ్రమై
పోరిఁగొనుఁ గాలపర్యయము మూఁడిన నెంతటివానికేనియున్.

వ॥ కాలంబు సమంజసం బగునప్పుడు వజ్రంబేనియుఁ దూలం బగు నట్లగుటఁ దనకుం గలసైన్యమ్ములును నాయుధమ్ములునుఁ దక్కటి సాధనమ్ములును వమ్మగు నిక్కువం బని మఱియును. ౨౧౪

ఉ॥ కాయము దాల్చు వారలకుఁ గాదొకో! మృత్యువు, నిక్క మేరికే
నాయువు నిశ్చలంబె! జలజాసనుఁ డాదిగ నొక్కఁడేని ని
త్యాయితుఁ డున్నె! చావు లరయన్ బలురీతులు, దైవనిర్మితం
బై యిటు తన్ను మృత్యువు రయమ్మున మ్రింగఁగ వచ్చె దుర్మతీ.

వ॥ ఎవ్వని కెవ్విధమ్మున విధించి యుండు వాఁ డవ్విధమునఁ బొలియు, నిట్లుండఁ గొందఱు మూఢులు మాకు వరమ్ము గలదు మే మెవ్వరికేని నవధ్యుల మని విఱ్ఱవీఁగుదు, రట్లు గర్వించినవా రెవ్వరేని శాశ్వతులై యుండిరే! యింతవట్టు నీ ప్రభువునకు బోధించి జీవింపఁ గలఁ డేని హవిర్భాగమ్ములును దివమును దేవాధీనం బొనర్చి తనవారితోఁ బాతాళమ్మున కరిగి యందు సుఖమ్ముగ నుండు నట్లొనరింపుము నావుడు మంత్రి నిజాంతర్గతంబున. ౨౧౬

ఉ॥ ఎక్కువతక్కువల్ దెలియ కియ్యబలామణి ప్రేలుచున్న దీ
చక్కెరబొమ్మయు క్కడఁపఁ జాలియుఁ జాలకపోత రాజు పె

న్మకుక్కవఁ జేసి దీనిఁ దనమానినిఁగాఁ గొన నెంచి పంపిన
ప్డిక్కమలాక్షి యే మనిన నెల్లిదమై చన దింత నిక్క మా. ౨౧౭

వ॥ కా దని యుత్తరుణితో ననికి సంతనకట్టితినేని రసాభాసం బగు నట్లు విరసం బొనర్చి ప్రభుసన్నిధి కేగు టెట్లు సమంజసం బగు! నదియునుం గాక కామాతురుం డగుటతన నతండు నారాక కెదురు సూచుచుండు, నట్టి యెడ నే నిద్దాని జయించినను నిద్దానిచే సమరమ్మున నోడినను నిరుదెఱంగు నతని కప్రియంబ యగుం గా కేమి, యాతని కడ కేగి చక్కఁగా బోధించి పిదప నతనియభిప్రాయానుసరణమ్మునఁ గార్యంబు నిర్వహించెద నిది యల గ్గని యతండు మహిషుపాలికిం జని కృతాంజలియై యి ట్లనియె. ౨౧౮

శా॥ నీయాజ్ఞం గొని యేగి కంటి నచటన్ నీ రేజపత్రాక్షిఁ దే
జో యుక్తిన్ వెలుఁగొందుదాని శరసంస్ఫూర్త్యంచితాష్టాదశ
స్ఫాయద్బాహువిలాస సింహగత నబ్బాలాశిరోమాళితో
నీయందమ్మునుఁ జందముం దెలుపుచు న్నే నిట్లు బోధించితిన్.

ఉ॥ మావిభుఁ డీత్రిలోకముల మన్ననకెక్కినవాఁడు నిన్ను సు
శ్రీ నెలయంగఁ బట్టమహిషీపదమం దొగి నిల్పి సేవకుం
డై వశవర్తియై మెలఁగు నాతనిఁ బొందుము మూఁడులోకముల్
నీ వయి యేలుకొమ్ము రమణీ! యెలప్రాయము సార్థకమ్ము గన్.

వ॥ అనునాపలుకుల కక్కామిని కనలి స్మితం బొనర్చి యిట్లనియె.

మ॥ మహిషీగర్భసముద్భవుం దులువ నమ్మందున్ సురప్రీతి ధూ
ర్వహునై యే బలి యిత్తు శక్తి కకటా! పాపాత్మ! నాబోటికిన్
మహిషుం డా పతి! యెంత హీన యయినన్ మానంబు పెం పేది త
త్సహవాసం బొనరించునే? మహిషి యాఁ దద్యోగ్య తుల్యాకృతిన్.

చ॥ సురలకు వైరియై మిగుల సోలుచు మత్తిలి దుష్టుఁడై యహం
కరణమునన్ జరించుజనకంటకు నమ్మహిషాధమున్ వధిం
తు రయము మీఱ దైత్యతతితోడ రసాతల మేగె నేనియున్
గరుణ దలిర్పఁ గాతు" నని కావర మెత్తి వచించె బెల్చనన్.

వ॥ అంత సేనాదుర్ముఖాదులు యుద్ధమ్మునకు నుంకింప నెంచి రసభంగం బగు నని యోజించి దేవరకు విన్నవింప నిట కరుదెంచితి. ౨౨౩

ఉ॥ అంగనయయ్యు నైక్యుడు మదాలసమై బలముర్ జలంబు ను
ప్పొంగ నిరంకుశంబుగ రణోత్సుకమై చెలువారుదానితో
సంగర మాచరించుట యసాధ్యము కా వగతుర్ జయంబుఁ ద
ద్భంగము నన్న వెయ్యేడల దైవవిధేయము లెంతవారికిన్. ౨౨౪

వ॥ నావుడు మహిషుం డితికర్తవ్యతామూఢుండై వృద్ధులగు మంత్రుల రావించి యీయంగన దేవప్రేరితమై చనుదెంచిన శాంబరి యగుమాయ యగుం గాకేమి మీర లుపాయజ్ఞుల రిందు సామాదుల యం దెయ్యది ప్రయోజ్యం బగు విశ్వాసార్థంబు గా వచియింపుఁ డనినవార లిట్లనిరి. ౨౨౫

గీ॥ సత్యమై ప్రియమైనవచనము పలికెఁ, దెలుపు టుచితంబు రెంటికిఁ
దొలఁగకుండు, మాట దొరుకదు రుచ్యమై మందు రోగహారి యగు
టెందు దుర్లభం బంద్రు బుధులు. ౨౨౬

గీ॥ అనృతమునఁ బ్రీతి పుట్టించు నతికపటులు, వేనవే లుంద్రు సత్యమ్ము
వినుచువాఁడు, వినెడివాఁడును దానిని మనన చేయు, వాఁడు
మూఁగుటప దుర్లభుల్ పార్థివేంద్ర. ౨౨౭

వ॥ కావున నెడ తెగనియిమ్మహాకార్యమ్మునందు నీ కెట్లు ప్రీతికరుల మయ్యెద మదియునుం గాక రాఁబోవుశుభాశుభమ్ము లెవనికి వేద్యమ్ము లనవుడు మహిషుండు మంత్రుల కిట్లను. ౨౨౮

క॥ తప్పేమి మీకుఁ దోఁచిన, యొప్పున వచియింపుఁ డిందు యుక్తి
యుతంబై, చొప్పడువానివచనముర్, గొప్పఁగఁ జేసి కయికొందుఁ
గోర్కె దలిర్పన్. ౨౨౯

మహిషుండు దేవికడకుఁ దామ్రుం బంపుట

వ॥ నావుడు విరూపాక్షుం డనుమంత్రిశ్రేష్ఠుం డతని కిట్లనియె.

చ॥ అనృతము సాహసమ్మును మృగాక్షులసామ్మని నీ వెఱింగి యి
వ్వనిత ప్రగల్భవాక్యములఁ బొల్తిమ గోల్పడఁ జెల్లునే! యొకం

డసక నను౯ వెస౯ బనుపు మవ్వనిత౯ వధియింతు నొండెఁ గా
దనినను నాగపాశముల నంటఁగఁ గట్టెద నిన్నుఁ జేర్చెద౯. ౨౩౦

వ॥ పిదపఁ జేయునది లేక వశవర్తినియై నీకోరినయట్ల వివిధ భోగమ్ములం దేల్చి నీయం దనురక్తయై యుండు నిది నాకుం దోఁచిన తెఱంగు త్రిలోకవిజయం బొనర్చిననీబోటి కొక్కబోటికై యింత తలంక వలయునే? యిది బిభీషికామాత్రంబ కాని వేఱొండు గాదు నావుడు దుర్ధరుం డనుమంత్రి యిట్లనియె. ౨౩౧

మ॥ అనుమానమ్మునఁ జూడ నవ్వనిత కామాసక్త గాఁ దోఁచె నం
గనలం దిట్టిబిభీషికల్ గలవు వక్రప్రక్రియం బూరుషుం
గని లోఁగొందురు హావభావవిదు లాకర్షింతు రీచెయ్వి, లి
వ్వనజాక్షీమణి నిన్నుఁ గోరి యిటు పైపై వక్రతల్ సూపెదు౯.

చ॥ "శరము లనిన్ జయింతు" ననె సారసగంధి, తదర్థ మన్యగో
చర మగు టెట్టు! లమ్మదనశాస్త్రమెఱింగిననాకుఁ దక్క, భూ
వర! శరముల్ కటాక్షములు, వ్యంగ్యవిధి౯ గ్రహియింపు తత్పరం
పరలు నిగిడ్చి నిన్ను వశవర్తిగఁ జేయుతలంపు గాఁ దగు౯. ౨౩౩

వ॥ అమ్మగువ వచియించిన వాక్యమ్ముల కెల్ల నర్థం బిట్లన యోజింపవలయు నట్లు గాదేనిఁ ద్రిలోకమ్ములం జయించి హరిహరాదులఁ జీరికిం గొనక నిష్కంటకమ్ముగ రాజ్యంబు శాసించునీపయి నొక్కయబల బాణపాతం బొనరించు టది యేటిమాట! ఇఁక నొక్కటి యవధరింపుము "బాణప్రయోగం బొనరించి నిన్నుం బడవైచెద" నని కదా! యత్తలోదరి పలికె "పడవైచెద" ననుటకు వ్యాఖ్యానం బవధరింపుము. ౨౩౪

చ॥ మొదలఁ గటాక్షపాతమున మోహితుఁ గా నొనరించి మీఁద దు
ర్మదమున యుద్ధరంగ మనుమంజులశయ్య బలాత్కరించి నీ౯
జదురుగఁ బండఁ బెట్టి పురుషాయితబంధమున౯ గరంతు నం
తదనుకఁ దాళు" మంట యది తత్త్వము దూత కెఱుంగఁ బోలునే.

వ॥ మఱియు నిన్ను విగతప్రాణుఁ గా నొనరింతు ననుటకు నర్థంబు వినుము "ప్రాణం" బనఁ దేజంబు "దాని నపహరింతు" ననుట, ఉత్తమాంగనలు వ్యంగ్యప్రధానమ్ముగాఁ గాముకు వరియించుట గామశాస్త్రసమ్మ

తంబు నీ వజ్ఞుం డగువానిం బంచిన వాని కీయర్థంబు గోచరం బగునే యని వెండియు. ౨౩౬

ఉ॥ సామము దానముం గొలిపి చందనగంధినిఁ బొందు మొందు లే
దీమెయి నీ కుపాయ; మది యెంతటికిగర్వము నేనిఁ దాల్పుఁ గా
కేమి! మఱెంత కోపవతియే నగుఁ గా కిటు చేసినన్ వశం
బై మఱుఁగున్ గ్రిమమ్ముగ, మృగాక్షులభంగులు వక్రివక్రముల్.

క॥ పలుమాట లేల యచ్చిలు, కలకొలికిం దెచ్చి నీకుఁ గానుక సేయం
గల నన్నుఁ బనుపు మావలఁ, గలపని నేఁ జూచికొనెదఁ గా కను
రేందా్రి. ౨౩౭

వ॥ అని పలుకునతని కడ్డంబై తామ్రుం డి ట్లను «మహాత్మా యియ్యది గామాతురయు వ్యంగ్యార్థచతురయు నీయందనురక్తయుం గామి నిశ్చయంబు. ౨౩౮

ఉ॥ ఆదర మూఁది నాపలుకులందలియర్థము సంగ్రహింపు మ
ష్టాదశబాహువుల్ నిశితసాయకముల్ గలదీనివంటిబల్
గాదిలివన్నెలాఁడి నొకకాలమునందును నెందుఁ జూడఁగా
రా దిది యెద్దియో కడు భరంబుగఁ దోఁచు నరిష్టహేతునై. ౨౪౦

వ॥ దీని కనుగుణమ్ముగ నాకుఁ బెక్కులు దుస్స్వప్నమ్ము లింతకు మున్న ప్రతిదినమ్మును బొడముచున్నయవి నేఁటియుషఃకాలమ్మున నొక్క కాంత కృష్ణాంబరధారిణియై యేడ్చుచు గృహాంగణమ్మునఁ బొడకట్టె నిది యిట్లుండ. ౨౪౧

క॥ ప్రతిదినమును వికృతములగు, రుతు ల డర విలక్షణంపుఁగూపునఁ
దగు పక్షితతులు గృహములపై రాత్రితటిన్ గూయంగఁ దొడఁగె
దేవర ! వింటే. ౨౪౨

వ॥ ఈదుర్నిమిత్తమ్ముల కెద్దియేని నొకకారణం బేర్పడ వలయు నియ్యెడ యుద్ధరంగమ్మున సన్నద్ధయై యున్నయంగన గంధర్వియు మానుషియు నాసురియుఁ దదన్యయుం గామి తెల్లంబు దేవప్రేరిత యైన యొకమాయ గా వలయు నెట్లేని నగుఁగాక సాగరమ్మునకు సంతన కట్టి వెడలుట కర్జంబు జయాజయమ్ములు దైవాధీనమ్ము లగుట బుధం

డప్పట్లు నిర్భయుండు గావలయు శుభాశుభమ్ము లేరికిని వార్యంబులు గావు నావుడు మహిషుం డతని కిట్లనియె. ౨౮౩

ఉ॥ నీవచనమ్ము లింత దగునే చను మిప్పుడ యుద్ధమందు బల్
చేవ యెలర్ప నవ్వనిత లీలమెయిన్ వశఁగా నొనర్చి యుం
దేవెర వయ్యోనేని యిటు తెమ్మటు దక్కినఁ దీవ్రబాణముల్
ప్రోవులు గా నిగిడ్చి జము ప్రోలికి దాసి నొనర్పు మేడ్తెలన్.

ఉ॥ వీఁరుడవై స్మరాగమవివేకివి నాఁ గర మొప్పు నీదుగం
భీరత నేఁడు చూడవలె వే చని వేగిరపాటు దక్కి యం
భోరుహ నేత్రి యియ్యెడకుఁ బోరఁగ వచ్చెనో! పొందవచ్చెనో!
నేరుపుమైఁ గనుంగొనుము నిక్కమెఱింగి దొడంగు మాజికిన్.

గీ॥ కేవలము నిర్దయుండవై కినియ కత్త, లోదరీమణి నెమ్మది నున్న తెఱఁగు, నరసి యప్పటి కనుకూల మైనవలని, ననుసరింపుము పొమ్ము జయమ్ముఁ గొమ్ము. ౨౮౬

వ॥ అని యాన తిచ్చినఁ దామ్రుండు కాలవశుండై సైన్యమ్ములు గొలువ మహిషునకు నమస్కరించి వెడలి యెడనెడఁ బొడము దుర్నిమిత్తములు గణింపక చని ముందట. ౨౮౭

క॥ హర్మ్యతలమ్ముపై నెక్కి యు, వార్యాయుధహస్త యగుచు నలరెడి యుద్య, ద్ధైర్యఁ గనె లోకనాయిక, నార్యన్ దివిజావళీసమారాధ్య పదన్. ౨౮౮

వ॥ ఇట్లు చని దాదవ్వుల నిలిచి సయుక్తికమ్ముగ వినయపూర్వకమ్ముగ నిట్లనియె. ౨౮౯

ఉ॥ శృంగి నెఱుంగు దే! యతఁ డజేయపరాక్రముఁ డెల్లరూపు లా
రం గొన నేర్చువాఁ, డబల! రాక్షసశేఖరుఁ డావిభుండు నీ
కుం గడు లోఁగి నీదుగుణకోటి గుణించుచు రూప మెంచి పా
ణిం గ్రహియింపఁ గోరెడు గణింపఁ దరంబె భవద్విశేషమున్.

## తామ్రుండు దేవితో సంభాషించుట

క॥ మాయేలిక కేలికవై, నీయిచ్చకు వచ్చినట్లు నిర్జరభువన
స్థాయినివై నందనమునఁ, బాయక విహరించుకంటె భాగ్యముకలదే.

ఉ॥ సుందర మైన దేహ మిటు చొప్పడె నీకుఁ బురాకృతంబు మే
లందిన దాన వౌట నకటా! యిది యెట్లు ఫలించు! మావిభుం
బొంది సుఖింపవేనిఁ బువుఁబోఁడిరో! కల్పకసూనవిస్ఫుర
త్కందుకముల్ ధరింప కిటు కత్తులఁ బూనఁగ నేల పాణులన్.

ఉ॥ మానిని! యేలొకో! తెలివి మాలి ధరించితి చాప మస్త్ర సం
తానముతోడ భ్రూలతలు నాఁకెపుఁజూపులుఁ దత్తదర్థ సం
ధాన మొనర్పఁ జాలవొకొ! తన్వి! సుమమ్ములఁ బూని యైన నె
వ్వానికిఁ బ్రీతి గాని యసి పల్లవపాణికి నీకుఁ జెల్లునే. ౨౫౩

వ॥ అదియునుంగాక నిన్నొక్కఁడు వచియించెద యుద్ధమ్మునకన్న సంసారికి నేటొండు దుఃఖమ్ము లే దైనను లోభాదృతులై యుద్ధానికి మదాంధులు సమకట్టుదురు నీబోఁటిబోటికి య్యది యేల యనుగ్రహించి దేవదానవపూజితుండై లోకమ్ములెల్లఁ దానయై యతిశయించు మస్మదధిపతి మహిషాసురు వరియించి పట్టమహిషివై యిష్టోపభోగమ్ము లనుభవింపుము సంగరమ్మున నేరకేని జయంబు సంశయగ్రస్తం బింతయు నీతివేదిని వగు నీకుఁ జెల్లింప యని వెండియు. ౨౫౪

చ॥ అతని వరించి యౌవనమునందు సుఖమ్ములు గూడఁ బెట్టి ని
ర్జితసురనాథుఁడై మహిషుచేవకు మించెడివాని లోకసం
స్తుతుఁ సుతు గాంచె దీవు కడు సుందరుఁ డత్తనుజుండు మీఁద దై
త్యతతికి రా జగున్ దనముధాటి సురాసురులెల్ల మెచ్చఁగన్. ౨౫౫

వ॥ అను తామ్రమునివచనమ్మును విని మేఘగంభీరభాషణమ్ముల నయ్యంబిక యిట్లనియె. ౨౫౬

శా॥ ఓరీ తామ్రము! కటుప్రలాప! విను మీయుక్తుల్ సహింప న్ననుం
దేరం బంచినవానితల్లివలె గేదె న్నేను గా, నట్టి దు
ష్ప్రారంభున్ యవసాశి నమ్మహిషుఁ గామార్తున్ వరింపంగ నా
కేరితిం దగుఁ బుచ్ఛముం దురుసరం బేలీల నేఁ దాల్చెదన్. ౨౫౭

చ॥ హాఁ హరనీరజాసనుల నష్టదిగీశులఁ గోర కక్కటా!
సురుచిరమూర్తి యంచుఁ దను సూనశరార్తుఁ దృణాశి శృంగి నే

వరునిఁగఁ బొంది లోకమున వారనిదుర్యశ మంద వెట్టిసుం
దరిసె! పశున్ వరింపఁ దగుతన్వియుఁ గల్గెనె యేయుగమ్మునన్.

వ॥ అదియునుంగాక నిర్గుణుండును నిర్మముండును సర్వసాక్షియు సర్వకర్తయు నకర్తయు సర్వజ్ఞుఁడును సర్వగుఁడునుఁ బూర్ణుండునుఁ బూర్ణాశయుండును శివుండును శాంతుండును సర్వభావనుండు నగుపురుషుండు మద్భర్త, అతనిఁ ద్యజించి హేయతాభాజనమ్మగు దేహమ్మునం బొల్చుమందాత్ము నధముఁ దన్నె మని వరియింప నుంకింతు నని వెండియు. ౨౫౯

ఉ॥ శాతశరాళిఁ గాలుమహిషంబుగఁ జేసెద మీవిభున్ మరు
ద్భ్రాతికిఁ దక్కి భీతిమెయిఁ బోయి రసాతల మంటియున్న న
క్కాతరుఁ గాతు నింతయునుఁ గ్రక్కునఁ బోయి వచించి యుద్ధపుం
జేతకుఁ బిల్వు మత్తులువఁ జెచ్చెర వచ్చినఁ ద్రుంతు వ్రేల్మిడిన్.

శా॥ భగ్నాశుండు ననున్ వరించునె! మదప్రాగ్భారదుర్వారధీ
మగ్నాత్మున్ మహిషాధముం దను నికామప్రోజ్జ్వలన్మ్రమకా
స్త్రాగ్నిజ్వాలల వ్రేల్తునంచెలుఁగఁడౌరా! తామ్రా! యంచున్ రిపుల్
భగ్నప్రాభవులై కలంగ రవముం బూరించె ఘోరమ్ముగన్. ౨౬౧

శా॥ స్వాస్ఫాదుర్భర మైనయారవమునన్ సప్తాంబుధుల్ దూలె నం
తర్భారంబు సహింప కద్రులు ప్రతిధ్వానమ్ము లిచ్చెన్ భయా
విర్భావమ్మున దైత్యసంఘములు కంపించెన్ దదీయాంగనా
గర్భమ్ముల్ పగిలెన్ దిశావలయ మేకం బాయె నొక్కుమ్మడిన్!

ఉ॥ ఆరవ మాలకించి భయ మంది పలాయనశాలి తామ్రుఁడెం
దేరయ మార నమ్మహిషధీరుని సన్నిధి కేగ మున్న త
త్పౌరులకర్ణముల్ బధిరభావము దాల్చె ననంతరంబు నా
గారియు గర్జిలెన్ ద్విగుణ మయ్యె భయమ్ము సురారికోటికిన్.

వ॥ పిమ్మట మహిషుండు భయత్రస్తుండై తనకడ కరుదెంచిన తామ్రుం గాంచి సచివులదిక్కు మొగంబై చింతాదంతురం బగుచిత్తమ్మున నుత్తలపాటు గదుర నిట్లనియె. ౨౬౪

మ॥ గరువం బేది రసాతలమ్మునకుఁ బోఁగా నెంతుమో! దుర్గ మె
వ్వరికిం భేద్యము గానిరీతి నొనరింపం జూతుమో! లేక సం
గరరంగమ్మున నత్తలోదరిఁ గదుక్ గారింతుమో! యెంచి మీ
ర్వరబుద్ధుల్ వచియింపుఁ డియ్యెడల శాస్త్రప్రక్రియాధుర్యులై.

గీ॥ మంత్రిమూలంబు రాజ్యంబు మహీపతులకు, నదియు గుప్తమ్ము గా
వలె నట్లు గాని, చో వినాశమ్ము గలుగు నిచ్చో ననుగుణ, మైనవలను
విచారింపుఁ డయ్య మీరు. ౧౬౬

ఉ॥ వచ్చినకాంత గా దబల; వైళమ పోయి జయింప రాదు తా
నచ్చపలాక్షి యెక్కటిగ నాహవకేళికి నిర్భయమ్ముగా
వచ్చుట కొంత చింత్య మగు వారక పోరితి మేని మీఁద మే
ల్వచ్చునొ! కీడు వచ్చునొ! శుభం బశుభం బెవఁ డోపుఁ జెప్పఁగన్.

వ॥ ఉపాయవాదులు కొందఱు దైవం బన నెద్ది యెవ్వఁ డెఱుఁగు నోపినవట్టు యత్నం బొనరించుట కర్జం బందురు కొందఱు దైవమ్మును నుద్యమంబును గార్యసిద్ధిప్రదంబు లని చెప్పుదురు మీమీబుద్ధిబలమ్మున నిం దెయ్యది శ్రేయమో వివరింపుఁ డనుడు బిడాలుం డనుమంత్రి యతని కి ట్లనియె. ౧౬౮

సీ॥ మహిషేంద్ర వింటె! యిమ్మహిళ సురప్రేరణంబున నిటకు యుద్ధం
బొనర్ప, నే తెంచె నిక్కాంత యెల్ల సురలయంశములఁ బుట్టుటయు
నిక్కముగ నెఱుంగ, నయ్యె స్త్రీభీతు ని న్నమరులు వంచింప ని
ప్పాట యోజించి రిక్కతమునఁ, గాదె దానవ్వులఁ గదిసి యెల్లరు
సహాయులు గాఁగ నుంకించు చున్నవారు, గీ॥ మనము రణమున
కేగిన వనజనేత్రుఁ, దొట్టి సురలెల్ల నసురుల గిట్టఁ జేయఁ, గడఁగు
దురు నిన్ను మాత్ర మక్కాంత చంపు, నెఱిఁగి తగుయత్న మొనరింపు
మింత నిజము. ౧౬౯

వ॥ నాబుద్ధికిఁ దోఁచిన విధమ్మునఁ జెప్పితి భవితవ్యం బెఱుంగ నంత సమర్థుండనే! నీ కెయ్యది సులభం బగు నట్లు పచరించునది యేకా కినియై కామిని యుద్ధార్థిని యగుట యెంతకేనియు నక్కజం బగు నను నంత దుర్ముఖుం డనుసచివుం డి ట్లనియె. ౧౭౦

చ॥ జయ మిక నీకు లేదనుట సత్యము నావచనంబు తప్పదె
ట్లయినఁ "బలాయనంబు వర" మన్న సురావళి నెల్ల నోర్చి యొ
క్క యువతి కిట్లొనర్చుటయుఁ గాదు రణంబొనరించి వచ్చినన్
బయి నెగడున్ యశంబు జయపక్షమునన్ సుఖ మప్రమేయ మౌ.

వ॥ అనిన బాష్కలుం డిట్లనియె.

ఉ॥ ఏ నొకరుండనే చని జయించి యమాలయ మేగునట్లు ల
మ్మానినిఁ జేయువాఁడ ధృతిమంతుఁడ నయ్యు నధీరుభంగి నీ
కౌనె భయమ్ము చెంద; నమరాధిపుఁ దొట్టి దిగీశులెల్లరన్
దీనులఁ జేసి యిక్కరణిఁ దేకువ దక్కుదురయ్య! శాంతకున్. ౨౭౨

గీ॥ ఈవు సంగ్రామమునకు రానేల! యన్నఁ, బంపుమొక్కింతమాత్రి న
ప్పడఁతిఁ జంపిఁ, మగుడి నీకడ కరుదెంతు మహిషరాజ, మామకీన
బలంబు సామాన్యమయ్య! ౨౭౩

వ॥ అంత దుర్ధరుండు వినతుండై యిట్లనియె.

ఉ॥ నీ కయి దేవతల్ మిగుల నేర్పునఁ బన్నినయాలతాంగి మా
యాకృతి నొక్క వేల్పుడి శితాస్త్రపరంపరలన్ వధింతు నా
నాకుల శాకులత్వము రయమ్మునఁ గూర్తు బిభీషికార్థ మీ
రాక మొఱుంగు, మింతయుఁ గరంబు తిరంబుగ నిర్వహించెదన్.

వ॥ అంతియకాని రాజనీతివిరుద్ధం బగు తెరువునఁ బోవలదు మఱియొక్కటి వినుము లోకమ్మున సేవకులు సాత్త్వికరాజసతామస భేదమ్మున మూఁడు తెఱంగులవా, రందు సాత్త్వికులు స్వామికార్యమ్ములు సాధించుచుఁ దదవిరోధమ్మునం దమకార్యమ్ములు నిర్వహించుదురు రాజసులు స్వకార్యతత్పరులై యొక్కొకతఱిని స్వామికార్యంబులను యదృచ్ఛగా నిర్వహించుదురు తామసులు స్వామికార్యంబు దిగఁద్రొక్కి స్వకార్యతత్పరత్వమ్మునవల నగునెడ మాత్సరం గలసి ప్రభుచ్ఛిద్రమ్ములు వెలిఁ జేయుచుఁ గోశగుప్తం బగునసివఘువున భీతిం గొలుపుదురు. ౨౭౫

క॥ కావునఁ దాదృశులగు దు, ర్భావులనమ్మంగఁ జనదు ప్రభువులు మంత్రం
బా! వెలికిఁ బోవు కార్యం, బా! విపరీతించు నట్టి యదయులకతనన్.

## బాష్కలదుర్ముఖులు దేవితోఁ బోరుట.

వ॥ అట్లగుట నీవు నిశ్చింతమ్ముగ నుండు మేమును బాష్కలుం డునుం గలసి యరిగి యస్వామినిం జయించి నీకడకుం దోడి తెత్తు మని యిరువురును గృతనమస్కారులై దిక్కులు ప్రక్కదలఁ బురమ్ము వెలువడి దేవిం గాంచి యిట్లనిరి. ౨౭౭

ఉ॥ ఓనలినాయతాక్షి! విను మొక్కఁడు పంచెద మేము నిన్ను, మా
దానవనాయకుర్ మహిషుఁ దత్పరతర్ వరియింపు మాతఁడుర్
మానవ హాప మంది నిను మన్ననఁ జేయు రహస్యమందు; దు
ర్మానము మ్మై ననిం గడఁగి మానముఁ బ్రాణముఁ గోలుపోదురే.

వ॥ కామహాపుఁడగు మా రాజుతో సకలభోగమ్ము లనుభవించుచుఁ ద్రిలోకవమ్ముల కేలికవై యేలికొమ్ము నావుడు దేవి యిట్లనియె.

గీ॥ ఎంత కాపురుషుఁ డైనఁ దా నేలతాంగి, యధముఁ బశువు వరింపఁ
గ నాత్మ నెంచుఁ, గులము శీలమ్ము గుణమును గలుగుతగిన, వరుని
వరియించుఁ గన కంత వలయునేని. ౨౮౦

చ॥ వెడ వెడ మాట లాడుచు బభీషిక లిమ్మెడఁ జూప కింక మీ
యొడయనియొద్ద కేగి సమరోన్ముఖుఁడై చనుదెంచునో! భయం
బడర రసాతలమ్మునకు నై చనునో తెలియంగఁ బల్కి యి
మ్మెడ కరుదెంచి నొద్ద డీక నే సహాయింప మురుక్కు లాడినర్.

సీ॥ ఆకరినోక్తులర్ విని దురాత్ములు దైత్యులు బాణవృష్టి పెం
జీఁకటి గ్రమ్మఁగాఁ గురియఁ జెచ్చెర నజ్జగదంబ సింహనా
దాకులులై రిపుల్ బెదర నంపగముల్ నిగిడించె నంత దు
ర్ధరుఁడు బాష్కలుండు చనుదెంచెఁ జమూతతి కగ్రగామియై. ౨౮౧

కం॥ ధట్టుండై యస్త్రమ్ములు, నెట్టన నద్దేవిమీఁద నిగిడించిన న
ప్పట్టున నయ్యంబయుఁ దా, బెట్టేసె శరములు వేనవేలు గడంకర్.

వ॥ ఇట్లు బాణపరిఘాసిఘాతమ్ముల నిరువురుం దుములమ్ముగాఁ బోరుతఱి. ౨౮౪

శా॥ ఆకర్ణాంతము చాపముం దిగిచి పంచాస్త్రమ్ము లద్దేవి య
స్తోకాహంకృతి వానిపై విడువ నాసోఁ కన్నిటిం ద్రుంచి ని

ర్భికుండై యొకయేడుబాణముల దేవిం గొట్టి బిట్టార్చె రా
(దాకారమ్మున నంబయున్ దశశితాస్త్రావిద్ధుఁ జేసెన్ రిపున్.

ఉ॥ వానిశరమ్ములం దునిమి వాఁడిశరమ్ముల నోప నేసి య
మ్మానవఖాదిచాప మసమానరయమ్మునఁ ద్రుంచి సింహనా
దానుగతింఁ జెలంగె జగదంబ, సురారి గదాత్తహస్తుఁడై
పూనిక నేగుదెంచె నలపుష్పసుగంధినిఁ బిల్లుమార్పఁగన్. ౨౮౬

మ॥ అటు లేతెంచెడిబాష్కలుం గని గదన్ హస్తమ్మునన్ బూని యె
క్కటికయ్యమ్మున మూర్ఛవో నడఁచె నక్కంజాక్షి; వాఁ డంతలోఁ
బటువేగమ్మున మూర్ఛఁ దేఱి గద వైవన్ దాని వారించి మి
క్కుటమా శూలమున న్నిలింపరిపునక్కుం జించె నయ్యంబయున్.

ఉ॥ శూలము దాఁకి బాష్కలుఁడు సోలి యమాలయగామియై మరు
జ్జాలమువంత దీర్చె నది సైఁపక దుర్ముఖుఁ డాగ్రహమ్మునం
దూలుచుఁ దేరి నెక్కికొనిలు తొయ్యలి! యెక్కడ కేగ వచ్చె ని
న్నాలములోఁ బొరింగొనెద నంచు శరమ్ముల ముంచి యెత్తెనన్.

ఉ॥ వక్త్రము జేవురింప సురవైరులు భీతిల శంఖనాద సం
సక్తములై దిశల్ గలఁగ శక్తి గుణారవ మాచరించి త
న్ముక్తములైన మార్గణసమూహముల్ బొడి చేసి వానిపై
శక్తిముఖాయుధమ్ముల నసంఖ్యముగాఁ బరఁగించె నుద్ధతిన్. ౨౮౯

వ॥ అంత దుర్ముఖుండు తత్తదాయుధమ్ముల నాత్మసాధనమ్ముల
మరలించుచు నుక్కు మిగిలి యంబికపై ననేకశరమ్ముల నిగిడించుచుఁ
బోరాడునవసరమ్మున సంగరమ్ము దుర్భరం బయ్యె. ౨౯౦

క॥ అంబచే ననిఁ జచ్చినయమరశత్రునికరములగాత్రములనుండి నెగసి
రక్త, మేరు గట్టె శివాకాకగృధ్రసార, మేయములకెల్ల సంతోష
మాయతముగ. ౨౯౧

ఉ॥ దుర్ముఖుఁడున్ బ్రకోపగతి దోఁపఁగ హస్తము నెత్తి పల్కు దు
ష్కర్ముఁడు; వింటె యోజలజచారువిలోచన! మానృపాలు నం
తర్మద మేది పొందు మటు దక్కిన నిన్ బరిమార్తు నుజ్జ్వల
ద్ధర్మవిముక్తతీవ్రనిశితప్రదరమ్ముల పాలు సేయుచున్. ౨౯౨

ఉ॥ దుష్కర మైనకోపమునఁ దోఁగుచు నంబయు వానిఁ బల్కు “మీ
బాష్కలుఁ డేమి యయ్యె ర యపాత్ర! యపత్రపఁ దక్కి దుర్మదా
విష్కరణంబు సేయఁ గలవే యిఁకఁ గాలము డగ్గఱె న్యె నీ
శుష్కవచఃప్రసంగములు చూచెదఁ జక్కఁగ నిల్వు మాజికిన్. ౨౯౩

ఉ॥ శాత్రవుఁ డంబ పల్కులకు సైఁపక కోపకరాళవక్త్రుఁడై
మాత్రిన నించె నెక్కుడగు మార్గణముల్ ధృతిఁ బూని యాజగ
న్నేత్రి శరమ్ముల న్నఱికి నీఱుగఁ జేసి యొకంట వాని దు
ర్గాత్రము గ్రుచ్చె నిక్కరణిఁ గర్కశ మయ్యె రణమ్ము వారికిన్.

ఉ॥ శూరులు మెచ్చఁ గాతరులు సోలి భయంపడ నొక్కట న్నిలిం
పారిశరాసనమ్ము దునుమాడి శరమ్ముల నేనిటన్ వెసన్
దేరు బడల్పడ న్నఱికి దేవి భయంకరమూర్తిగాఁ గ దే
వారి గదం గ్రహించి రయమారఁగ సింగముఁ గొట్టె బిట్టుగన్.

శా॥ తత్తాదృక్షగదాభిఘాతహతమూర్ధం బయ్యు హర్యక్షము
న్నత్తప్రక్రియ నీడఁ బోక నిలువ న్దర్వారి కోపించి యు
ద్వృత్తిప్రస్థితిఁ బైకి రాఁ గని కనత్ఖడ్గంబు చేఁ బూని సం
కృత్తస్ఫీతకిరీటమస్తకునిఁ గా నేసెన్ సురల్ మెచ్చఁగన్. ౨౯౬

వ॥ ఇట్లు దుర్ముఖుండు సమసిన హతశేషులైన రక్కసులు పలాయమానులై యరిగిన మహిషుండు వారలం గాంచి “యేమియయ్యె” నని యడిగి కలతెఱం గెఱింగి క్రోధమ్మును సంతాపమ్మును బెనఁగొనఁ దక్కటిమంత్రులం గాంచి. ౨౯౭

గీ॥ అక్కటా! బలవంతులై యమరవరుల, నోర్చి పెంపెక్కినట్టి యీ
యోధు లిట్లు,పత్తురే యాఁడుదానిచే శక్య మగునె,కాలయోగమ్ము
దాఁట నొక్కనికినేని. ౨౯౮

## చక్షురతామ్రుల యుద్ధము.

వ॥ అని వనటం గుందురాజు నాలోకించి చక్షురుండు దేవా! యింత వగవ నేల నే నేగి యీక్షణంబ యమ్మానినిం బొరిగొందు నని యాజ్ఞం గొని తామ్రుండు దనకు బాసటగా దిక్కులు పిక్కటిల్ల సింహ

నాదమ్ము గొనర్చి పేర్చు దైత్యచమూసమూహమ్ములతోఁ గదలి చను
దెంచుచుండె నవ్వాని దౌదవ్వులం గని. ౨౯౯

ఉ॥ అంబిక ఘంటికానినద మారఁగ శంఖరవం బొనర్చి ప్రో
యం బిగలాఁగ శింజినియు నద్భుతరావ మొనర్చె దాన భీ
తిం బడి పాఱుదైత్యులగతిం గని చక్షురుఁ డాఁగి పల్కె నై
జంబు వధింతు నియ్యబల లా నని నేటికి నిల్వుఁ డుద్ధతిన్. ౩౦౦

మ॥ అని చాపమ్మును గేలఁ బూని జనితాహంకారదుర్వారుఁ డ
య్యని నద్దేవినిఁ గాంచి యిట్లను మహాక్రోధోగ్రమ్మునన్ బ్రోయునిన్
గని భీతిల్లెడివాఁడఁ గాను వినుమీ కంజాక్షి! నిం జంప నె
మ్మన మెంతే వెనుదీయుచున్నయది సంభావించి దోషస్థితిన్. ౩౦౧

ఉ॥ అక్కట! చారునేత్రలు కటాక్షములన్ గురిపించి సంగరం
బెక్కటిఁ జేయుటల్ గలుగునె మ్మొయి నో సరసీరుహాక్షి! నీ
వెక్కడ! కర్కశాస్త్రముల నేయుట లెక్కడ! పుష్పమేనిఁ బై
మిక్కిలి పెచ్చునీదునును మేనిపయిం బడె నేని యుగ్రసీ. ౩౦౨

గీ॥ శాస్త్రధర్మానుభవుల జన్మ మెంత, నిర్దయాత్మక మొమ్మొయి నెమ్మి గ
లిగి, పెంచుకొను దేహము ను గనుఁ గొనెదమ్ము, గాఁ దలంపక ఖం
డింత్రు విద్ధతతులు. ౩౦౩

క॥ ధనలోభమ్మునఁ గత్తులు, గొని పగలన్ బొడిచి తృప్తిఁ గొందురు
లోకం,బున మూర్ఖు లెంత కేనియుఁ, జొనుపుం దంభము ధనము
సుందరి! యెందున్. ౩౦౪

చ॥ తెలిసినదాన వయ్య నీవు కేఁకనఁ దక్కు లతాంగి! భోగ
మ్ములగుసుఖమ్ములన్ విడిచి పోరొనరింపఁగ నేల పేర్మి నా
పలుకులు సమ్మతించి సురపాలుర నొంచి దివంబు గొన్న భీ
పలలితు మావిభుం గొని కరంబు ను ప్రముఖమ్ముల దీర్ఘ ప్రముక్కదన్.

ఉ॥ కత్తులు హస్త శస్త్రములు గాడి శరీరము భిన్నభిన్నమై
మిత్తికిఁ బాలుగాఁగఁ బయిమిక్కిలి పక్షులు కంక గృధ్రముల్
నెత్తురు గ్రోలి మాంసమును నెమ్మి మెయిం దిని యాడ్చు నక్కటా!
మెత్తురు సత్త్వ నీల్గము లని మేటిగ నేమిగుణంబు చూచిరో. ౩౦౬

క॥ అనిఁ దెగినవారలకు నా, కనివాసము గలుగు నండ్రు గాకే మది
మెం, త నిజము తెలియదు నాబు, ద్ధిని విని మారాజు నెనయఁ
దివురు మృగాక్షీ. 302

చ॥ అన జగదంబ వల్కుఁగడు నాఁడికూఁతలు గూయఁ బోకు శా
స్త్రవిధివి వోలె నీల్గెదవు రాజులనీతి నెఱుంగు దే? మహా
జనసహవాస మెయ్యెడల సల్పక కాఁకెనుబోతునేస్త మం
దిన నినుబోటికిం దెలియునే! శ్రుతిగమ్యము లైనధర్మముల్. 30౮

చ॥ సురలకుఁ జెట్ట చేసి కడుశూరుఁడువోలె మదించినట్టి ము
ష్కరు మహిషాఖ్యుఁ జమునిసద్మము చేరఁగఁ జేసి శాసనా
క్షరములతో జయార్థ మగుకంబము నియ్యెడ నిల్పుదాన సు
స్థిరత యొఱర్ప నిల్చి యని సేయును నీ మొదలక వధించెదన్.

వ॥ జీవితేచ్ఛాగ్రంథిగ్రస్తుండ వయ్యెదేని నీరాజునకు బుద్ధి సెప్పి
హతశేషులతోఁ బాతాళమ్మునకుం బోవునట్లు సేయు మనవుడు దాన
వుండుఁ గ్రోధమూర్ఛితుండై ఘనాఘనాసారమ్ములు వోని శరంబులు
గురిసిన. 30౧

ఉ॥ ఆజగదంబ వానిపవ్రబ లాస్త్రములన్నియు నుగ్గు చేసి స్వా
రాజముఖామరుల్ వొగడ రక్కసుపై గద వైచె దానఁ దా
రోఁజుచు మూర్ఛవోయెఁ గడుదోషము గల్గియుఁ జక్షురుండు; ప్రో
త్తేజితశౌర్యుఁ డంత నరుదెంచెను దామ్రుఁడు చాపధారియై.

ఉ॥ వచ్చినతామ్రుఁ గాంచి రిపుభంజని యజ్జగదంబ రమ్ము నీ
మచ్చర మేద నజ్జమునిమందిరముఁ జొరఁ జేసి పుత్తు మీ
చచ్చినవారుఁ దా విని వెసం జనుదెంచెడిఁ గాక దుర్మదుం
డచ్చపలుండు మీకుఁ బ్రభువైనమాయారి రణంబు సేఁతకున్.

క॥ మీ రెందఱు వచ్చిన నా, కూరుఁడు మహిషుండు చావు గూరక
యున్నన్, గోరిక తీరదు సురలకు, రా రమ్మను మద్దురాత్ము రణ
మొనరింపన్. 303

శా॥ మాయానోన్యస్యపరాక్రమమ్ములపసల్ మాయాయుద్ధచాతుర్యతే
జోయుక్తుల్ గనుఁగొందు గాక చని తుచ్ఛుఁ బుచ్ఛవిభ్రాజితుఁ
డాయం బంపుము మీవిభుఁ జమునిఁ గూడఁ జేసెద న్నాఁగ "నో
హో" యంచున్ వడినార్చి యేసె శరముల్ యద్ధార్ధి తామ్రుండొగిన్.

మ॥ శరవృష్టిన్ శరవృష్టి నేర్చి కడఁకన్ శౌర్యం బవార్యంబుగా
నిరుగేల న్నిగిడించె భల్లములు దేవేంద్రాదు లగ్గింప న
య్యరవిందానన; మూర్ఛ దేటి తగఁ దా నయ్యంబికం జక్షురుం
డురుఁడై మూర్ఛ ద్గొనె,నిర్వ్యారంజదిపెఁ గ్రోధోత్సాహుఁడై యంబయున్.

వ॥ దానికిం గనలి రక్కసులెల్ల నొక్కపెట్టన చుట్టుకొని పరశు
పట్టిసఖడ్గముసలభిండివాలాద్యనేకాయుధమ్ము లయ్యంబ పయిం గీలిం
చినఁ బోరు ఘోరం బయ్యె. ౩౧౬

ఉ॥ తాళసమంబు లోహజము దారుణమై విలసన్మణీఘృణుల్
గ్రాల నెసంగునొక్క ముసలంబు కరంబునఁ బూని తామ్రుఁ డా
భీలత దోఁప సింగమును బిట్టుగఁ గొట్టె శిరమ్ము ఢక్కత్ధా
రాళము గాఁగ దానికిఁ గరమ్మును నంబిక తీక్ష్ణమూర్తియై. ౩౧౭

క॥ అసి ఘటికి వానిశిరమున్, వెసన ఱకిన మొండె మొక్క వ్రేల్మిడిఁ గేలన్
ముసలంబడర నటించి ర,ణసరణి నంతంతఁ బడియె నాకులలరఁగన్.

వ॥ అంతఁ జక్షురుండు తామ్రమరణమ్మునకు నవ్రుడు కలఁచికొని
ఖడ్గమ్ము కేలం బూని సింహనాదం బొనర్చి యురువడించిన జగదంబ
కోపాకులయై. ౩౧౮

మ॥ ఒకబాణమ్మున ఖడ్గము న్నఱకి వేఱొక్కంట హస్తంబు భూ
మికి పాత్తించి వఱొక్కటన్ శిరము పేర్మిన్ డొల్లఁగా నేసె ది
జ్నికరాభీలముగాఁ గ గర్జిలిన భగ్నభ్రాంతమై దైత్యసై
న్యకదంబం బుడివోయె నొల్కిరి ప్రసూనంబుల్ సురల్ దేవిపై.

వ॥ అట్లు చక్షురతామ్రు లిరువురుం జచ్చుట విని శోకించి మహి
షుండు దురాగ్రహగ్రస్తుండై యసిలోమబిడాలాదుల ననేకుల ననేక
సేనతోడన్ జతఁజేసి పనిచిన వార లరుదెంచి యష్టాదశభుజాగ్రజాగ్ర

దాయుధమండల యగుచండికం గాంచి విస్మయాకులు లగునెడ నసిలో ముఁడు వారలకుఁ గన్నాకై సేనాముఖమ్మున నిలిచి వినయమ్మున నయ్యంబ కిట్లనియె. ౩౨౧

శా॥ దేవీ కొండొక చెట్టనీయెడల నెందేఁ జేయఁగారాని స
ద్భావల్ దైత్యులు వీర లిట్లు పొలియం దార్కొలు నీకేల వీ
రావేశమ్మున దుఃఖదం బగురణం బాసింతు రే! సంధిమై
నా నెంటన్ జనుదెమ్ము నీవలయు నానావస్తువుల్ గైకొనన్. ౩౨౨

ఉ॥ సారము లేని సంసరణసాగరమందు సుఖంబు గ్రాహ్యమె
వ్వారికి, శాంతిమై నదియుఁ బొల్పడు, దానికిఁ దక్కి మార్దవ
శ్రీ రుచిరంబు కాయము గ్రహించి నశింపఁగ నేల చెప్పుమా
ఘోరరణమ్ము నందిటులు గోరికఁ జెందితి దుష్కరమ్ముగన్. ౩౨౩

అసిలోమ బిడాలాదు లనికి వెడలుట.

క॥ అసుఖము రెండు తెఱఁగుల, భాసిలు నిత్యం బనిత్యపదవియు నా, వి
ద్యాసంగతిఁ బరు నెఱుఁగుట, యేసుఖ మగు నిత్య మది, తదితర
మితర మా. ౩౨౪

వ॥ ఇందు నాశాత్మకం బగుభోగసంభూతసుఖంబు తత్త్వజ్ఞులు త్యజించి నిత్యం బగునాత్మజ్ఞానంబు వడయ నుంకింతు రది య ట్లుండె.

ఉ॥ సౌగతధర్మ మూనుటయు సమ్మతమేని మృగాక్షి! శస్త్రి సం
త్యాగము చేసి జవ్వనము సార్థకమై తగ నిచ్ఛ కైన సం
భోగములన్ మెలంగు విడిబోఁడిరో! ప్రాియము రేపు నిల్చునే
వ్రేఁగగునిట్టి తాపమున వేఁతురె పుష్పముబోని దేహమున్. ౩౨౫

చ॥ అదియునుఁ గాక యొడ్లను నిరాగసులన్ బరితాపపెట్టి యి
ట్లదయతమైఁ జరించు టది హాని యగున్ దయకన్న ధర్మము
న్నదియె! తదీయరక్షణమునందు మనం బిడి సత్య మిప్డు చె
ప్పఁ దగదె దైత్యవర్గములఁ బట్టి వధింపఁగ నేమి వచ్చెనో. ౩౨౬

వ॥ సత్యంబువలనన కదా ప్రాణమ్ములు నిలుచుట దానికిం దప్పుట కొప్పమి యధర్మం బనఁ బడు నట్టిధర్మమ్మునకుం గట్టువడి కలతెఱంగు

చెప్పు మని ప్రాంజలియై యడిగిన నసిలోము నకు నంబ కరుణించి యి
ట్లనియె. 3౨౮

ఉ॥ నీదువినీతి యింత దగునే! కరుణించి వచింతు నాదు యు
ద్ధాదరకారణంబు; జగ మంతయుఁ ద్రిమ్మరుదాన దుష్టులం
గాదని చంపి సజ్జనులఁ గావఁగ; నొండు ప్రయోజనంబు నా
కేదియు లేదు దీని కయి యెత్తుదు నే నవతారముల్ మహిన్.

మ॥ భయభక్తుల్ విడనాడి దేవతల నొంపన్ బూనె మీరాజు దు
ర్జయుడై; వాని నడంప వచ్చితి యథార్థం బింత; నీ వేగి దు
ర్నయునిం దన్మహిషీతనూజు నిట నే రమ్మన్న చందంబు దె
ల్పి యనిం జేయఁగఁ బంపు మన్యుల వృథా ప్రేరేపఁగా నేటికిన్.

ఆ॥ వె॥ జీవితేచ్ఛఁ దనదు చేతమ్ము సోలసిన, బంధుజనులతోడ బయలు
వెడలి, యీఁగకాలియంత యేనియు ద్రవ్యంబు, గొన కధోభువ
నము జనుట యొప్పు. 33౦

వ॥ ఆరసాతలమ్మునంద మీకులవృద్ధగుప్రహ్లాదుండు వసించు
వాఁ డాతనిం గొలిచి యట నుండుసది యని చెప్పు మట్లైన మీర
లందఱును బ్రతికి పోవుదు రనవుడు నసిలోముండు బిడాలుదిక్కు మొ
గంబై ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. 33౨

ఆ॥ వె॥ వింటివే భవాని వినిచినవిధము ద, యార్ద్రహృదయ సంధి కను
మతించె, నిట్లొనర్చి బ్రతికి యేగిన నేమగు నా రసాతలమ్మునంద
యుండ. 333

వ॥ నావుడు బిడాలుం డిట్లనియె.

ఉ॥ అంబిక చెప్పినట్టివిధ మందఱకున్ సుఖదంబ రాజు సం
ధిం బడయంగనొల్లఁ డెటు దెల్పఁగ వచ్చు నెఱింగి మూర్ఖ రీ
తిం బడువాని, మృత్యువది చెప్పర మాఁగఁ దరంబె యుద్ధరం
గంబునఁ జచ్చువారిఁ బొడఁ గాంచియుఁ దక్కటివారి నంపఁ డే.

గీ॥ కడఁగి పాంచాలికలరీతి గా నతనికి, వశులమై యాజ్ఞఁ దప్పఁగ వశ
మె సత్యముగ వచించిన పల్కు లెవ్వగఁ బ్రియంబు, గలుగఁ జేయు
నృశంసులౌ కాపరులకు. ౩౩౬

చ॥ "ధనమును రాజ్యముఁ విడిచి దర్పము నేదియుఁ గట్టుగుడ్డతో
ననికిఁ దొలంగి యేగుము భయమ్మున నీవు రసాతలమ్ము" నా
విని యతఁ డాదరించెడివివేకము గల్గినవాఁడె! కోపముం
గని ఘనులఁ "వధింతు" ననుఁగాక దురాత్ములు కీడు నెంతురే.

ఉ॥ కావున స్వామికార్య మెసకమ్మునఁ బూని చరింతమెమ్మెఱిఁ
జావది సిద్ధమౌ టెఱిఁగి చావఁగనేల దురాత్ము చేతిలో
నా విని యాతఁ డియ్యకొనినం జెలరేఁగి బిడాలుఁ డేడ్తెఱఁ
దేవిని నొంచె సప్తపటుతీవ్రశరమ్ముల నేసి యాసురన్. ౩౩౭

వ॥ అసిలోముండును ధనుఃపాణియై యంతంత నిలిచి చూచుచుండెఁ బదంపడి యంబిక తనుత్రమ్ము లగు శాణమ్ముల నెడనెడఁ బొడి చేసి. ౩౩౮

గీ॥ మూఁడు భల్లమ్ములనుఁ జాపమున నమర్చి, సింహనాదమ్ము చేసి పేర్చిన
రయమునఁ, బఱపె, వాఁడును దద్బాణపాతమునకుఁ, దొడరి మూర్ఛిల్లి
పెద్దనిద్దురయుఁ జెందె. ౩౩౯

వ॥ ఇట్లు బిడాలుండు సమసిన నసిలోముండు సన్నద్ధుండై రణరంగమ్మునకు వచ్చి కరం బెత్తి యయ్యంబిక కిట్లను. ౩౪౦

చ॥ ఎఱుఁగుదు దేవి! నీకతన మృత్యువు నాకగునంచు; బుద్ధులం
గఱపిన నొల్ల నట్టి విభుఁ గాదన లేక రణంబు సేత కే
డ్తెఱ నిటు లియ్యకొంటిఁ గదుఁ బొపరినై మరణంబు భీతిమైఁ
బఱమటకన్న లగ్గగు శుభం బశుభంబును దైవలభ్యముల్. ౩౪౧

ఉ॥ ఇందఱు దానవుల్ చదిసి యేగిరి కాలునిప్రోలి కింకనే
నెందఱఁ బోలువాఁడ! విధి నెవ్వఁడు దాఁటఁగ నేర్చుఁ! బౌరుషం
బెంతను దైవముం గడచి యుంచుకయుం బని సేయ దంచు ని
న్నందఁగ నార్చి యేసె నిశితాస్త్రము జ్జగదంబ దిక్కుగన్.

శా॥ ఆ బాణమ్ముల నంతరాళమున శాతాస్త్రమ్ములం ద్రుంచి పై
పై బాణమ్ములు గ్రుచ్చి ట్టిన్ వెస నిగుడ్పన్ వాఁడు తచ్ఛస్త్రధా
రాబాహుళ్యముచేఁ బ్రవృద్ధరుధిరుఁడై రాజిల్లెఁ బుష్పాళి లీ
లాభాభాసురకింశుకాగమము హేలన్ జూప నగ్గింపఁగన్. ౩౮౩

ఉ॥ పిమ్మటఁ గోప మెక్కుడుగఁ బేర్చి గదం గొని యార్చి సింహమూ
ర్ధమ్మున మొత్తె నయ్యది కరమ్ము భరమ్ముగ ఘోరభంగి నా
దమ్మొనరించి శస్త్రములు దాఁకెడి తీవ్రనఖమ్ములన్ తదీ
యమ్మగు వక్షమున్ దివిజు లందఱు మెచ్చఁగఁ జీల్చె నుక్కునన్.

ఉ॥ దానికి లోఁగ కయ్యసుర దారుణభంగి నెదిర్చి యార్చి యా
త్మానుచరుల్ నుతింప రయమారఁగ నాహరికిశోర్షముఁ గాఁ గా
లూని పరాక్రమించి గద నుద్ధతుఁడై జగదంబ నొంచె నమ్మా
నిని ఖడ్గధార దునుమన్ దల యూడిపడెన్ సురారికిన్. ౩౮౫

ఉ॥ రక్కసుఁ డిట్టు లుక్కఱిన సురల్ గుసుమమ్ములు గ్రుమ్మరించుచున్
దిక్కులు పిక్కటిల్ల "జయ దేవి" యటంచు నుతించి గొంచి తా
రొక్కట దుందుభిధ్వనులు నుర్వియు నాకసమున్ గలంచి రిం
పెక్కఁగ నప్సరోయువతు లెల్లరు నాడిరి దేవి మెచ్చఁగన్. ౩౮౬

క॥ హతశేషమైన దైత్యవ్రతతిన్ సింగమ్ము పట్టి భక్షించె సమున్నత వేగ
మడరఁ గొందఱు, పతి కీగతి దెలియఁ జెప్పఁ బాఱిరి కడఁకన్.

వ॥ ఇట్లరిగి రోదనపూర్వకమ్ముగఁ గలతెఱంగు చెప్పిన నమ్మహి
షుండు ప్రళయకాలరుద్రుని చందమ్మున మండిపడి దారుకుం డను సారథిం
జూచి సహస్రఖరసంయుతంబును నానాయుధసమన్వితంబును బతాకా
ధ్వజవిరాజితంబును నగు తనరథంబు దోడికొని రమ్మనవుడు వాఁ డ
ట్లొనరింపఁ గా మార్గుం డగు కతన నద్దేవి తన్ను వరించున కాఁ దలంచి
హేయం బగు నీమహిషదేహంబు గా దని త్యజించి స్త్రీలు రూప
చాతుర్యమ్ములం జూచి మోహింతు రని కృతనిశ్చయుండై. ౩౮౭

## దేవీమహిష సంవాదము.

ఉ॥ మానవరూపముం గొని సమంచితభూషణభూషితాంగుడై
దానవసైన్యముల్ గొలువ ధారుణి గ్రక్కదలన్ రథస్థుడై
మానినులెల్ల మెచ్చఁ దగుమంజుల నూత్నచెలువొప్ప నేగె న
వ్వానిని దవ్వులం గని రవం బొనరించెఁ బరాంబ డంబుగన్.

వ॥ ఇట్లు శంఖంబు పూరించిన దైత్యవాహిని కనుకనిం బఱచె వారల నిలువరించి మహిషాసురుం డామె కభిముఖుండై చిఱునగవు మొగమ్మునం దనరనిట్లను. ౩౫౦

గీ॥ దేవి! సంసారమునయందుఁ దిరుగుపురుషుఁ; డేనిఁ గామినియేని సుఖానుభవము, నొందఁ గోరుదు రదియు సంయోగజంబు, గానెఱుంగు మదియు భిన్నగతి నెసంగు. ౩౫౧

వ॥ ఎట్లంటేని మాతృపితృలకుఁ బుత్రునితో నగునది యుత్తమం, బన్నదమ్ముల సంయోగంబు మధ్యమంబు, వివిధావృత్తిచిత్తులును బ్రసంగపరివర్తులును నగునావికులసంయోగంబు సహజంబై యత్యల్పసుఖదం బగుట నధమంబు. ౩౫౨

ఆ॥ వె॥ సమునయన్ను కైనదంపతులకుఁ గుల్యరూపశీలగుణనిరూఢిఁ బొల్పు, మిగులు యోగ మది యమేయసుఖోదయం,బొసఁగుకతన నుత్తమోత్తమంబు. ౩౫౩

వ॥ ఇట్లు సంయోగమ్ములు పరస్పరం బుత్కర్షాతిశయమ్మునం బొల్పారుతన. ౩౫౪

ఉ॥ పేరుఁడనైననాయెడ వివేకము గల్గినదానవై సుధా
సారము వోనిచూడులఁ బొసంగఁగఁ జేసి కరంచి తేని దు
ర్వారసుఖంబు నా నగు బాలరో! యిర్వుర కీసుఖంబుతో
నారయ నేసుఖమ్ములును నంద వనుత్తము మా కనమ్ములన్. ౩౫౫

చ॥ సురపతిఁ దొట్టి నిర్జరుల సొంపఱఁ జేసితిఁ గామరూపచా
తురి గలవాఁడ నిట్టినను దొయ్యలి! దాసునిఁ గాఁగ నేలి యా

దరముగఁ బట్టరాజ్ఞి వయి దానవులెల్ల విధేయులై మెలం
గ రమణ నాదువైభవము గైకొని పొందఁగ రాదె భోగముల్.

ఉ॥ ఆనతి యిచ్చితేని విను మయ్యమరావళితోడ వైరమున్
మానెద నెద్ది పంచినను మానక చేసెదఁ బ్రేముడించు మె
ట్లైన భవత్పదాంబుజములే శరణమ్ములు సేవకుండ ధ
ర్మానుగతుల్ వచింత్రు శరణాగత రక్షణ మొప్పదే చెలీ. ౩౫౮

ఉ॥ పుట్టినవారికి ద్వైన్యమునఁ బోవ నొకప్పుడు నాజి నెంతయున్
ధట్టుఁడ నావిశేషములు తామరచూలి మొదల్ సురోత్తముల్
గట్టిగఁ దామెఱుంగుదురు కామశరమ్ముల దాడి కోర్వకి
ప్పట్టున దైన్యపూనితిఁ గృపన్ గనుమాయుధముల్ త్యజించితిన్.

కం॥ మరణావధి నెన్నఁడుఁ గ, త్పరతన్నెదురు సెప్పఁ దన్వంగిరో! నీ
గురుకుచములాన మన్మథ, పరయుము శృంగారభంగితాపాం
గములన్. ౩౫౯

చ॥ అనవుడు దేవి వల్కు మొగమంకురితస్మితకందళంబు గా
దనుజవరేణ్య నాకుఁ బతి తత్పరమాత్ముఁడు; నాని యిచ్ఛనై
యొనరుతు సృష్టి; యప్పురుషయోగమునన్ జడనైన నాకుఁ జే
తనము ఘటిల్లుఁ గాంతశిలి దాఁకినయినుమునకుం బలెం బలెన్. ౩౬౦

వ॥ ఇట్టి నాకు గ్రామ్యసుఖవాంఛ యొక్కింతయు లేదు నీవు మూ
ర్ఖుండవై నన్నొకసామాన్యాంగనగాఁ దలంచి మత్సంగం బపేక్షించు
చున్నవాఁడ వదియునుం గాక. ౩౬౧

చ॥ నరునకు బంధనార్థముగ నాతి సృజింపఁబడెం దురాత్మ! య
ప్పరమరహస్యముం దెలిసి భంగురమై కడు హేయమైన సౌ
ఖ్యరసమునన్ జరింపకుము గల్గునొకప్పుడు ముక్తి శృంఖలా
స్థిరులకు నేరి; వీరలకుఁ దీరదు ముక్తికి నేగ నెన్నఁడున్. ౩౬౨

మ॥ శమ మిచ్చున్ స్థిరసౌఖ్య; మద్ది హృదయస్థానమ్మునన్ జేర్చి యా
యమరావాసము వీడి జీవమును నీ వాసింతువేనిన్ నివా

స మొనర్పంగ రసాతల మ్మరుగు; మీ చందమ్ము గా కొండు చం
దమయేనిఁ రణ మాచరింపుము నిన్నుఁ దర్పాంధుఁ దున్మాడెదన్.

ఉ॥ నీవినయమ్ము నిక్కముగ నెమ్మది కెక్కుటఁ జేసి యింత నీ
కై వచియించితిం గడుదయాపరతన్; వలతేని విన్ము లే
దా! వెనుదీయ కాజి ననుఁ దాఁకుము నన్ బురికొల్పినట్టి దే
వావళి యప్పు దీర్తు నిను నాత్మశరమ్ములపాలు సేయుచున్. ౩౬౪

వ॥ నావుడు మదనమోహితుం డద్దురాత్ముండు మరల నిట్లను.

ఉ॥ పూలకు మించి మెత్తఁ దగుపొల్పునఁ బొల్చెడిమేనిదాన! నే
నాలము సేసి నిన్నడఁచునంతటిసాహస మూన నిన్నిరో!
బేలవె! నీకృపం బడసి పెండిలిఁ జేసికొనంగ నుంటి ని
న్నోలలితాంగి! యిట్టికఠినోక్తులు నన్నన నీకు న్యాయమే. ౩౬౫

చ॥ హరిహరనీరజాసనుల నాహవభీరులఁ జేసి పుచ్చి సుం
దరిపయిఁ జూపువాఁడనె ప్రతాపము లోకులు నవ్వ; నీయెడం
గర మనురక్తి కల్మి భయకంపిత మయ్యెఁ గరంబు పోల్తి! యి
ద్వారమును మిత్రభావమునుఁ బొందితి మేటికిఁ దక్కు సంగతుల్.

క॥ ననుఁ బేర్మిఁ జూచిఁ పెండిలి, యొనరిచికొన నొప్పదేని యొప్పెదఁ
గాదే, నిని వలసినయెడ కరుగుము, నిను నేఁ బ్రహరింపఁ జాల నిశి
తాస్త్రములన్. ౩౬౭

గీ॥ సప్తపది మైత్రి యని బుధజనులమతము, గాన నాచెల్మి కత్తె! నిన్
గసిమసంగి, పై ననుభవింపఁ గల్గునైశ్వర్య మొక్కఁ, దున్నె యింత
టి పాపంబు నోపఁగలనె. ౩౬౮

గీ॥ బాలహత్య యు స్త్రీహత్య బ్రహ్మహత్య, పాతకము లందు నెక్కుడు
పాతకములు, గాన నెట్లుని నీదయ గాంచి జన్మ, మునకు సాఫల్య
మొనరింతు వనరుహాక్షి. ౩౬౯

గీ॥ నిను బలాత్కృతిఁ గొని యేగ నేర్తుఁగాని, దాన నేమి సుఖం బగుఁ
దలిరుఁబోఁడి, స్త్రీపురుషులు పరస్పరస్నేహ మూడరఁ, గూటమికి ని
య్యకొన దానఁ గుతుక మెసఁగు. ౩౭౦

చ॥ తెలియవుగాక పూరుషుని ధీరునిఁ బొందని కాంతకున్ సుఖం
బులు వెలిఁ గావె తాఁ దగినపొల్తికిఁ దక్కనిపూరుషుండునున్
వెలయగు నెవ్వఁ డిక్కరణి వేఁదుఱు పుట్టఁగఁ జేసె నీకు; ని
స్తుల మగు జవ్వనమ్ము గడుసుందన మక్కట! వమ్మొనర్తురే. ౩౨౧
ఉ॥ వైరి యెవండొ నిన్నిటులు వంచనఁ జేసి మరల్చెఁ గాక సం
సారసుఖమ్ము లిక్కరణిఁ జాగము సేయుదె తత్త్రిమూర్తు లం
భోరుహనేత్రలన్ విడిచి పోయిరె యెంతటిబేల వైతి వే
చారుముఖీలలామ పతిసంగతిఁ బాసి సుఖించుఁ జెప్పుమా. ౩౨౨
చ॥ ననుఁ బువుఁగోలలంఁ బరపి నాఁచికొసం గమకించు చండశా
సనుఁడు మరుండు నీయెడలఁ జాలఁ గృపం గలఁ డేమొ కాక యు
న్నను నిటు నిల్వ నిచ్చునె! కనంబడె హేతువు వైరులైన దు
ర్మనసులు దేవతల్ మరు మరల్చిరి నీదరిఁ జేరకుండఁగన్. ౩౨౩
ఉ॥ ఆదర మేది నన్నిపు డహంకృతి వీడితివేని మున్ను మం
దోదరి సుందరున్నృపుని ద్రోచి పదంపడి ధూర్తునాథుఁ గా
నూఁది స్మరార్తయై వగల నొందినచందమునం గృశింతు ను
మ్మా దరిలేని తాపమున, మీఁదటిబాధ గణింప విమ్మెయిన్. ౩౨౪

## మందోదరీవృత్తాంతము.

వ॥ అనవుడు నమ్మందోదరీవృత్తాంతమ్ము విన వలతు నన దేవికి మహిషుం డిట్లనియె. ౩౨౫

శా॥ దేవీ సింహళదేశమెల్ల గతులన్ దేజమ్మునం బొల్చు స
ద్భావుం డయ్యెడఁ జంద్రసేనుఁ డనుభూపాలుండు పాలించుఁ బా
రావారావృత మైనమేదిని కొకండై యేలునవ్వాని కిం
పై వర్తించుఁ బతివ్రతామణి యొక ర్త ర్ధాంగియై యిమ్మెయిన్. ౩౨౬
గీ॥ ఆపె గుణవతి యన పేర నలరుఁ దద్గుణములు వర్ణింప నలవి యెన్నఁ
టికిఁ గాదు, కనియె నొకయుత్పలాక్షి నక్కాంత మొదటి, చూలుగాఁ
బతి సుఖవార్ధి నోలలాడ. ౩౨౭

వ॥ పిదప నమ్మనుజపతి యక్కన్నెకు మందోదరి యనినామకరణమ్ము చేసి తోరంబగు గారమ్మునఁ బెంచుచుండ నబ్బాలికాజనచూళి

కారత్నంబు శశికల తెఱంగునఁ దినదినప్రవర్ధమానయై పదియేండ్ల ప్రాయమ్మునం బొలుచుటయు నరేంద్రుండు వివాహం బొనరింప నెంచి యనుకూలవరాన్వేషణపరాయణం బగుచిత్తమ్మున నున్నయెడఁ గొందఱు బ్రాహ్మణు లరుదెంచి. ౩౨౮

గీ॥ తనరు మద్రదేశమున సుధన్వుఁ డనెడి, రాజవర్యుం డతనికుమార
కుఁడు నీడు, కొమిరె కీ డగువాఁడు సద్గుణవిశేష, రూపరేఖావిలా
సనిరూఢి నెందు. ౩౨౯

శా॥ కంబుగ్రీవుఁడు వానిపే రనుడు భూకాంతుండు పుత్త్రిం దదీ
యం బౌసామ్ముగ నిశ్చయించి తనభార్యం జూచి యిక్కన్నె లో
కం బెల్లం గొనియాడ శీలమున నాకారమ్మునన్ మేటి యీ
కంబుగ్రీవున కిచ్చి పుత్త్రమె యనంగా నాపె సంతుష్టయై. ౩౩౦

వ॥ పుత్త్రియున్నెడ కరిగి యాదరమ్మున నమ్మా! నిన్ను నీజనకుండు మద్రదేశాధీశ్వరుం డగుసుధన్వతనయునకు సమస్తలక్షణలక్షితునకుఁ గంబుగ్రీవున కిచ్చి పెండిలి యొనర్ప నున్నవాఁ డనవుడు మందోదరి యిట్లనియె. ౩౩౧

శా॥ కౌమారవ్రత మూని స్వేచ్ఛగఁ దపఃకాంక్షన్ ప్రవర్తింప నే
నామోదింతుఁ జిరమ్మునుండి, యిఁక నాకన్యన్ వరింపంగ నే
లా! మేలా యొకమానవుం దవిలి వాలాయమ్ము నవ్వానితో
గామాసక్తినిఁ బారతంత్ర్యమున మోక్షప్రాప్తిఁ బోఁ గొట్టుటల్.

క॥ స్వాతంత్ర్యమ్మున నెప్పుడుఁ, జేతోమోదమునఁ దిరుగఁ జేకూరుట వి
ద్యాతత్త్వజ్ఞులు మోక్షక,లా తాదాత్మ్యమునఁ జూచిలలిఁ బొగడరొకో

సీ॥ అత్తమామలయెడ నడఁకువ గొలుపుట బావలయెడ భక్తి పరత
గనుట, మఱఁదులయెడఁ దగుమన్ననఁ జూపుట తోడికోడండ్ర
పొత్తున మెలఁగుట, యాఁడుబిడ్డలచిత్త మరసి వర్తించుట సవతి
గల్గిన దానిచన వెనయుట, పతికి నెవ్వేళలఁ బరిచర్య సలుపుట
సంతతి గని పెనువంతఁ బడుట; గీ॥ అకట! బానిస యగుటకు నతి
శయించుఁ, గాదె యొక్కనివశమునఁ గాలమెల్ల, గడపునిల్లాలి

క॥ నీవై రాగ్యపుఁ జందం, బేవను పుట్టింప జనకుఁ డెంతయు వగకుం
దావలమై వందురు నా, భూవిభు నిప్పాటఁ దేల్పఁ బోలదె నీకుఁ.

వ॥ అతఁ డెల్ల వేళల మమ్ముం గాంచి మీ చెలికత్తియకుఁ గఱ
దలు కఱపి పరిణయమ్మున కియ్యకొలుపుఁ డని విసువక వచియింపుచుండు
నింతదనుక నిన్నుం బ్రబోధింప నేర మైతి మియ్యది తగువల నగుటం
జేసి చెప్ప వలసి వచ్చె నని మఱియును. ౮౦౧

గీ॥ వ్రతము లెన్నేని భర్తృతత్పరతఁ దవిలి, చేరి శుశ్రూష యొడపక
చేయుదానిఁ,బోలఁ జాలవు విను మట్టి పూవుఁబోఁడి,యరుగు స్వర్గ
మ్మునకు నిక్క మంద్రు బుధులు. ౮౦౨

వ॥ నావుడుఁ గోపించి యామందోదరి సైరంధ్రి కిట్లనియె.

ఆ॥ వె॥ సిగ్గు లేక నన్నుఁ జెనఁటిచందమ్మున, నగయ నంతఁ జులుక నైతి
నోక్కొ, తపము చేసికొనెడి తన్వికి నా కేటి, భర్త పొ మ్మటంచుఁ
బలుకు మతని. ౮౦౩

వ॥ నావుడు సైరంధ్రి మెల్లన నిట్లను నమ్మా! కాలం బెప్పుడు
నొక్కచందమ్మున నుండదు,మన్మథుండు దుర్జయుండు, నాపలుకు లంగీక
రింపనినాఁడు నీకు నాపద ఘటిల్లక తీర దనవుడు రాజపుత్రి యిట్లను.

ఆ॥ వె॥ ఎంతయేనిఁ జెప్పు మేను వివాహ మం, గీకరింప వచ్చు కీడు
తొలఁగఁ, జేయ నెవరితరము చెలియరొ! దైవ వ, శంబు తప్పఁ
జేయఁ జనునె నీకు. ౮౦౪

వ॥ ఇట్లు వైరాగ్యమ్మున నీడం బోక పుయిలోట దక్కి యీస
డించిన సైరంధ్రి వీరసేనుం జూచి. ౮౦౫

గీ॥ ఎన్ని చెప్పిన విన నేర దీలతాంగి, గుణగణాఢ్యుండు కాకుత్స్థ
కులుఁడు మిగుల, రూపసి యటంచు నొక్కి నీరాఢి దెలిపి, విసి
వితి నిఁ కేమి సేయుదు వెడలు మధిప. ౮౦౬

వ॥ నావుడు నృపాలుండు విమనస్కుండై తనయంత నరిగెఁ
బిమ్మటఁ గొంతకాలమ్మున కమ్మందోదరి చెలియ లిందుమతి యనుదానికిఁ

దండ్రి స్వయంవరమ్మునఁ బెండ్లి సేయం దలంచి చాటం బంచిన నప్పు రంబున కఖిలధరాకాంతు లరుదెంచి మంటపమ్మున వలయు నెడల వసి యించి రం దొక్కరునిఁ దనకనుగుణుం డగు రాసూను నయ్యిందుమతి వరియించి కృతకృత్య యయ్యె. ౪౦౯

క॥ మందోదరి యాపెండిలి,చందము వీక్షించి యందెసఁగునృపతులయం
దందమునఁబొల్చువిటు శరు,నిం దగఁ గని కలఁగి దైవనియతి వరించెన్

వ॥ ఇట్లు కలఁగి మదనవేదనాదోధూయమానయై తండ్రికిఁ దన కోరిక తెలుం గెలింగించిన నతండును సంతసించి తగుఁదగదనక యతనిని గారవించి యథావిధిగ సత్కృతు లిచ్చి పెండ్లి యొనర్చి పారిబర్హం బొసంగి వీడ్కొల్పె నాచారుదేష్ణుండును మందోదరీసహితుండై సంత సమ్మునఁ దనపురి కరిగి యవ్విలాసినితో వివిధోపభోగమ్ములం బ్రొద్దు పుచ్చుచు నొక్కనాఁడు. ౪౧౦

క॥ తనదాసితోడఁ గామ్యమ్మునఁ గ్రీడాగోష్ఠి నున్నపొంకము తదా్రి, ద్త్త
నయుతు సైరంధ్రి గనుం, గొని చెప్పెన్ దాన మిగులఁ గోపన
యగుచున్. ౪౧౧

వ॥ వా రిరువురం బట్టికొనఁ దలంచి రంధ్రిం బరయుచు నంత నొక్కెడ నేకాంతమ్మునఁ గ్రీడించువారి వారిం గాంచి యిట్లు చింతించె

గీ॥ అక్కటా! శఠుఁ డంచు మున్న రయనేర, నైతిఁ గడుఁ జెట్ట చేసి
యీయధము వంచ, నం బడితి నిట్టినిర్లజ్జునిం బతిగ గ్రి, హించి
జనమ్మునకు హాని నించుకొంటి. ౪౧౨

క॥ అని యుమ్మలిక మనమ్మునఁ, బెనఁగొన నిఁక నిట్టివానిఁ బెంపేది
హృదీ, శునిఁగాఁ గొని ప్రేముడి నిం, చినకంటె నఘంబు చెట్ట
సేఁతయుఁ గలదే. ౪౧౪

మ॥ పతిసంగంబు పరిత్యజించి మృతికై పాటింతునో! దాన సం
గతమౌ నాత్మవధోద్ధితం బయినబల్ కాలుష్య మబ్బొట మ
త్పితృగేహమ్మున కేగు దెంతునో! సఖుల్ వీడింతు రెగ్గించి దు
ర్మతినై యింతటిచేటు దెచ్చుకొని మైమైఁ బోవఁగా దీటునే. ౪౧౫

క॥ పొరిఁబొరి సంతాపము పొం, పిరివోవఁగ నిట్లు వగలపెల్లునఁ గడు
వం, దురి తుదకు నచట నుంటయు, పరమోత్తమ మంచు నెంచి
పతిసంసర్గ౯. ౪౧౭

వ॥ విడిచి వ్రతపరాయణనై పశ్చాత్తాపమ్మునం గుందుచుండె నట్లుగావున.

## దేవీమహిషాసురయుద్ధము.

ఆ॥వె॥ ఇపుడు నన్ను నిట్లు లెడఁజేసి పిదపఁగా, మూర్తి దొడరెనేని న
ధము నొక్కఁ, శఠు వరించి వాని సంసర్గమునఁ బ్రోపుఁ దక్క నేల
వినుము తలిరుఁ బోఁడి. ౪౧౮

చ॥ అనవుడు దేవి కోపమున నమ్మహిషాధముఁ జూచి పల్కు దు
ర్వినయ ! వివేక మేది పలవింపక సంగర మాచరింపు లే
కునికి రసాతలం బరుగు మొండొక రీతి పొసంగ దెంత చె
ప్పిన విన నేర కూరకయ పేర్లెదు వీతేఁడివే తలంపఁగ౯. ౪౧౯

గీ॥ జన్మ మెఱుఁగనినా కిట్లు జన్మలబ్ధి, రూపమెఱుఁగనినా కిట్లు రూప
లబ్ధి, గలుగు దుష్టుల వధియించు కారణమున, నిక్క మమరహిత
మ్ముగ ని న్నడంతు. ౪౨౦

వ॥ కావునఁ బాతాళమ్మున కరుగు మొండె ధనుర్ధరుండవై
సంగరం బాచరింపు మనవుడు మహిషుం డక్షీణక్రోధసంతప్తుండై.

ఉ॥ కర్ణము దాఁకఁ జాపమును గాఁడఁగ లాగి శరమ్ముల౯ రయో
దీర్ణత నేయ నంబ వెనుదీయక యంతరమంద యన్నిటి౯
జూర్ణము చేసె నిర్భరకుఁ జూపఱు భీతి మునుంగ నిట్లు సం
పూర్ణరణంబు వాటిలె నపూర్వము ఘోరమునై పొరింబొరి౯.

వ॥ ఇట్లిరువురుం బోరాడుచుండ నంతరమ్మున దుర్ధరుం డరుదెం
చి యుంబం దలపడి. ౪౨౩

క॥ కొన్నిశరమ్ములు నించినఁ, దన్నీచుని మొదలఁ గనలి దారుణ శరపా
ళి న్నిగిడించినవాఁడును, దన్నికొనుచు జచ్చి పడియె ధర శృంగ
మన౯. ౪౨౪

ఆ॥వె॥ వాని చావుఁ జూచి వగ నూరఁగఁ ద్రినేత్రుఁ, డరుగుదెంచి దేవి
నస్త్రిసప్త, కంబుఁ జొనిపి నొంపఁగా వాని నయ్యంబ, యంతరాళము
నన యడఁచి వైచి॥ ౨౨౫

వ॥ త్రిశూలమ్మున వానిం బిల్కుమార్ప సద్దానికి సైఁపక
యంధకుండు గోపమ్ము పిరిగొనం దాఁకి. ౨౨౬

మ॥ గద చేఁ బూని గజారిమస్తకముపై గాఁడంగ నేయంగ న
య్యాది క్రోధాకులమై వెసం గడఁగి తీవ్రాస్త్రమ్ములన్ బోసి బె
ట్టిదపుంగోరులఁ బట్టి చీల్చి కడు దీండ్రింపంగఁ దన్మాంస ము
గ్రదశం దాఁ దినియెన్ సురారులకు భీకంపంబు సంధిల్లఁగన్.

మ॥ అటు లయ్యంధకుఁ డీల్గఁ గిన్కమెయి నయ్యశ్వారి తీక్ష్ణాశుగా
గ్ఘటి రోదోంతర మెల్లఁ గప్పుచు రణప్రారంభుఁడై మించు న
ప్పటియత్యాహిత మాఁగ నజ్జనని యప్పాపాత్ముపై నొక్క మి
క్కుట మా పెన్గద వైవ దానఁ బడి సోఁకు న్మూర్ఛమై వ్రీల్కెడిన్.

క॥ అంతంత లేచి దానవుఁ, డంతకుఁడై గదనుఁ బూని హర్యక్షుం బొ
క్కింతఁ గువలువడ నేసిన, దంతిపయిం గవియు నవ్విధం బడరంగన్

చ॥ ఖరనఖరావళిం బొదివి క్రక్కదలన్ బడఁ జీల్చె నంత నా
హరిరిపుఁ డార్చి తాను హరియై సరి యైన పరాక్రమక్రమో
ద్ధురనఖరాళి నుక్కుఱఁగఁ దోడన వ్రచ్చిన దాని కల్గి శాం
కరి ఫణిరాణ్ణిభంబు లగుకాండపరంపర నిండఁ జెండినన్. ౨౩౦

మ॥ హరిరూపంబుఁ ద్యజించి యమ్మహిషుఁ డేన్గై వేగఁ దా నొక్కభూ
ధరశృంగంబు కరంబునం బొదివి క్రోధం బెక్క బిట్టార్చి శాం
కరిపై నేయ శిలాశితమ్ములఁ గనత్కాండమ్ములం త్రుంచె న
గ్గిరిశృంగం బొకయింతయింతగ సురల్ గీర్తించి యగ్గింపఁగన్.

ఉ॥ తోడన యార్చి సింగ మెదఁ దోఁప మెలంగఁగఁ గుంభపాళి నా
ఱాడిగ మించి కీడ్వఱచి హస్తనఖంబుల వ్రచ్చివ్రచ్చి వేఁ
టాడఁగ రక్కసుండు శరభాకృతిఁ దాల్చి మరల్చినన్ సురల్
పోడిమిఁ దక్కి రంబికయుఁ బ్రోపడఁ జేసె శితాస్త్రసంహతిన్.

వ॥ అంత నాశరభాకారుం డగుమహిషుండును.

ఉ॥ తుండమునం గడుం బొడిచి తోఁకను బుచ్ఛముఁ జుట్టి భూమిభృ
న్మండలముం బెకల్చి యొకమాత్రన బంతులుఉవ్వ పోల్కి న
చ్చండిపయి న్నిగుడ్చుచు హసన్ముఖుఁడై యెలుఁగెత్తి విక్రమో
ద్దండత మిన్ను ముట్టఁగ మదమ్మున నజ్జగదంబ కిట్లనున్. ౮౩౩

మ॥ మదముం ద్రిప్పఁగ లేక నాపలుకుల న్మన్నింప కీరీతి బె
ట్టిదపున్ సంగర మియ్యకొంటివి ననున్ డీకొంట నీబోటియాఁ
డుదియు న్నేర్చునె! యిందుఁ దొట్టి సురలాటోపంబు వాటిల్ల ర
య్యది నీకుం దెలియంగ లేదొ వినవో యస్మత్ప్రతాపస్థితుల్.

చ॥ నినుఁ బురికొల్పినట్టిసురనేతలు ఖామరులెల్లఁ మ్రాల్తి ద
క్క నని వధించి నాదుభుజగర్వము దుర్వహమై జగమ్ములం
దనుకఁగఁ జేయుదున్ వెనుకఁ దారక నిల్వము నాఁగ వానిక
జ్జనని వచించుఁ గోప మొకచాడ్పు మెయిన్ గనుపట్ట నవ్వుచున్.

ఉ॥ తత్తఱపాటు మాని తగు దర్పమున న్నిలు మిద్ద నూధవిన్
పాత్రసవేద్యఁ ద్రావి సుర లందఱునుం గొనియాడ దుర్మదో
న్మత్తుని నిన్నుఁ జంపెద రణమ్మున నంచు సువర్ణపాత్రి మా
యత్నము చేసి త్రావెఁ దగ నాసవముం జల ముప్పతిల్లఁగన్.

క॥ ద్రాక్షాసవపానం బిటు, లక్షణగతిం బొనర్చి యయ్యంబిక బల్
దక్షతమెఱయఁగఁ బాహా, ర్యక్షారావం బొనర్చె నసురులు బెగడన్

క॥ జయ పెట్టుచు నమరులు పే, ర్మియెలర్పఁగఁ బూలు గురియ మేకొని
జగదం, బయు మహిషు నెదిరి పోరెన్, హయారియు ననేకమూర్తు
లంపుచుఁ గడఁకన్. ౮౩౭

చ॥ కపటపుఁ గాండజిన్ మెఱసి కావలుఁడై పలుమైల నంబతో
నపగతభీతిమై నని నహంకృతిఁ జూపఁగ వాని కల్గి చం
డి పెలుచ శూలముం గొని కడిందిగ వక్షము నంచు నాఁట మూ
ర్ఛపడి హయారి యంతట వెసన్ బునరద్గతుఁడై మహోద్ధతిన్ ౮౩౮

శా॥ చాముండం దన పాదఘాతముల నుచ్చైర్నాదపూర్వమ్ముగా
నామైఁ దన్ని హసన్ముఖుం డగుచు శంఖారావముం జేయ ను
ద్దామక్రోధపరీతుఁడై జననిహస్తం బందుఁ జక్రంబు ని
స్సీమారంబు ధరించి యుద్ధతిమెయిన్ సింహాసనం బొప్పఁగన్. ౨౨౦

ఉ॥ ఓరిమదాంధ! చక్ర మిది యోడక నీదుశిరంబు దీసి దు
ర్వారత నయ్యమాలయనివాసము నీకొసఁగంచు నెమ్మెయిన్
బోర నొకింత నిల్వు మని భోరన నెత్తుచు మీఁది కొల్కఁ న
వ్వైరిశిరమ్ముఁ ద్రుంచినఁ గబంధము భూధ్రము నా భువింబడెన్ ౨౨౧

మ॥ సురలెల్లన్ జయవెట్ట నమ్మహిషుఁ డచ్చోఁ గూల సింగంబు దు
ర్భరవేగమ్మునఁ బాఱుసేనల వెసన్ భక్షించి నిశ్శేషతం
బొరయం జేసెను గొంద ఱందుఁ జని శేషుం దక్కఁ బాతాళమి
క్కరణిన్ దేవి యొనర్ప దేవతలు వేడ్కన్ జేతులన్ మోడ్చుచున్

## ఇంద్రాదులు దేవిని నుతించుట.

వ॥ అయ్యంబికం గని యిట్లు సన్నుతించి «రోయంబా! సృష్టిస్థితి లయకారిణివై కీర్తిమతిస్మృతిగతికరుణాదయాశ్రద్ధాధృతివసుధాకమలాజయాపుష్టికలావిజయాగిరిజాతుష్టిప్రమావిద్యాక్షమాదికంబులు నీవయై మెలంగుదు వీయీశక్తులసాహాయ్యమ్మునం జేసి వారువారు తత్తత్కార్యమ్ములకు సమర్థులగుచుందురది యెట్లనిన! నీవు ధారణవై యుండవేని నాగకూర్మమ్ము లిద్ధారుణి ధరించుటయు నీవు పృథివివై చెలఁగకున్న నంబరంబు నిలుచుటయుం బొసంగ దిట్లుండఁ గొందఱు హరిహరప్రముఖుల నగుమమ్మెంతయు నారాధింతురు వారు మూఢు లనుట కేమి సందియంబు. జన్నం బొనర్చువారు చేయు హోమమ్ము లెల్ల నీవు స్వాహవై యుంటం జేసియకదా మాకు ముట్టుచున్నయవి. కావునఁ జరాచరాత్మకం బగుప్రపంచంబునకెల్ల భుక్తిముక్తిప్రదాయిని యగుకతన నితరు లల్ల మమ్మునుం బాలించుచుందు విది యిట్టిదయేని రక్కసు లిట్లుకుమిగులుచుండ వారల మూలచ్ఛేకం బొనరింపకుంట లోకమ్మున మహారణ్యంబులం బుట్టిన కటువృక్షమ్ములఁ బలాశరహితమ్ముల

నేనియు నుత్తము లగువారు ఖండింపక మిన్నకుండుటవంటిది. కరుణా రసనియుత వగునీ వొక్కొక్కయెడ రణాంగణంబుల శితశరపరంపరలం జేసి ఘోరుల శిక్షించుటకుఁ గతంబు వారలకు దేహాంతరప్రాప్తిం జేసి యందు సురాంగనాకేళీముఖసౌఖ్యం బొడగూర్చుట కని యూహింప నయ్యెడి దేహరహిత వయ్యును రక్కసుల నుక్కడంప నయ్యయికాలమ్ముల దేహంబు గైకొంట క్రీడామాత్రంబయగు నిట్టియమేయప్రభావ వగు నీవుండ ధూర్తులును బురాణచతురులును నగుకొందఱు హరిహరాదుల సేవింప వలయునని విధించుట యసమంజసంబు గాకుండు నొక్కొ! జగజ్జననివగునీకు వశులమై యిట్లు రాక్షసబాధల నీఁగుచు నుండు మమ్మెవ్వరు పూజింప నెంతురు వారు కరమ్మున దీపంబు గలిగియుఁ గూపమ్మునఁ బడువారిలో నొక్కరు గాఁ దగుదురు. నీవు విద్యావిద్యాస్వరూపిణి వగుకతన మోక్షార్థులకు గతివై యుండుదు గావునఁ ద్రిమూర్తులును భవత్పాద పంకేరుహంబు భజింతు రిట్టినిన్నుఁ గొందఱుమూర్ఖులు భజింపనేరక భవసాగరమ్మున బ్రుంగుడువడి నవయుచుందురు. తల్లీ! యింతేల? నీవు వాగ్దేవతా స్వరూపిణివై వక్త్రమ్ముల వసియింపవేని హరిహరాదు లగుసురలు గాని మానవులు గాని యెట్లు ముఖరితవక్తృలగుదురు? ౪౪౩

మ॥ భృగుశాపమ్మున మీనమై కమఠమై పెంపేది కోలాకృతిం
దగి సింగం బయి వంతలంబడి యశక్తప్రక్రియంబొల్చి మ
ర్భగుఁడై యుక్కివపుంగతిఁ మెలఁగునప్పద్మాక్షు సేవింప మృ
త్యుగతం బైనభయంబు రూపఱునె సంతోషంబు వాటిల్లునే?

క॥ ఎవఁడు భృగుశాపమున వన, సవిధమ్మునఁ దనకు లింగసంపాతముగా
నవసెనొ తాదృశుఁ డగునా, శివునిఁ సేవింప సౌఖ్యసిద్ధులు కలవే?

గీ॥ అట్టిహరునకుఁ గొమరుఁ డైనట్టిగజముఖుని గణాధిపు సేవించి కోర్కి
వడయు, నెంతు రతిమూర్ఖు లంబ! నిన్నెఱిఁగి కొలువ, రాదొకో కా
ర్యసిద్ధిసంప్రాప్తి పొంటె. ౪౪౬

వ॥ అని వెండియు.

చ॥ అరిజనతఁ వధించుట కృపాకులతన్ నిరయంబు మాన్పి ని
ర్జరభువనం బొసంగుటయు సమ్మత మంచు వచింతు నంబ! నీ
చరిత మెఱుంగ లేరు హరసారసలోచనముఖ్యులైన; నొం
డొరువు లెఱుంగువారె భవదుజ్జ్వలమోహవశంవదాత్ములై॥ ౪౪౭
గీ॥ వేదముల నెన్నియేని భావింతురిగాక, కొంద అజ్ఞులు మునులు నీచంద
మెఱుఁగ, జాలమిని సూర్యుఁ గొల్తు రాజ్యాలనుఁ దలఁతు, రాగ
మమ్ముల సారంబు నరయఁ దరమె. ౪౪౮
చ॥ స్వరచితముల్ శ్రుతుల్ గఱపి సారససంభవముఖ్యదేవతా
పరుల కనుత్తమత్వము నవారణ బోధ యొసర్చి వ్యాజదు
ర్భరత మెలంగుచున్ జగము వంచనచేసెడివారి నీవు ప్రే
మరసమునం గనుంగొనెదు మాయికు లంచుఁ బ్రసిద్ధిచెచ్చుచున్.
క॥ రాఁ దగుకలియుగమున జగ, దాది న్నిను డాఁచి సుకవులంబరో! నీవా
వాదించినసురగణముల, నాదరము మెయిన్నుతింతురయ్యాయివిధులన్
క॥ మును లెవ్వరు పరవిద్యన్, జనని న్నినుఁ దలఁతు రట్టిజ్ఞానులు గర్భ
మ్మునఁబడక నిన్నుఁ జెంది సు, ఖనియతి వర్తింతు రెల్లకాలముతల్లీ
క॥ కేవలపరమాత్మయు నీ, తో విరహితుఁడై యొకింత దొడరఁగఁ జాలం
డా విభుఁడు నీదుచిచ్ఛ, క్త్యావిర్భావమునఁ గాదె యట్లుండగుటన్. ౪౫౨
వ॥ అట్లు కాదేని జడమ్ము లగుతత్త్వమ్ములును గుణకర్మయుతమ్ము లగునిందిర్యమ్ములును జిద్విరహితమ్ములై తత్తత్కృతుల కెట్లు సమర్థమ్ము లగు! సర్వమ్మును సృజించి సమయమ్మునఁ బాలించుచు హరించుచుండు నీ మహామహిమంబు మాకే కాదు హరిహరాదులకు నయిత మగమ్యంబై యుండు. ౪౫౩
శా॥ లోలాత్ముం డయి దుష్టుఁడై త్రిజగతీలుంటాకుఁడై యొప్పుదు
శ్శీలుం గాసరసూపునీతులుప నిర్జరుల్ బొసంగించి మ
మ్మేలం జొచ్చిన నీమహామహిము మిం కే మంచు వాకుత్తు మం
బా! లీలాజితదుష్టదానవకదంబా! సత్కదంబాలయా. ౪౫౪
క॥ మాకార్యము సేతయు కా, కాకల్పంబై నకీర్తి యలవడె నీకీ
లోకాపకారిదానవుఁ, బో కార్చిన కతన విపులముగ జగదంబా. ౪౫౫

వ॥ అంబా! మమ్మెల్లవేళలఁ గృపాకలితవై యిట్లు పాలించుచు నేడుగడవై యుండం బ్రార్థింతు మనవుడు మహిషాసురమర్దని వారల కిట్లనియె. ౭౫౬

క॥ సురలార! కార్య మొం డిపు, డరయంబడె నేనిఁ దెల్పుఁ డది తీర్చె
ద దు, ష్కరమేని మీకు నాపద, వారసినయపుడెల్ల నన్నుఁ బోలుఁ
దలంపరే॥ ౭౫౭

చ॥ అనవుడు దేవతల్ ప్రణిహితాంజలులై జగదంబఁ గాంచి యి
ట్లనిరి "భవత్పదాబ్జ మనయమ్మును గొల్చెడియిచ్చ మాకు ని
చ్చినఁ బదివేలు వేఱొకటి చేయఁ గొఱంతయుఁ గల్గెనే! రసా
యన మగు నీదుపల్కు మహిషాసురమర్దని! లోకవర్ధనీ॥ ౭౫౮

వ॥ గ్రీసుపర్ణ సంవృతంబగు నీ దేహమ్మున నపరాధసహిష్ణుండు తృ తీయుండు లేఁడు గావున సఖీభూత వగునిన్ను విడివి జీవుండొక్కఁ ర్చెడిదిం చుకయు లేదు పాపాత్ములు దుష్ప్రాపంబు లగుసురాసుర మనుజయోను లం బుట్టియును నిన్నెఱుంగఁ జాలరు సుఖమ్ముననొండె దుఃఖమ్ముననొం డె నీచరణంబులు దక్కఁ దక్కటిశరణమ్ము లే దని మనోవాక్కాయక ర్మమ్ములం ద్రిశుద్ధిగ వచియించుమమ్ముం దయాంతరంగవై పాలించుభా రమ్ము నీదై యున్నయది యనునమరులందగుగతి పేర్కొలిపి యంతర్ధా నంబు చేసె ననునాత్రేయవతేయునకు జనమేజయుం డిట్లనియె. ౭౫౯

సీ॥ దురితంపుసంసృతిఁ దొలఁగించుసదుపాధి సజ్జనకర్ణరసాయనంబు,
పటుతరామయభారపాషాణటంకంబు భక్తలోకైకకల్పద్రుమంబు
సుఖకరశ్రీలోకసోపాననిశ్రేణి సంపత్కదంబవర్జన్యబుతువు, కాతర
కృతిభూతభేతాళనిచయంబు సకలరక్షస్సముచ్చాటనంబు, గీ॥ చారు
లీలాకదంబసంచారభూమి, తనుతరేతరమోదసంధాయకంబు, హరి
హరవిరించిముఖ్యదేవాపథకృత్య, ధీయమానంబు గాదె శ్రీదేవిచరిత.

వ॥ ఇట్టిచరిత్రంబు కృతజ్ఞుం డెవ్వండు వినవోపం డని వెండియు.

ఉ॥ ముండటిజన్మమం దెవఁడు మోదవిధాయిని యైనదేవికిం
బొందెడిభక్తిఁ బూజ లిడునో కృతకృత్యుఁ డతండు భోగి యా

నందియు నై ధరాతలము నాల్గుచెఱంగులు నేలఁ జాలున
స్పందితకీర్తిశాలి యగుపార్థివుఁడై జనియించు మీఁదటన్. ౪౬౧

ఉ॥ అంబ నెఱుంగఁ జాలువినయంబు వివేకములేనిపెక్కులా
యంబులు వచ్చునట్టి జననాంతరమందు రుజాభిభూతిమై
బంబినదుఃఖవేదనలఁ బొల్పడి రిక్తతఁ గాంచి కట్టవ
స్త్రంబు భుజింపఁ గూడు గొనఁజాలక సంతతి లేక కుందరే.

క॥ కావున నిఖిలార్థదమై, పావనమై ముక్తిద మయి భద్రప్రదమై
కోవిదమాన్యం బగున,ద్దేవిచరితంబు నాకుఁ దెలుపంగదవే. ౪౬౩

గీ॥ అమరరిపుఁ డైనమహిషుఁ దునిమినమీఁద, నంబ యెచ్చోటి కేగె నే
మాచరించె, నేవిధమ్మున వర్తించె నిదియు విస్త,రించి వలతు నె
ఱుంగ నా కెంచిచెపుమ. ౪౬౪

## దేవ్యంతర్ధానోత్తరవృత్తాంతము.

క॥ అనవుడు సాత్యవతేయుం డను జనవర! మున్ను హరిహరాదులు స్తో
త్రం,బును గొని రెయ్యెడ నయ్యెడఁ, జనియె మణిద్వీపమునకు జగ
దంబ వెసన్. ౪౬౫

వ॥ పిమ్మట నమరులు జగదంబ వీడ్కొలిపి యమ్మహిషురాజ్యమ్ము
న రవివంశసముద్భూతుండును నయోధ్యాపతియునగుశత్రుఘ్నుం డను
రాజు నభిషిక్తుం జేసి తమతమపొందు పట్లకుఁజనిరి. శత్రుఘ్నుండు
ను యథోక్తంబుగ రాజ్యంబు శాసించు చుండు నెడ. ౪౬౬

సీ॥ నెల మూఁడువానలు నియతిమైఁగురియుచు ధనధాన్యములకల్మి తఱుఁ
గ కుండు, ఫలపుష్పసంపత్తిఁ దులదూఁగువృక్షముల్ వట్టనిజలముల
వఱలునదులు, కుండలకొలఁదిగా గోవులు పా లిచ్చు ద్విజులు శ్రు
త్యుక్తవిధినిఁ జరింత్రు, నృపు లస్త్రవిద్యల నేర్పువాటింతురు పౌర
పొచ్చెములు లేవు భూతములకు॥ గీ॥ అంకుబొంకులు లేక నిరంకుశ
గతిఁ, బ్రజలు ధర్మానువర్తులై పార్థివాజ్ఞ, మెలఁగుచుండు నతనిభూ
మి తలమునందు, నెల్లరు సుమాళమునఁ బొల్తురెల్ల వేళ. ౪౬౭

ఉ॥ అన్నరనాథుదేశమున నారసి యెచ్చటఁ జూచెనేనియున్
జన్నపుశాలలా! మఱియు సత్రములా! శుభమంటపమ్ములా!

కన్నులపండువై యెసఁగఁగాఁ దగుచక్కని దేవళమ్ములా!
యెన్నఁటఁ జూచినన్ దనివి యెన్నటికిం గనఁ బోల దేరికిన్. ౪౬౫

సీ॥ పాషండమతముస్వప్నమ్మునఁగనరా దధర్మంబు మొట్టమొదటికిలేదు
మిత్రవియుక్తి యమిత్రవృద్ధియు నపమృత్యుభయంబు దుర్భిక్షబాధ
మారిమసంగుట మరియాద దప్పుట రోగంబు దైన్యంబుభోగవిరతి
దాంపత్యవిరహంబుదాంభికత్వంబుచౌర్యంబుపైశున్యంబురాజకలహ
గీ॥ మాగమద్వేష మనునవి యరయ నుండు,నకును గానంగ రావు త
న్నరవరేణ్యుఁ, డాడితప్పనివాఁడు మహానుభావుఁ, డపరిమత్తుం డ
తంద్రాళుఁ డనఁగఁ దగఁడె? ౪౬౬

ఉ॥ ఆనగరిన్ ద్విజుల్ త్రివిధులై పొలుపొందురు రందు సాత్త్వికుల్
దానములన్ గ్రహింప రపధర్మములన్ జరియింప రెద్వరం
బేనియు జీవహింసకు సహింపక పిష్టపశుం బొనర్తు ర
మ్మానధనుల్ త్రికర్మముల మన్ననఁ జేయుచు నుందు రాజిటన్ ౪౬౭

క॥ నృపపౌరోహిత్యము క, ర్మపరత విధివిహితమైనమాంసాదనమున్
గృపణతలేమియునై శ్వ,ర్యపటుత్వముగలిగియుంద్రు రాజసులందున్

గీ॥ కించిదధ్యయనము నృపకింకరత్వ, మధికకోపము ద్వేషరాగాభియుక్తి
గలిగి యొకభంగి వర్తింతురి కర్మబాహ్యు, లగుచుఁ దామసులైన
బ్రాహ్మణజనములు. ౪౬౭

సీ॥ మ్మాపతులు దానపరులు బ్రాహ్మణనిరతులు, యాగసంసక్తులవని
రక్షానురక్తు, లస్త్రశస్త్రవిశేషజ్ఞు లనఘమతులు, తెలివిగలవారు
కలిమియు బలిమి గలరు ౪౭౩

క॥ విడుమరదొడరనిసిరియును,నుడుగునకెడలేనికృషియు నొగిగోరక్షన్
మడపక చేయుటయునునివి,యెడపకచరియింతురందు నెందును వైశ్యుల్

వ॥ ఇట్లుమహిషవధానంతరమ్మున రామరాజ్యంబై ప్రపంచంబు
సుమాళమ్ముగాఁ గొంతకాలం బుండఁ బిమ్మట జగద్ద్రోహంబొనర్ప
సమకట్టిన శుంభనిశుంభులను జండముండులను రక్తబీజధూమ్రలోచను
లను బరిమార్చి సురపక్షపాతినియై జగదంబ జగమ్ములకు మేలువాటించె

నన వార లెవ్వరేవిధమ్మున వారేకతమ్మున వధించె నునువు మనుడు రాజునకు ముని యిట్లనియె ౪౭౩

క॥ మును శుంభనిశుంభులు నాఁ, జనుదానవు లిరువురుర్ రసాతలవాసుల్ జనవరతపముండిరశన, మునకుదకమునకును గాక మొరదులభంగిర్

మ॥ పదివేలేం డ్లిటు లాచరించుటయు నప్పద్మాసనుం డేగుదెం చి దయాంతఃకరణుండు వేడుఁ డన నీచే నొడ్లచే నేరిచేఁ దుదిలేకుండ నొసంగుదే యనుడు నాదుష్టాత్ములం గాంచి యి ప్పుడు వేఱొండువరంబు గోరుఁ డన నవ్వా రంజలిర్ మోడ్చుచుర్

మ॥ జననం బందినవారికిర్ మృతి యవశ్యంబెని మా కొక్కయం గనచే దక్క నరాయ మొండొరులచేఁ గాకుండ గా నిమ్ము మ మ్ము నెదుర్పంగలకాంతయుం గలుగునే! పో! చూత మట్లైన నాఁ గ నొసంగెర్ వర మట్లు కాక యనుచుం గంజోద్భవుం డొప్పుగర్.

వ॥ అన్నదమ్ము లిట్లు వరమ్ములం బడసి తమకు భృగువుం బురోహితుఁ గా గైకొని రందు జ్యేష్ఠుం డగుశుంభుండు శుభదినమ్మున సుముహూర్తమ్మున సింహాసనాభిషిక్తుండు గా నిశుంభుండు మంత్రియై సకల తంత్రమ్ములు నడుపుచుండె మహాప్రేము లగుచండముండు లిరువురును సేనాధిపతులై వారిం గొలుచు చుండిరి ధూమ్రలోచనరక్తబీజు లను వారు పాతాళమ్మున నుండి వచ్చి రెం డక్షౌహిణులతో నాశుంభుఁగొలుచుచుఁ దదనుమతులై రందు. ౪౭౮

గీ॥ రక్తబీజుం డసాధ్యసంగ్రాముఁ డతఁడు, పోరునెడ నస్త్రహతిఁ జేసి పొడమునల్ల, పుడమిఁ బడి నంతలో వానిఁ బోల, జాలు వీరులుద యింతు రొక్కట వేనవేలు. ౪౭౦

వ॥ కావుననవ్వానికి రక్తబీజుం డని పేరు సార్థకంబు మఱియు ననేకులు రక్కసులు చతురంగబలసమన్వితులై యాశుంభుం గొలువ వచ్చిన శుంభుండును వారల నెల్లర లోఁ గొని రాజ్యం బేలుచుండె నంత నిశుంభుం డొక్కనాఁడు. ౪౭౧

చ॥ అమరపతిం జయింప నమరాలయ మేగిన వజ్రి నిర్జరుల్,
గుమిగొని తోడు రా నెదురుకొల్పవరించి దురంబు చేయ లో
కము వెగడొందె నంత బ్రియకాలుఁడు వోలె సురేశ్వరుండు వ
జ్రము గొని యేసె నయ్యసుర వ్రాలెఁ బడల్పుసుమూర్ఛ పెంపునన్

క॥ చారులుతమ్ముఁడుమూర్ఛం, గూరినవిధ మెఱుఁగఁ జెప్పఁ గ్రోధాకులుఁడై
ధీరుఁడు శుంభుఁడు సంగ్రా, మారంభుండయ్యె నమరులటునిటు చెదరన్

వ॥ ఇట్లు శుంభుండు విక్రమించి యింద్రాదుల జయించి.

చ॥ అమరపదంబు చేకొని సురారి మయమ్ముగ నేలుచున్ గ్రమ
క్రమమున నష్టదిక్పతులగద్దియలం దనపాలు చేసి వి
క్రమమున మూఁడులోకములు రాజ్యము సేయుచు నందనమ్మునం
దు ముదమ్ము మీఱ నచ్చరలతో విహరించె నవార్యచర్యుఁడై ౪౮౪

చ॥ అనవరతంబు కల్పకసుమాంచితుఁడై, సుధ గ్రోలుచున్ సురాం
గనలఁ జెఱన్ దవిల్చి కడుఁ గంటకుఁడై మఖభాగముల్ హరిం
చి నిఖిలదేవతల్ తనకు సేవకాఁ బచరించి తత్కృతుల్
పౌనరుక్తఁ జేయుచు న్నెగడెఁ బొంపిరివోయిన మేటిసంపదన్ ౪౮౫

చ॥ ఒకఁడు యముండు శీతగుఁ డిఁక నొక్కఁడు వహ్ని మఱొక్కఁ డింక వే
ఱొకఁడు దినేశ్వరుండు శశియున్ మఱియొక్కఁడు వాయుదేవుఁ డిం
కొకఁడు నొకండు పాశి యిటులొక్కొకఁ డొక్కొకరుండుగాఁ దదీ
యకృతులు సేయ నేర్పఱిచె నాత్మకు నచ్చిన దానవేంద్రులన్.

వ॥ అంత నమరులు నిరాలంబులై దానవుల ధాటికి నోడి యరణ్యంబు శరణ్యంబు గా గుహలు గృహమ్ములు గా నలందురుచు నక్కడక్కడఁ బంచబంగాళమ్ముగాఁ జరించుచు సుఖం బెఱుంగక విమనస్కులై యుండి రని వెండియు. ౪౮౬

చ॥ నరవర! కాలపర్యయ మనన్ గడు దుర్భగ; మెంతవారు త
త్పరత సుఖంబు దుఃఖమును దాల్తురు భిక్షుకు రాజుఁ జేయు భూ
వరు నతిథిం బొనర్చు బలవంతుని దుర్బలుఁ జేయు దుర్బలున్
స్థిరబలుఁ జేయు నయ్యది యజేయము దాఁటగరాదు బ్రహ్మకున్

ఉ॥ శూరు లశూరులున్ మిగుల సూరు లసూరులు నంగలారె! యె
వ్వారికి నెన్నియే న్గతు లవారణఁ గాలముగూర్చుఁ గాక యెం
తే రహి నూఱుజన్మముల నిష్ఠమెయిన్ బచరించి యింద్రుఁడై
పారము లేనిదుఃఖముల బొల్పడు నే! యటు గానిచో నృపా ౪౮౯

క॥ హరుఁడు కపాలం బూనుట, హరి నానాతుచ్ఛయోనులందుఁ బడు
టయు,న్నగనాథ! కాలగతి దుర్భర మియ్యది యిట్టి దనుచుఁ బలు
కం గలదె. ౪౯౦

ఉ॥ ఈగతి దేవతల్ వనములే శరణమ్ముగ నేగ శుంభుఁడు
ద్యోగము చేయుచుండె నటు లొక్క సహస్రము నిండె వర్షముల్
భోగములేమి నంతయును బొల్పఱి యింద్రముఖామరుల్ దివం
బేగతిఁ గొందు మెట్లు వధియింతుము వీని నటంచు నెంచుచున్

వ॥ ఒక్కనాఁడు బృహస్పతిం గని మహాత్మా! నీవు సర్వజ్ఞుండ వీసం
కటమ్మున నొనర్పం దగు నుపాయమ్మొండు యోజించి సురలం బార
మేదింప ననుగ్రహింపుము. మంత్రమ్ముల ప్రభావమ్ము లప్రమేయంబులు
తద్బలమ్మున నభిచారహోమం బొండె నిష్టులొండెఁ జేయించి మాప
దంబు మాకుం జేకూర్పుము నావుడు బృహస్పతి యిట్లనియె. ౪౯౧

ఉ॥ నల్లవొ మంత్రతంత్రము లనన్ విధిచోదిరీతిఁ గార్యముల్
చెల్లఁగఁ జేయ నక్కటిగఁ జేయఁగ నేరవు తత్త్వదాధిప
త్యోల్లసితుల్ సురేశ్వరు లహో! యిటు మీరలు దుర్దశాహతుల్
పెల్లుగ నున్నవార లెటు పెంపిడు నయ్యవి కేవలస్థితిన్ ౪౯౩

వ॥ అదియునుం గాక యవశ్యభావ్యంబు లగు కార్యంబులకుఁ
బ్రతీకారంబు లేకుండు నైనను దనకొలఁది నుపాయం బొనర్చుట
శిష్టానుమతంబు దైవంబు ప్రధానం బని కొందఱు చెప్పినను దానిను
పాయవాదు లంగీకరింపరు కొంద ఱుభయమ్మునను గార్యసిద్ధి యని
నుడువుదురు గావున సర్వంబు నేకం బొనర్చి. ౪౯౪

క॥ కేవలము దైవ మనక, కేవలము నుపాయ మనక కొగిన్ బ్రతికారం
బేవెంట నెచటఁ దగు నది, యేవచియించెద నొనర్పుఁడీరుకడంకన్

క॥ మును మహిషాసురునిం జంపిననాఁ డయ్యంబ సురలఁ బ్రేముడిఁ గనిచె
ప్పిన విధము మఱచితిరె చ, య్యనఘ జననిం దలంపుఁ డాపద దొలఁగున్

ఇంద్రాదులు హిమాలయమ్మున కరుగుట.

వ॥ కావున హిమాచలమ్మునకుం జని మనోహరంబగు నప్పర్వతమ్మున నప్పరాంబ మాయాబీజపురశ్చరణం బొనర్చినఁ గార్యసిద్ధి యగు నవ్యాజ నప్పరశక్తి యెల్లప్పుడు వసియించు ననియు వింటి నావుడు నిలింపులు తద్గిరిశిఖరమ్మునకుం జని మాయాబీజమ్ము జపియించుచు నిట్లు నుతించిరి. ౮౯౭

దండకము.

శ్రీమన్మహాదేవి! విశ్వేశ్వరప్రాణనాథే! సదానందరూపే! సురానందదే! తే! నమో! దానవాంతప్రదే! మానవానా మనేకార్థదే భక్తిగమ్యస్వరూపే? న తే నామసంఖ్యాం న తే రూప మీదృక్కథా కోఽపి వేదాదిదేవాదిరూపే? త్వ మేవాసి సర్వేషు శక్తిస్వరూపా, ప్రజాసృష్టి సంహారకాలే సదైవ స్మృతి స్త్వం ధృతి స్త్వం త్వ మేవాసి బుద్ధి ర్జరాపుష్టితుష్టీ ధృతిః కాంతిశాంతీ సువిద్యా సులక్ష్మీ ర్గతిః కీర్తిమేధే త్వ మేవాసి విశ్వస్య బీజం పురాణం యదా యై స్స్వరూపైః కరోషీహ కార్యం సురాణాం చ తేభ్యో నమామోఽద్య శాంత్యై క్షమా యోగనిద్రా దయా త్వం వివక్షా స్థితా సర్వభూతేషు శస్తై స్స్వరూపైః కృతం కార్య మాదౌ త్వయా యత్సురాణాం హతోఽసౌ మహారి ర్మదాంధో హయారి ర్యయా తే సదా సర్వదేవేషు దేవి! ప్రసిద్ధా పురాణేషు వేదేషు గీతాః కి మత్రాస్తి చిత్రం యదంబా సుతం స్వం మునా పోషయే త్తోషయే త్సమ్యగేవ ప్రసూ స్త్వం యతో నిర్జరాణాం సహాయాంకురుష్వైకచిత్తేన కార్యం సమగ్రం నవా తే గుణానా మియత్తాస్వరూపం వయం దేవి జానీమహే విశ్వవంద్యే కృపాపాత్ర మిత్యేవ మత్వా తథాఽస్మాన్ భయేభ్య స్సదా పాహి పాతుం సమర్థే! వినా బాణపాతై ర్వినా ముష్టిఘాతై ర్వినా శూలఖడ్గై ర్వినా శక్తిదండై రిపూన్ హన్తు మేవాసి శక్తా వినోదా త్తథా పీహ

లోకోపకారాయ లీలా ఇమా శ్శాశ్వతం నైవ జానంతి మూఢా
న కార్యం వినా కారణం సంభవే ద్వా వయం తర్కయామోఽను
మానం ప్రమాణం త్వ మేవాసి కర్తా స్య విశ్వస్యధాతా భవే త్సృష్టి
కర్తా ముకుందోఽవితాయం హరో నాశకృద్దైవ పురాణప్రసిద్ధా నకిం
తత్ప్రసూతా స్త్రియ స్తే యుగాదౌ త్వ మేవాసి సర్వస్య తేనైవ
మాతా త్రిభి స్త్వం పురా నాధితా దేవి దత్తా త్వయా శక్తి రుగ్రా
చ తేభ్య స్సమగ్రా త్వయా సంయుతా స్తే ప్రకుర్వంతి కామం జగ
త్పాలనోత్పత్తి సంహారకార్యం త్వదీయాంఘ్రియుగ్మాశ్రయాః శుంభ
దైత్యార్దితాః నిర్జరాః దేవి పాయా స్స్వదన్య న్న తే జానతే దేవి
దుర్గే. నమస్తే. నమస్తే. నమస్తే. నమః. ౪౯౮

వ॥ అని వినుతించి వెండియు.

గీ॥ విబుధబృందమ్ములెల్ల నీవెంట నంటి, యెల్లవేళ నినుం గొల్తు రెఱుక
కలిమి, నట్టిత్వత్పదపద్మమ్ము లరసి భక్తి, మన నెఱుంగనియతు లతి
మందమతులు ౪౪౯

గీ॥ కమలవై కీర్తివయ్యును గాంతివయ్యు, లజ్జవై స్థితి వైనజగజ్జనని ని,
ను మది భజియింప కకటసంభమున నుంద్రు, వైష్ణవులు సౌరులును
బాశుపతులు దేవి ౫౦౦

క॥ హరిహరు లేఱుగడగ నీ౯, బరమాదరమున యజింప వల నెఱుఁగ
మి నీ,చరణములు విడుచుదుర్మతు,లరయ౯ విధివంచితాత్ము లనఁ
దగు నంబా ౫౦౧

క॥ హరి జతురసముం గొని సా, గరజాపదరంజనమ్ము గావించు౯, శం
కరుఁ డగజాపదపంకజ, పరాగరతుఁ డింక నొరుల వాకొనఁ గలదే

క॥ సారవిహీనం బని సం,సారము వర్జించి జన్మసాఫల్యంబు౯, గోరినిను
యతులు దలఁతు రు, దారం బగుభక్తికలిమి దాంతహృదయులై

గీ॥ పలుపలుకు లేల నీపదభక్తి లేని, చెనఁటులెల్లను రోగులై శ్రీ
రొలంగి, సంపరణకూపమునఁ బడి సౌఖ్యలేశ, మెఱుఁగక నశింతు
రఖిలలోకైక జనని. ౫౦౪

గీ॥ క్షత్రియులు మోచికొని గడ్డికట్ట లమ్ము, కొనుచు నేవపుఁ గతిని జీవ
నము చేయు, హీను లందఱుఁ దొల్లి ని న్నెఱుకకలిమి గొలువని
తులు వ లింత నిక్కువముతల్లి. ౧౦౬

వ॥ అని పలువిధమ్ముల సన్నుతించు సమరులఁ గరుణించి జగ
దంబ ప్రత్యక్షంబు గా నుంకించి ౧౦౭

ఉ॥ చక్కనిచీరఁ గట్టి విలసన్మణిభూషణభూషితాంగి యై,
యొక్కటి నేగుదెంచె సురలెల్లరుఁ జూచి "యిదేమొ యిప్పు డీ
చక్కరబొమ్మ గంగకిటు చయ్యన నాడఁగ నేగుదెంచు నం
చొక్క మొగి న్నమస్కృతుల నొయ్యనఁ జేసి తను న్నుతింపఁగన్

వ॥ గిరిగహ్వరమ్మునుండి గంగ కేగునెపమ్మున వచ్చి సురలం
గాంచి యి ట్లనియె ౧౦౮

క॥ ఏమీ దేవతలా! యిం, దేమి పనికి వచ్చినార్లొ! యీగతిఁ గడుఁజిం
తామగ్ను లగుటకుంగత, మేమొకొ! నా సురలు జగదధీశ్వరి కెలమిన్

ఉ॥ కేలు మొగిడ్చి యంబ! మముఁ గీస్వడకుండఁగఁ బ్రోవ నెంచు మే
మాలములో సురారులకు నడ్డముగా నిలుపోవ లేక మా
చాలమి విన్నవింప నిటు చయ్యన వచ్చితి మేము దక్కి మా
పాలన నీది కాదె! మును వల్కినపల్కు స్మరింప కుందువే. ౧౧౦

మ॥ జననీ! శుంభనిశుంభు లన్ దనుజు లిచ్ఛామాత్రి మమ్మెల్లఁ దా
మనిలోఁ గీటడగించి యేలుదురు స్వర్గావాస మాదృష్టు లె
వ్వనికిన్ వధ్యులు గారు బ్రహ్మవర మప్పాటన్ బొసఁగించె నం
గనచేఁ జచ్చెద రాహయారిబలె, నేకంజాక్షికిన్ శక్యమా ౧౧౧

క॥ మాంపా టిట్టిది యని నీ, కేపాటం జెప్ప నేర్చు మేముగడయులే, కావ
దలకుఁ బ్రాపై దు, ష్ప్రాపం బగునడవి నిడుమ పడఁగా వలసెన్

క॥ మును మహిషుఁ జంపి పిమ్మట, ననయులు మిము బాధ వెట్టునప్పు
డు ననున్, మనమునఁ దలఁపుఁడు కార్యం, బును దీర్చెద నన్న
మాట పొల్లగు నంబా. ౧౧౩

వ॥ శుంభనిశుంభు లట్లుండ రక్తబీజచండముండు లను వారు
గడు మొనకులై వారికి బాసటగా నున్నవారలు వేయేల నష్టదిక్పాలకు
లును నిపవడు రక్కసులకా నెఱుంగుము ౫౧౪

క॥ అన దలఁచె నీపాదం, బున బడుమముఁ గరుణఁ జూచి పొగరుమి
గులున, ద్దనుజులఁ బరిమార్పఁగ యు, న్నను నిటు లెన్నాళ్ళు వనము
నం బడుదు మిఁకన్ ౫౧౫

## దేవి శుంభనిశుంభులపురమ్మున కరుగుట.

వ॥ ఇట్లు మాటిమాటికి సన్నుతించి పనటం బడునమరులయెడఁ
గరుణ గలిగి యప్పార్వతి తనశరీరమ్మునుండి యిచ్ఛామాత్రమ్మునఁ గౌ
శికి యనునొకశక్తిం బుట్టించిన నయ్యంబిక నీలవర్ణ యగుటఁ గాళిక
యనియు గాళరాత్రి యనియుం బరఁగి మహాఘోరాకారంబు గలిగి
సర్వకామప్రదయై చెలువారె నప్పరాంబయు సర్వభూషణభూషితం
బగురూపమ్మునఁ బరిఢవిల్లుచు నమరుల కానంద సంధాయినియై యి
ట్లనియె. ౫౧౬

ఉ॥ శుంభనిశుంభులన్ దివిజ సూదనులం బరిమార్చి సంపదా
రంభము మీ కొనర్తుఁ దలరన్ బని లే దిఁక నాకులార! దు
ర్దంభమునన్ జగమ్ముల నదల్చెడిదుష్టులయార్తిఁ జేసి వి
శ్వంభర కింత పుట్టెనె యపాయము బ్రహ్మవరంబు పెంపునన్ ౫౧౭

వ॥ అని యభయంబిచ్చి జగదంబ స్వాంశ సంభవ యగుకాళిక
దనకుఁ బార్శ్వవర్తినిఁ గా సింగంబు నధిష్ఠించి శత్రుపురంబున కుద్ద
విడిఁ జని యుపాంతోపవనమ్మున విడిసి ౫౧౮

చ॥ అమరులు మోదమంగఁ గ మృగావళి మత్తిలఁ బక్షిబృందముల్
గుమిగొని యాలకింపఁగఁ జిగుళ్లిగురింప జగంబు మోహవా
ర్ధి మునిఁగి దోప్పదోఁగఁ గడుఁ దియ్యఁదనమ్మును సొంపుపెంపు నొ
క్కమొగిన యంకురింప మృదుగాన మొనర్చె ననేకభంగులన్

వ॥ పదంపడి యెడనెడ నుపవనమ్ములఁ గ్రీడార్థంబు గ్రుమ్మరు
చండముండు లిరువురును దద్గానరసంబు కర్ణపేయం బగుటఁ గొంతవ

డి నాలించి దాదవ్వల నిలిచి త్రిజగన్మనోహారిణి యగునంబికను దత్సమీపవర్తిని యగు కాళికను గాంచి పెచ్చుపెఱిఁగెడి యచ్చెరువునఁ బురికరిగి శుంభుంగాంచి మొ్రొక్కి యిట్లనిరి. గీ. ౨౦

ఉ॥ ఎక్కడనుండియో యొకమృగేక్షణసింగము నెక్కి వచ్చె న
మ్మక్క యనన్ వశం బగునె యచ్చెలువంబు వచింప నట్టిబల్
చక్కరబొమ్మ ముజ్జగములన్ గనఁగా వినఁగా నెఱుఁగ మా
టక్కరి గానవిద్య నొకటందగుఁ దక్కిన నట్టె యుండఁగన్. గీ. ౨౧

క॥ మనయుద్యానమ్మున న, వ్వనితారత్నమ్ము గానవైఖరుల దనఁతన
మృగముల మెప్పించుచుఁ దన కొకచెలి తోడుగాఁగఁదన రెడివింటే

వ॥ వెయ్యేల యబ్బాలికారత్నం బెవ్వతెయో కలతెఱం గెఱింగి తోడికొని వచ్చి భార్యగాఁ గైకొని సుఖింపు మింతకన్న నీసంసారమ్మున సౌఖ్యం బొం డుండునే యని వెండియు. గీ. ౨౩

మ॥ సరసైరావతపారిజాతములు నుర్ సప్తాస్య మానశ్వ మం
బరయానోచిత మా విమానము సురస్వామిన్ వినిర్జించి నీ
పరముం జేసితి వట్టిబల్మి గలసంపత్కామునిన్ మేల్మి పొం
దిరిపోవర్జను నీకు నీయబల దేవేరిం గొనన్ బోల దే. గీ. ౨౪

చ॥ వరుణునిఛత్రి మీఁవు గొని పాశము తమ్మునికిచ్చి తగ్గనే
శ్వరునిధి చూఱకొల్లలొలిపి నాగర మిచ్చెననిత్యకాంతివి
స్ఫురదురుపుష్పమాలయు నపూర్వపురత్నములన్ గ్రహించి ని
త్యరుచి వెలుంగు నీకిదిగదా! తగు నెచ్చెలి యెన్నిభంగులన్. గీ. ౨౫

గీ॥ దండంబు మీఁ తెడియముని దండంబు మృత్యు, శక్తియుఁ బరాక్రమమ్మున
సంగ్రహించి, కామధేనువు పాల్గొ్రిలఁ గలయదృష్ట, వంతునకు నిట్టి
కాంతతోఁ వలదె పొందు. గీ. ౨౬

గీ॥ స్వర్గమర్త్యాదినిఖిలభువనములందుఁ, గలుగు నిఖిలరత్నమ్ము లబలిమిఁ
గొనిన, యప్సరః కాముకునకు నీ కమర వలదె, యట్టిరత్నముతోడి
పొం దెట్టులేని. గీ. ౨౭

క॥ నీగృహామునఁ గలరత్నము, లీగజగామినికిఁ దక్కనేలియు రత్న
శ్రీ గొఱఁత చెందు నీతరు, ణీగణరత్నంబు వాని నెగడించుఁజుమీ.

వ॥ అని కైపెక్కించిన నమ్మదోన్మత్తుండు సమ్మతించి కెలననున్న సుగ్రీవుం డనువానిం బిలిచి యిట్లనియె. ౧౨౯

గీ॥ దూతవై వేగ మిప్పు డత్తొయ్యలికడ, కేగి కార్యంబు పొసఁగించి
రాఁగ దగుదు, వాద్యుపాయద్వయంబ యర్హంబు దీని, కంద్రు
శృంగారరసవిదు లగురసికులు ౧౩౦

ఉ॥ సామము దానముఁ విడిచి చయ్యనఁ గొందఱు భేద మిట్టిచోఁ
గాముకు లాచరింతు రది కర్జము గాదు రసంబు భంగమౌ
పామయదూషితం బగు నహంకృతి దండమ యేసిఁ దదప్రిసం
బేమియుఁ గాన రాక మొదలే చెడుఁ గాన ద్వయంబు నింద్యమౌ

క॥ రా నిచ్చ గలుగు కామిని, యే నది నేరుపున మదికి నింపు నొలిపినఁ
దానమున సామమున నొగి, దాన్నై చను దేగ కున్న తక్కిన వేలా

వ॥ అని యనిపిన సుగ్రీవుండు సని సింగంబు నెక్కి సర్వాశ్రం
గారంబుగ నొప్పునజ్జగదంబం గని మ్రొక్కి వినయమ్మున ని ట్లనియె

చ॥ త్రిదశుల జీరికిం గొనక దేవపదమ్మును గొన్న శత్రుదు
ర్మదపరిహారి శుంభుని స్మరప్రతిమాను నెఱింగి యుండుదే
వాదవతి! దూత నే నతనిమన్ననకుం దగువాఁడ; నీదు మే
ల్విధమును విన్కిఁ జేసి స్మరపీడితుఁడై ననుఁ బంపె నియ్యెడన్.

వ॥ అతండు నీయెడల మోహమ్ముకతన వినతుండై పలికినపలు
కులు వినుము. ౧౩౧

చ॥ అమలినగాత్రి! దేవతల నందఱ గెల్చితి సర్వయజ్ఞభా
గములు మదీయముల్ త్రిదశముఖ్యరుఁ డక్క బిరు వొందినాకలో
కమునఁ గల్గురత్నములఁ గైకొని ముజ్జగ మెల్లఁ జేతిలో
నమరఁగ రాజ్యముఁ వలయున ట్లొనరించుచు నుంటి నద్ధతిన్

గీ॥ ఇట్టి ధట్టుఁడ నైన నాకిగుఁబోఁడి, నీదు చెలువంబు వీనుల నిండ
కాము, బారికోర్చుట పెద్దయు భార మయ్యె, నెరవు చేయక వేర్వ
నీవరయ వలయు. ౧౩౨

ఉ॥ దాసుఁడ నైతి నీమది ముదం బెటు లొందు నటుల్ చరింతు నా
సాసఁ జిక్కుచున్నననుఁ నాఱడి వెట్టక యేలుకొమ్ము నా

వాసి యెఱుంగు మెవ్వరికి వధ్యుఁడఁ గాను నన్ను వరించి నీ
కేసతు లీడు లేక చరియింపుము నిత్యసువాసినీగతిన్. ౧౩౮

వ॥ అతనిపల్కులచందం బియ్యది దీనం గలసారం బరసి ప్రత్యు
త్తరం బొసంగి త్రిలోకీరాజ్యంబు నీవయై యెల్లదానవుల నేలికొనం
దగదే! నావుడు జగదంబ మందహాసం బిగురొత్త ని ట్లనియె.

ఉ॥ జేతగ దాతగా సుగుణసింధునిఁ గాఁగ నఖండలక్ష్మికిన్
పేతునిఁ గాఁగ సుందరుఁగ నే వినియుంటిని శుంభుని న్ యశ
స్ఫీతుఁ దదీయసోదరు నశేషజగమ్ములయందు; వానిపైఁ
బ్రీతి జనించియే యిటకుఁ బేర్మి యెయిన్ జనుదెంచితిన్ జుమీ.

మ॥ సురయక్షాసురమానవప్రముఖులం జూడంగఁ జూడంగ నె
ల్లరుమీరాజున కోడియుంటి" మని గల్పప్రజ్ఞులం బొందరా
మి రసజ్ఞోత్తరుఁ డైనమీవిభునిపై మే ల్వుట్టె నారాక; బం
గరు రంగారెడిరత్న మెవ్విధమునం గాంక్షింపదే మేల్మికై. ౧౪౧

క॥ అది గాన మీవిభుని బలె,మది నను మన్నించి నాదుమాట లతని నె
మ్మది కెక్కనొంటిపాటునఁ,గదిసి వచింపుమిటులైనఁగార్యముపొసఁగున్

ఉ॥ సుందరు లందు మేల్మి గలసుందరుఁ డంచు వదాన్యుఁ డంచు మ
ధ్యందిననీరజాప్తకిరణావళిఁ గా దనఁ జాలుతేజ మిం
పొందెడివాఁ డటంచు నిను నోపినవట్టును బూని వింటి నీ
యందు మనమ్ము పుట్టి వశనై చనుదెంచితి నేమి చేసెదో. ౧౪౩

వ॥ ఇంక నొక్కకొంత గలదు విను మది యెట్లంటేని మున్ను
కొండికనాఁడు సఖీజనసమక్షమ్మున నొకవ్రతంబు పూనితి. ౧౪౪

క॥ బలమున నాతో నెవ్వఁడు, గలనఁ గలూఁది నాదుగర్వ ముడుపు న
య్యలఘునిఁబతిగాఁగైకొన,దలఁతుననన్ సఖులునగిరితద్దయునన్నున్.

క॥ అది మొదలు నేఁడు తుదనా,మద మడఁచెడివీరవరుఁ డమరముఖ్యుల
యం, దొడవఁడు నీ విఁక నిది వన్నిదముగ ననుఁ గొనుము ధైర్య
విధి వగుకతనన్. ౧౪౬

వ॥ ఇట్లంటి నని మీప్రభువుతో నేకాంతమ్మునఁ బలికి యెత్తె
ఱంగుననైనఁ గార్యసిద్ధిం బొనర్పు మనవుడు సుగ్రీవుండు విస్మయా
విష్టుండై యయ్యంబ కిట్లనియె. ౧౪౭

ఉ॥ చందనగంధి! యిట్లనుట సాహసమాత్రము స్త్రీస్వభావ మీ
చందము గాక యెల్లదివిషద్గణ మెవ్వనిపేరు విన్న నా
క్రందన మాచరించుఁ గడుఁ గావలుఁ డట్టి యఖండు శుంభు నీ
వెందు జయింప నేర్తె! చటులేక్షణపాతముచేతఁ దక్కఁగన్. ౧౪౮

వ॥ కావున స్త్రీస్వభావమ్మునం దొడరుమూర్ఖత డిందుపఱచి
శుంభు నొండె నిశుంభునొండెఁ బతిగాఁ గొని సుఖం బుండు మఱియు
నుంగాక శృంగారం బెల్లరకును మెత్తఁదనమ్మున ననుభావ్యమ్ముగాని
వేఱొండువిధమ్మునఁ బదనుపడదు నావచనమ్ము లనాదరించి గర్వించి
తేని యతండు క్రుద్ధుండై దుర్మదు లగుభృత్యులం బిలిచి నిన్నుం
బలాత్కారమ్మునఁ దనసన్నిధికి రప్పించికొననేర్చు నట్లు కేశాకర్షణాది
కమ్మునకు లోనై సిగ్గఱ నుఁకించు టది నీబోటిబోటికిం దగుపాడియే!
విను మఱియునుం గాక. ౧౪౯

క॥ రతిసుఖమెక్కడ యుద్ధా, దృతి యెక్కడ మిగులదవ్వు దెలిసి యిరు
వురం, దతివరొ యొక్కనిఁ గైకొని, మితిమీఱు సుఖములఁ దవిలి
మెలఁగుట తగదే. ౧౫౦

వ॥ నావుడు జగదంబ యిట్లను.

క॥ శుంభనిశుంభులు బలియురు,నంభోధిగభీరు లంచు నరయుదు నీవుం
దంభమెఱుంగక తెలిపెడి, గంభీరత గలవు వ్రీతము గా దనదగునే.

ఉ॥ సంగరరంగమందు ననుఁ జక్క నెదిర్చి జయించి నాదుపా
ణిం గొను టొప్పు నాప్రతిన నిక్కము కాక యలంతిఁ బోవ ది
బ్బఁగి వచించి యొప్పమిని బంధుసమేతముగా రసాతలం
బుం గయికోలు మే లనుచుఁ బూనికఁ దెల్పుము మీయధీశుతో

వ॥ మచ్ఛాలాఘాతమ్మునకుం బెగ డొందుకాతరునిం గొన నే
నంత బేలనే! సంగరమ్మున కియ్యకొనని నాఁడు స్వర్గమ్మును మర్త్యమ్మును

ద్యజయించు టొప్పు నీవు భరం బని యెంచక నాపలికినచందంబు సత్యంబుగా వచియింపుము. ౫౫౩

క॥ తనరాజు నడల శాత్రివ, జనులయెడల సత్యరీతి జవదాటక యుం
డినదియ దూతలధర్మం,బని యెఱిఁగి యథార్థ తత్పరాత్ముఁడ వగుమీ

వ॥ అని యిట్లు నీతియు క్తమ్మును బ్రిగల్భమ్మును సహేతుకమ్మును గా నుపన్యసించిన నయ్యంబిక వచనమ్ముల కుత్తరం బీ నేరక సుగ్రీవుండు విస్మయం బంది తనరాజుసన్నిధి కరిగి నమస్కరించి యి ట్లనియె. ౫౫౫

గీ॥ సత్యము ప్రియంబు నైనవచనము దొరక, దని యసత్యంపుఁబలుకు నా కనభిమతము,గావునఁ బ్రియంబు గాకుండఁగాక నిజము,ప్రభుతఁ గృపానుగతి విన వలయు నధిప. ౫౫౬

వ॥ అక్కన్నియనివాసం బెద్దియో రెయ్యెడ నుండి యియ్యెడ కరుదెంచెనో నిక్కవమ్ముగఁ దెలియదు తెలిసినంతవట్టును వివరించెద.

క॥ మదమున సంగరమున ని,న్నెదిరింపఁ దలంచి యున్న దెంతయుగర్వా
స్పద మక్కమలానన నె,మ్మది యూపె వచించినట్టిమాటలు వినుమీ.

వ॥ బాల్యమ్మున సఖీసమక్షమ్మున సంగరరంగమ్మున నెవ్వఁడు నా కెదురై పోర జయించు నవ్వానిం బతిగాఁ గైకొందుఁ గాక యని వ్రతంబు పూనిన దఁట! అయ్యది యపంధ్యమ్ముగాఁ దుద ముట్టింప సమకట్టి యున్నదాన నని యు మీరాజు లందులకు సమ్మతించి య ట్లొనరింప వరింతు ననియు వచించి నన్నుఁ బుత్తెంచె దేవర కెయ్యది హితం బ ట్లొనరింపఁ దగు నని వెండియు. ౫౫౮

క॥ సింగంబు వాహనం, బొక యంగన బాసటయుఁ గాఁ దనంతనకడను, బొంగుచు నెంతయు నీతో,సంగర మాసించి యుండె సఖి రాజేంద్రా ౫౬

వ॥ నావుడు శుంభుం డనుజుని దిక్కు మొగంబై

గీ॥ అబల యొక్కతె తోడఁట! యతివయంట,పోరుటకు వచ్చెనఁట! నీవు పోయి వత్తొ,యేఁ జనుట యొప్పొ వచియింపు మేది మేలొ, నావుడు నిశుంభుఁ డిట్లను నయము మెఱయ ౫౬౦

గీ॥ ఈవు చన నేల నే నట కేగ నేల, ధూమ్రలోచనుఁ బంపు మత్తో
యజాక్షి,నిటకు నిర్జించి తెచ్చు నొక్కింతతడవు,కాకమున్న వరించు
నక్కాంత నిన్ను ౫౬౨

వ॥ పిదప వివాహం బొనరించుకొని సుఖం బుండు మనుడు
శుంభుండు వల్లె యని ధూమ్రలోచనుం బిలిచి యి ట్లనియె ౫౬౩

గీ॥ ఎవ్వఁ డడ్డంబు సొచ్చిన నీడఁ బోక, పట్టి కలఁగించి తత్పార్శ్వ వ
ర్తిని యగు, నంగనం జంపి చంచలాపాంగి నత్తలోదరిని దెమ్ము
నాకు నామోద మిమ్ము ౫౬౪

క॥ మృదుమార్గణములు నీపై, నది విడిచినఁ గనలి సునిశితాస్త్రమ్ములఁ
గొ, ట్టెదుసూ! యొడ లెఱుఁగక య, మ్మదవతి నా కెంతయేని మా
న్యయగుఁ జుమీ ౫౬౫

క॥ దానికిఁ దో డగువారల, పై నెన రించుకయు లేక పరిమార్పుము
నా, ప్రాణంబు ప్రాణ మగున,మ్మానినిఁ గాపాడి యిట కమరఁ దేర
నగున్ ౫౬౬

వ॥ నాపుడు సేనాసహితుండై ధూమ్రలోచనుం డరిగి దాదవ్వు
ల నయ్యంబం గాంచి వినయపురస్సరంబుగా నమస్కరించి మృదు
మధురము లగువచనమ్ముల ని ట్లనియె ౫౬౭

చ॥ వినుము మృగాక్షి! కామశరవేదన కోర్వక మావిభుండు దూ
త ననిపె వాఁడునన్ నరసతన్ గడు సామవిధంబు నీయెడం
జొనిపిన నీవు వానియెడఁ జొక్కపువ్యంగ్యపురంగు లీనఁ జె
ప్పినవచనంబులెల్ల మది వేఱుగ నెంచె రసం బెఱుంగమిన్ ౫౬౮

వ॥ పిమ్మట వాఁడుమారాజునకుఁ దనయెఱింగిన విధమ్మునఁ జె
ప్పిన నతండు చింతాతురుండై ననుం బనిచె నీయందుఁ బ్రేమం బగ్గ
లం బగుకతన నీ వట్లాడుటకు సహింపక విరహాతురుఁడై హృదయ
మ్మొక్కింత చేసికొని వందురు చున్నవాఁడుఁగన న్నెవ్వాఁడు సంగ్రామ
మ్మున జయించునవ్వాని వరియించెద” ననునీపలుకుల కర్థం బిట్లుగా
యోజించె నెట్లం టేని! ౫౬౯

గీ॥ సంగరం బన రెండు తెఱంగు లందొ, కందు రతిజంబు తక్కునొ
కండు బవర, మొకటి సుఖమిచ్చుఁ దక్కిన దొకటి దుఃఖ,దాయి శ
త్రుపురస్కృతత్వంబు కలిమి ౫౨౦

వ॥ అందనంగసంగరంబున న న్నెవ్వఁడు జయించు నవ్వాని
వరియింతు ననుట గాకేమి యని కృతనిశ్చయుండై సకలార్థవేది నగు
నన్ను మరల ననిపె ౫౨౧

క॥ నీచాతుర్యమ్మును విని, నీచనవుం గోరుశుంభునిం బొందుము నీ
ధీచాకచక్యమునకుఁ, వాచానైపుణికి సార్థవైభవ మొదవన్ ౫౨౨

వ॥ కామశాస్త్రవేత్త యగుమారాజు నీహావమ్ములకుం దగుభావ
మ్ము లాచరించి ని న్నొక్కటి జయింప నేర్చు నియ్యెడ నిక్కాళికయ
సాక్షిణి యగు నని వెండియు. ౫౨౩

చ॥ నిను సుఖశయ్యపై శ్రమ జనింపఁ గఱంచి నఖక్షతమ్ములన్
దనువున రక్తిమన్ గొలిపి దంతముల న్నునుమోవి నొక్కి గా
సి నొనరఁ జేసి చెమ్మటలు చిమ్ముఁగ బేర్కిఁ గలంచుమావిభుం
గనుఁగొన నేగుదె మ్మతఁడు గాంచినతోడన నీకు దాసుఁడౌ. ౫౨౪

ఆ॥ వె॥ సురతయోగ్య మైనసొలపును మెలపును, బొలుపు గలిగి చెలఁగు
పూవుఁబోడి, కకట! నీకు సునిశితాస్త్రపరంపర, సైఁపఁ బాడి
యగునె చంచలాక్షి. ౫౨౫

కాళికధూమ్రులోచనునితో యుద్ధముచేయుట.

వ॥ కావున హితంబును రుచ్యంబును నగునాపలుకు విశ్వసింపు
మెవ్విధంబునను సుఖం బీఁజాలనిపెనఁకువకుం జొరకుము నావుడుఁ
గోపాటోపంబు దీపింపఁ గాళిక వాని కి ట్లనియె. ౫౨౬

క॥ రోషం బుడిగి వృథాసై, లూషునిగతి బెట్టిదమ్ములుగ్ గొఱగాముల్
భాషింతు వార! మత్త! వి,దూషక పోరిత మొనర్పఁ దొడరుము
కడఁకన్. ౫౨౭

క॥ నిను నిన్నుం బంపినశుం,భనిశుంభులఁ దునిమి యమునిభవనమ్మునకుం
బనుపఁగ నున్నది మాదే,వి నెదిరి పోరాడు మింత వేరము లేదే.

చ॥ అనుచితరీతి మాజనని కాకలుపాత్ముల కేటిపెండ్లి! న
వ్వనగునుగాక నక్కపయి వాంఛ జనించునె సింహి, కక్కటా!
యను వగునేమొకో! కరిణి కారయ గర్దభసంగ; మెందు నే
నిని గవయంబు నొందఁ జనునే! మొద వంగజతాపసంగతిన్. ౧౮౯

వ॥ కావున దురాత్మా! నీదురాలాపమ్ములు కంబిక సైఁచినను నేను సహించెడిదానఁ గాను జీవింప వలతేని వైళంబ చని యాదుర్మదులం గలసి పాతాళమ్మున కరుగుము వేఱొండు బ్రతుకుతెఱవు నీకుం జొప్పడ దనవుడు ధూమ్రలోచనుండు తామ్రలోచనుండై. ౧౯౦

మ॥ కలహం బన్నను గాలుఁ ద్రివ్వెదవె! నీగర్వం బడంపంగ నే
వలఁతిం గాకయ యింతవట్టు నిటు సంభాషింతునే! కాళి! కే
వలము న్నిన్ను వధించి సింగమును జావ న్మొత్తి యిబ్బాలికన్
బలిమిం గైకొని యేగి మావిభునకుం బట్టంబు గట్టించెదన్. ౧౯౧

క॥ రసభంగభయమ్మునఁ గా,దె సహించితి నింతవట్టుఁ దెలియక నాతో
డ సమర మొనరింపఁగఁ దా, మస మూనెద విపుడ నిన్ను మా
యింతుఁ దగన్. ౧౯౨

క॥ నావుడుఁ గాళిక కోపం, బావిర్భవ మంద నిట్టు లనదపగిది నే
లా వెఱపుమాలుకూఁతలు, కావల మడఁగింతుఁ బోరఁగాఁ దొడరు
మొగిన్. ౧౯౩

ఉ॥ ఆపలుకుల్ శితాస్త్రములయట్టులు కర్ణములన్ బగుల్ప న
ప్పాపపురక్కసుం డడరి బాణపరంపరల న్నిగుడ్ప ను
ద్దీపితకోప కాళికయుఁ దీవ్రశరమ్ముల వానిఁ ద్రుంచి దు
ర్లేఫుని ధూమ్రలోచను బలే! యని మెచ్చఁగఁ గొట్టె నిర్జరుల్.

ఆ॥ వె॥ అంతఁ బోక వానియరదమ్ము నుగ్గుగాఁ, జేసె సింహనాదభాసు
రముగ, నసుర వేఱుతేరి నాయిత మొనరించి, కాండవృష్టి
గురిసెఁ గాళిమీఁద. ౧౯౪

చ॥ అనిశతాస్త్రసంతతుల నన్నిటి నంతరమంద త్రుంచి భి
ట్టూనినకోపవేగమున నొక్కటఁ బెక్కులు గాఁగ నస్త్ర సం

తానము గ్రుమ్మరింప నొకతండముగాఁ బడి రెల్లరక్కసుల్
వానిరథంబు రథ్యములు వమ్ముగ సూతునిఁ దున్మి వ్రేల్మిడిన్. ౨౮౬
మ॥ ధనువున్ భగ్నముఁ జేసి దేవతలు మోదం బంద శంఖంబుఁ బ
ట్టినఁ దన్నాదముసం దిశల్ పగులుమాడ్కిన్ మాఱుఘోషించె న
ద్దనుజుండున్ బరిఘంబు దాల్చి పటువాగ్దంభమ్మునన్ "బింగళో
చన! యోకుత్సితరూప! నిన్నిపుడ పంచత్వంబు నొందించెదన్.
శా॥ హుంకారమ్మున నిట్లు ప్రేలుచు జగం బల్లాడ నుంకించి యే
కొంకున్ లేక తటాలునన్ విడువ దిక్కుల్ వ్రయ్య నక్కాళి దా
హుంకారారవమాత్ర భగ్నముగ నుద్యోగించినన్ దైత్యు లే
వంక న్నిల్వక పాఱి రంత సురముల్ వర్షించి రాదిత్యులున్.
చ॥ నరవర! ధూమ్రలోచనుఁ డనాథగతి న్నిజసైన్యదానవో
త్కరసహితమ్ముగాఁ బడె నఖండగతిన్ జెలరేఁగె మాంస మా
దరమున నాహరింప వడిఁ దద్దయు మూఁగిన కాకగృధ్ర జా
తిరవములున్ శివారవము దెప్పర మయ్యె రణాంగణమ్మునన్. ౨౮౯
వ॥ తత్సైన్యమ్మునందలి యశ్వమ్ములుఁను ఖరమ్ములయు వారణమ్ము
లయుఁ బలలంబు మెక్కి క్రై పెక్కి భూతప్రేతంబులు నాట్యంబు లొన
ర్పం దొడంగె నంత నయ్యోవమునకు సైఁపక యంబిక దాదవ్వగాఁ జని.
ఉ॥ బిట్టుగఁ జిందముం దిశలు బీటలు వారఁగ నొత్తె శుంభుఁ డ
ప్పెట్టిద మారవమ్ము విని పేర్చినశంక గృహమ్ము వీడి యే
మిట్టి విరుద్ధ మంచు నెద నెంచెడిలోనన యేగి సైన్యముల్
గిట్టినవార్త కొంతవడికిన్ హతశేషులు మ్రొక్కి చెప్పినన్. ౨౯౧
చ॥ తెగినశిరమ్ములున్ సగము ద్రెళ్లిన మేనులు నింతలింతలై
పగిలినమూర్ధముల్ వడినపార్శ్వము లొల్కెడినల్లవట్టులై
మగఁటిమి కోహటించి తనమానము దూలఁగ నేడ్పు సేన నె
వ్వగఁ గని శుంభుఁ డిట్టు లను వక్త్రమునన్ వెనుఁబాఁ బుదొట్రిలన్.
గీ॥ ధూమ్రలోచనుఁ డేమాయెఁ! దోయజాక్షి, యేలరాదొక్కొ!మన సైన్య
మేడ కేగె!, భగ్నులై మీర లీగతి బడల నేల!, మందమతులారా! వివ
రించి మాకుఁ జెప్పుఁడ. ౨౯౩

క॥ కడు బెట్టిదముగ గిరులును, బుడమియు నాకసము సంద్రములు గ్ర
క్కదలఁ, దొడరఁగ శంఖరవమ్మొక్కఁడు వినఁబడు దాని కేమి కత
ము సుడుఁవుఁడా. ౫౯౪

వ॥ నావుడు రక్కసులు చెప్పెడి దేమి! యకాలిక ధూళిగా
మనసైన్యమ్ముల తుత్తుములై డంచి ధూమ్రలోచను గిట్టించె. ౫౯౫

క॥ సురహర్షదాయకంబున, సురశోకవిధాయియగుచుఁ జొప్పడు నాభీ
కరశంఖరావ మెఱుఁగుము, పరదేవీరచిత మనుచు భవ్యవిచారా

క॥ మనధూమ్రలోచనుఁడు సైన్యనికాయముతోడఁ ద్రెళ్ళ నమరులు
మోద, మ్మునఁ బుష్పవృష్టి గురిసిరి, మనమున భయ మంది మేము
మగిడితి మిటకుఁ. ౫౯౭

క॥ ఏకాకినియై యూతా, లోకమ్ముల నాల్గుదిక్కులఁ బిట్టుగ నా
లోకించుచు సింగముపై, నాకామిని వెలయుచున్న దాహవకాంక్షఁ

వ॥ ఇంక సంగరంబొండె సంధియొండెఁ గర్తవ్యంపు తెఱం గెఱింగి
వర్తింపు మయ్యంగనకుఁ దోడుగా నెవ్వరును లేకున్నను సురలు బార్ష్ణి
గ్రాహు లగుదురో! యని శంకింతు నయ్యాహవసమయమ్మున హరిహరు
లును, లోకపాలురును, దక్షిణయమరులును, గంధర్వులును, దానవుల
సంబరంబునుండి సుమాళమ్ముగ నీక్షించుచున్నవా రని వెండియు. ౫౯౯

గీ॥ అత్తలోదరిసాహసం బమ్మృగాక్షి, యుక్కు నగ్గజగమనమహోద్య
మంబు, గనఁగ సురలను గిరలను గొనక తాన, మనలఁ బరిమార్చు
నని తోఁచె మాకు నధిప. ౬౦౦

చ॥ మనమొక లెక్కయే! విను మమానుషశక్తి నెసంగు నజ్జగ
జ్జనని చరాచరమ్ములు వెసం బొడి చేసి యొకింతలోన స
ల్పనయినఁ జాలు నీకెటులు పాల్పడు నట్లొనరింపు మింత న
ట్టును నిజ మింక నీమతిపటుత్వము, దైవము, మాయదృష్టముఁ.

వ॥ నావుడు శుంభుండు నిశుంభుదిక్కు మొగంబై.

క॥ మనధూమ్రలోచనుని సైన్యనికాయముతోడ యమపురాతిథి గాఁబె
ల్పనఁ గాళి చేసె నాశం, ఘనినాదం బప్పురంబ గా వించెఁజుమీ.

గీ॥ తృణము వజ్రమ్ము వజ్రమ్ము తృణము బలవి, హీనుఁడు బలాఢ్యుఁ
డిట్టింపు నట్టిఁడగుట, కాలగతి కారణమ్ముగఁ గలుగు నకట,! జ్ఞాను
లకును దుర్జ్ఞేయముల్ కాలగతులు. ౬౦౩

గీ॥ ఎట్టులైనను నయ్యంబ నెనయుటొప్పు, కాక యీనెప మూని
రక్కసులఁ జక్కఁ, జేయవచ్చునో మంచ మేము చేయఁదగునో, యెల్ల
విధముల యోజించి యెఱుఁగఁ జెపుము. ౬౦౪

క॥ కొండికనయ్యును మతి నా, ఖండలగురుసన్నిభుఁడవు కాలోచలదిఁ
గ నీ, మండలము విడిచి పాఱుట, భండనమునకన్న లగ్గ! పరికింపు
తగన్. ౬౦౫

వ॥ ఇట్టియెడ తెగనిసంకటమ్ముల నీకు మిక్కిలిబుద్ధిమంతులు వేరు
చక్కఁగ నొకదిక్కు విచారించి గ్రక్కున నుడువు మనుడు నిశుంభుం
డన్న కిట్లను. ౬౦౬

క॥ మన కేటిపలాయన మేఁ, బవిపనియెద నిపుడ దైత్యబలములతో న
వ్వనజాక్షి గెల్చి తెచ్చెద, ననఘా! దైవంబుకతన ట్టిట్టైనన్. ౬౦౭

వ॥ మన రణమ్మునకు శోకింపక తగుగతి యోజించి యప్పుడు
నీబుద్ధికొలఁది నొనరింపు మనవుడు శుంభుం డియ్యకొనక పలాయనం
బునకన్న భండనంబ వరం బయ్యె నేని. ౬౦౮

క॥ భండనకోవిదుల మహాశ, ద్దండులఁ బంపెదను పెక్కుదళములు వ్రేఁ
గై, గండు మిగిలి కొలువఁగ మన, చండుని ముండునిని నీవు చనఁ
బోకు మొగిన్. ౬౦౯

గీ॥ చండముండులు మిగులఁ బ్రచండు లుద్ధ, విడి నరిగి యత్తలోదరి
నోడిచి తెత్తు, రింత నిక్కము నిఁకఁ బోనేల యుడుగు, మెవఁడు శశ
ముపక్కై కరి నిచ్చునయ్య. ౬౧౦

వ॥ అని శుంభు నరికట్టి చండముండులం గాంచి.

ఆ॥ వె॥ సిగ్గు లేక యొక్క సింగపుఁగొదముపై, నెక్కి యుక్కు మిగిలి యొ
క్కటిగ రణంబొనర్ప నున్న యంబికాసహచరిఁ, గాళిఁ బ్రుంపఁ
జనుఁడు కడఁక మీరు. ౬౧౧

వ॥ పింగళాక్షి యగునవ్వెంగలి కాళి ముంగలనై బభీషికల్ చూపినఁ దలరక చెలరేఁగి తల దఱిగి పిదప నయ్యంబికం గొని వచ్చునది యొడంబడక బెడిదమ్ము లాడినఁ గినుకొని యుఱిగింపుమనవి యని యానతిచ్చినఁ జండముండులును. ౬౧౨

క॥ బడబాగ్ని పిడికిలింతుమొ, పుడమియు నాకసము దెసలు భూధ్రమ్ములు న, జ్జడనిధు లొక్కుమ్మడి న, ట్టడవిం గల్పుదుమొ యనుచు నార్పులు సెలఁగన్. ౬౧౩

వ॥ సైన్యసమేతమ్ముగాఁ గట్టాయితంబై యరిగి ముంగల దేవహితకారిణి యగుజగదంబం గాంచి సామపూర్వకమ్ముగా నిట్లనిరి.

## చండముండాసురుల యుద్ధము.

చ॥ సురవిజయమ్మునన్ బొలుపు శుంభనిశుంభుల బాహుగర్వదుర్భరత నెఱుంగవే! యబల! పైకొన నంచెద వేరకేనియున్
దగవె దురమ్ములో నెదిరి దర్ప మొనర్పఁగ, వెఱ్ఱివొక్క! యి
త్తరణి సహాయుఁగాఁగొని వృథాగతిఁ బోరికి మీఱఁ బోలునే.

క॥ తగుఁ దగ దని మతి చెప్పఁగ, నగుపురుషుం డేని యొక్కఁ డుఁగన యేనిన్, మగువరో! లేరొక్కో! నిను దే, వగణము పురికొల్పు దైవవశ మట్లుండెన్. ౬౧౬

మ॥ వినుమష్టాదశబాహువుల్ గలవు న న్వేధింతురే యోద్ధలం
చును మిత్త్రైక్యకు శుంభునేడ్తుఱకు నీశుండో! సురేంద్రుండో! నీ
ఘనగర్వమ్మును బాహుసంపదయు నీకాండమ్ములు న్నిహిత
మ్మునకు న్బొక్కి వచింతు నాపలుకు లంభోజాక్షి! పాటింపుమా. ౬౧౭

ఉ॥ ఒవనజాక్షి! శుంభుఁ డన నొక్కనిపాటియె యెవ్వఁడేని నై
రావణపుష్కరమ్మును దురమ్మునఁ ద్రుంచుట వింటిమే! వృథా
కావలునై సురల్ తనకు గర్వనివర్తకుఁడై నశుంభుపై
నీ వెడఁగుందనంబు గని నిం బురికొల్పిరి యూసుపెంపునన్. ౬౧౮

క॥ నీ వేమిద్దైననున్ భర, మే వారికి! స్వార్థపరుల కెందునుఁ బరకార్యావేక్షణ ముండునె! యిఁక, నావాక్యము లిచ్చగించి నడువుము పురికిన్.

ఉ॥ సుందరులందు సుందరుఁడు శూరులయందును శూరుఁ డెంతకే
నిందగువాఁడు నేర్పరి మనీషి సమరాగమవేది మావిభుం
డండజవంటివాఁడె! జగదాఢ్యుఁడు నీకుఁ దదీయసంగమా
నందముకన్న వేఱొకటి నాకుఁ గనంబడ దెన్నిభంగులన్. ౬౨౧
క॥ హిత మిచ్చగించి దుఃఖ, స్థితికిం జొరఁబడక నీవశేషజగము లు
న్నతి నేలఁగ మాశుంభుని,బతిగాఁ గొను మింతకన్న భాగ్యము కలదే
ఉ॥ గండున నిట్లు ప్రేలుడు జగత్పరిపూర్తి యజాండమెల్ల యు
న్నిండఁగ నార్చి "యోరి యవినీత! నమస్థితి దెల్పెదేమి! యా
ఖండలమంత్రివే మొ! కడికండలు చేసెదఁ జక్కనిల్వు నీ
చండత వానిముండతయు సంగరరంగమునం గనం బడున్. ౬౨౨
చ॥ హరిహరులం ద్యజించి దితిజాధము శుంభు వరింతునేమి! నా
కొరుఁడు ధవుండె! యీజగము లొక్కట నేలుదు నే ననాదినై
హరిహరు లెంద, రెందఱు సురాసులు, శుంభనిశుంభు లెందఱ, తే
గిరి మునుమున్న నాయెదురఁ, గేలమూర్ఖత మీఁదెఱుంగునే.
క॥ ప్రతియుగమున నీగతిఁ బం,చత భూతమ్ములకుఁ దొడరు సంరక్షింపం
గతి గలద! మీ కిపుడు సం,హృతికాలము వచ్చె యత్న మే లొనరింపన్. ౬౨౪
చ॥ మరణము నిక్క మెట్లయిన మానముఁ గీర్తియు రక్షణీయ తా
శరణము లంచు నన్నుఁజక సంగరరంగమునం దెదుర్పుఁ డి
ప్పరుసున శుంభుఁ డే కొలఁది! బాలిశయుఁగాఁదగునే నిశుంభుఁ! డె
వ్వరితఁడు! మాజి నీలిగి దివమ్మున కేగుఁడు వీరపద్ధతిన్, ౬౨౫
ఉ॥ వచ్చినట్టురక్కసులవారికిఁ బోసుఁడు నాక మేగుఁడు
న్వచ్చతురంగసైన్యముల నడఁచెడి శుంభనిశుంభు లంతలో
వచ్చియెదిర్చి చచ్చి సురవర్త్మమునన్ మిముఁ గూడికొందు రీ
మచ్చికమాటలేల! శరమండలి నింపుఁడు ప్రొద్దు వోయెడిన్. ౬౨౬
చ॥ తొలితొలి నిన్ను నీయనుజలోఁ మడియించి సురారిసంఘుని
స్తులు లయి వచ్చినట్టి యాశుంభనిశుంభుల రక్తబీజు ని

మ్ములఁ గడతేర్చి వ్రేల్మిడిన మూఁడుజగమ్ముల దైత్యు లన్నపే
రోలయక యుండఁ జేయవలె నోపినపట్టునుఁ బోరుఁ డేడ్రైలన్.

వ॥ ఇంక వృథాలాపమ్ము లాడవలవ దని పుఃకొల్పి ప్రేరేపిన
నా చండముండు లఖండచండిము లై. ౬౨౮

శా॥ జ్యాటంకారము దిగ్గజశ్రుతిభిదాసంపాదకంబై నిరా
ఘాటాటోపము మిన్నుముట్ట నెదురై కాలూఁద నయ్యంబ స్వ
ర్వాటీవాసులు మెచ్చ నొత్తె దర మప్పాటన్ రిపుల్ గుండియల్
బీఁటల్ వారి బడల్పడన్ హరియు నాభీలధ్వనిన్ గర్జిలెన్. ౬౨౯

ఉ॥ కాతరభీతిదంబును నకాతరభూతరసోత్తరంగసం
పాతము గాఁగ సంగర మభంగురమై తగెఁ జండచండికా
శాతమహాస్త్రపాతముల సంకులమయ్యె నభోంతరంబు నీ
రీతిగ బీఱువోక యెదిరించిరి రక్కసు లొక్కపెట్టునన్. ౬౩౦

శా॥ అన్యోన్యప్రవిముక్తశస్త్రతతు లన్యోన్యమ్ము ఖండించుచున్
మన్యుప్రేరితులై పెనంగు నెడ సామర్థ్యంబు ముందుం డనా
మాన్యుండై తనయన్న వెన్నడి పరాంబం దొప్పదోఁగించె నవీ
రన్యాయంబు బలే యటంచు సమరారంభాతిసంరంభయై. ౬౩౧

మ॥ కదళీపుష్పవిడంబినేత్రరుచి వక్త్రం బెట్టి గాఁ జేయ నై
రిదవాగ్వ్యాఘ్రకృతియై లలాటమును నిర్భేదించి యావిర్భవిం
చె దయాదూరయు వ్యాఘ్రచర్మధర దుస్తేజస్క నాగాజినా
స్పదయై కాళిక ముండమాల్యధరయై పాశాదికోపేతయై ౬౩౨

వ॥ ఇట్లు ఖట్వాంగధారిణియు నతిభీషణయు శుష్కవాపీస
మోదరయు భ్రుకుటీకుటిలేక్షణయు విస్తారజఘనయు విస్తీర్ణవక్త్రయు
ఖడ్గాదిసంశోభినియునై కాళరాత్ర్యపరావతారమ్మునుం బోని ఘోరరూ
పమ్మున నావిర్భవించి జిహ్వాచాలనమ్మునం బెచ్చుపెరిగి ౬౩౩

ఉ॥ ఓహరిసాహరిం బెనఁగుచున్న సురారులఁ బట్టి బిట్టుపూ
ర్ణాహుతిఁ జేసి వక్త్రమను నగ్నిముఖమ్మున; నందుఁ గొందఱన్
బాహులఁ బిప్పిజేసి యిటుపల్వుర భక్షణఁ జేసి కాళియ
య్యాహవరంగ మొక్కమొగి నాహృతిఁ జేసి పరాక్రమించుచున్

గీ॥ అట్టహాసంబొనర్చి ఘంటాన్వితముల, గజఘటలఁ గేలఁ గొనివక్త్ర
గహ్వరమునఁ, బెట్టికొని పిండిపిండిగా బిట్టునమలు, నుష్ట్ర తురగా
దులకు గతి యొండు గలదె. ౬౩౫

ఉ॥ ఉర్వియునాకసంబు కడియొక్కటికై యిటు లెల్ల సైన్యముం
జర్వణ మాచరింపుడును జండుఁడు ముండుఁడు నీడఁ బోక దు
ర్గర్వమదాంధులై శరపరంపరలన్ బరఁగించి యొఁతయున్
ధూర్వహులై యెదిర్చి రని "దుండగు లింతటివారు లే"రనన్. ౬౩౬

మ॥ ఇటు లక్కాళిక నేసియేసి యొకఁడం "దిగ్గానఁ బో"మ్మంచు బల్
పటువౌ విష్ణునిచక్రమున్ గరమునన్ బాటించి బిట్టార్చి యే
యుటయున్ బాణమొకంటఁ దున్మి హతకాయుం జేసె నచ్చండుఁడు; నం
తట ముండుండు శితాస్త్రముల్ గురిసెఁ దద్దం గాళిపైఁ గేళిమై. ౬౩౭

వ॥ ఇట్లు మూర్ఛితుం డగుసన్నపాటున కోర్వక ముండుండు
దలకడచుటయు. ౬౩౮

ఉ॥ చండిక ముండముక్త శరజాలము లోలిన త్రుంచి వైచి బ్ర
హ్మాండము వ్రయ్య నార్చి యొకయర్ధశిలీముఖ మేసి వాని బల్
గం డడఁగింప మూర్ఛవడి గ్రక్కున వ్రాలెఁ దదంతరమ్మునన్
జండుఁడుం లేచి కాండములఁ జండిమఁ జూపుట మాని యుద్ధతిన్.

మ॥ గద కేలం గొని యొంటిమై నడరి యక్కాళీభుజాగ్రంబు బి
ట్టదరన్ గొట్టిన బాణపాశమున నయ్యంబామహాదేవి మం
త్రిదశన్ వానిని బద్ధుఁ జేసె మరలన్ దా లేచి ముండుండు వా
నిదశన్ సైఁప కెదిర్చి శక్తిఁ గొని వానిం బోలెఁ గట్టం బడెన్.

గీ॥ బద్ధులగు చండముండులఁ బట్టి బిట్టు, దిట్టయై యట్టహాసంబు దీటు
కొనఁగ, నంబకట్టెదుటకు వచ్చి 'యరయుమమ్మ, యాజి యజ్ఞపుఁ
బశువుల నమరరిపుల. ౬౪౧

వ॥ ఇట్లు వృకములం బోలె ననాయాసమ్మునఁ గట్టి తెచ్చిన
సంతసించి వరాంబ యిట్లను. ౬౪౨

క॥ ఇంపలరునీదుశక్తి ని, లింపారులఁ దెచ్చి తింక లీలన్ జంపి
చంపక వేత్కోకభంగి ని, లింపులకున్ మెచ్చొనర్చ లేవె చతురవై.

వ॥ నావుడుం గాళిక యిట్లనుఁ నీదానవపశుద్వితయంబును బ్రసిద్ధం బగుయుద్ధయజ్ఞమ్మున ఖడ్గయూపమ్మునం గట్టియాలభించినచో నయ్యది హింసయయ్యు నహింసాప్రియం బగు వని పల్కుచు. ౬౪౪

క॥ కరమునఁ గరవాలముఁ గొని, యిరువురిశిరములను నఱికి యాశ్వారి
మోదో,ద్ధురత రుధిరమును ద్రావి య,మరవరులఁ మోదవార్ధి
మగ్నులఁ జేసెఁ. ౬౪౫

వ॥ ఇ ట్లతిఘోరంబుగఁ జండముండుల వధియించినకతమున నాయంబికకుఁ జాముండ యనుబిరుదనామంబు పరాంబవలనఁ గలిగె నని చెప్పి వ్యాసుండు మరల ని ట్లనియె ౬౪౬.

ఉ॥ పిమ్మట భిన్నకాయములఁ బెల్లుదొరంగెడిగక్తమై గుబుల్
గ్రమ్మి రణావనిఁ విడిచి కాల్కొలఁదిం జని శుంభుఁ గాంచి' మా
యుమ్మలికంబు దీర్పుము మహోదయ! పెందయ" నంచు గాళికా
స్త్రమ్ములు చండముండులకుఁ జావు ఘటించుట విస్తరించుచుఁ.౬౪౭

వ॥ హతశేషులిట్లనిరి రాజేంద్రా యాహవరంగమ్మున నక్కాళి విక్రమించిన తెఱంగు దలంచుటకును భీతియే తెంచెడి రౌద్రాకారమ్మున నడరి కొందఱ భక్షించియుఁ గొందఱఁ బిడికిలించియు గొందఱఁగాలఁ జమరియు నిట్లు సైన్యంబుల రూపు మాపినఁ దద్రంగస్థలంబు నెత్తురు వఱ్ఱుగా మాంసంబు కర్దమంబుగాఁ గేశమ్ములు నాఁచుగా భగ్నరథచక్రమ్ములుచక్రమ్ములుగాఁ ద్రెళ్లినబాహువులు మత్స్యమ్ములుగా శీర్షంబులు తుంబీఫలమ్ములుగా నొకమహానదిచందమ్మునం బొల్చె. ౬౪౮

ఉ॥ కాళిక చంపఁగా మిగులఁ గాఁ గలరక్కసులం గడంగి యా
భీలరవమ్మొనర్చి యొకపెట్టున సింగము మ్రింగుచున్న దీ
యాలము మాను మయ్యతివ యల్ప యటంచు దలంతువక్కటా!
కాలముచేరు వయ్యె నొకొ! కావలముఁ విడజాల వెమ్మెయిఁ ౬౪౯

క॥ ఏలలనఁ గోరి నీ విపు, డాలమ్మునఁ గులవినాశ మందించెద వా, లో
లాక్షి కాలరూపిణి, గా లోనఁదలంపు మెఱుక గలఁ డగు మధిపా.

గీ॥ జయపరాజయములు దైవసంగతములు, గాన నల్పార్థమునకు నిష్కా
రణముగ, నెల్ల బంధుల సమయింపఁ జెల్లునయ్య, వెనుక ముందును
దెలియుట చనదె యింక ౬౯౧

వ॥ రక్కసులకెల్ల నొక్కకాంతచే మృతి గలుగుటకన్నఁ జిత్రం
బొండెద్ది! లోకపాలుర జయించిన నీబోటి నాబోటి యాహవమ్మునకుఁ
బిలుచుట కెంతకేనియుం జాలక సూచి పోయెడిదే! యదియునుంగాక
మున్ను పుష్కరమ్మున నీవు తపం బొనరించి యమరత్వంబు ప్రార్థించిన
విధాత యీయ నోడ టయ్యు నీవు క్రమ్మఱ దేవమనుష్యసర్పకిన్నరయక్షప్ర
ముఖు లగుపురుషులచే మృతి గలుగకుండ ననుగ్రహింపు మన నన్న
లువ య ట్లొసంగె నగి కారణంబుగ దేవ పెరితన్నై ౬౯౨

క॥ జననావనమగణమ్ముల, నొనరించెడిమాయ సంగరోల్లాసినియై
దనుజులతో నినుఁ బోరి నొనఁ,గనేగు బెంచుట నిజమ్ముగావలె నధిపా.

వ॥ మఱియుఁ ద్రిగుణయుఁ దామసయు సర్వశక్తిసమన్వితయు
సక్షయయు సర్వజ్ఞయు సర్వోదితయు వేదమాతయు గాయత్రియుసం
ధ్యయు సర్వసురాలయయు సగుణయు నిర్గుణయు సిద్ధయు సర్వసిద్ధి
ప్రదయు నవ్యయయు నానందప్రదాయినియు నగుపార్వతి దేవహితా
ర్థినియై నిన్ను నిక్కువంబడఁపఁగ నేతెంచిన దని యెఱింగి జీవింప వల
తేని వైరం బుడిగి పాలివోక శరణంబు గొను మయ్యంబిక కరుణార్ద్ర
యై హతశేషు లగురక్కసులతో నిన్నుఁ జిరాయుష్మంతుఁ గా ననుగ్ర
హింపఁ గలయది నావుడు శుంభుండు క్రోధాకులుండై వీరోచితం బగు
గతి ననుకరించి. ౬౯౩

ఉ॥ మానము మాని ప్రేలకుఁడు మందులగ్రె యని కోపాటించి నా
పై నెనరున్నభంగి నిటు, ప్రాణము తీపగునేని వేగ మీ
మీనెఱిచట్టులకు సుతుల మిత్రులఁ గూడి రసాతలంబుఁ బో
నొనతి యిచ్చెదక వెడలుఁ డాహవభీతులతోడ నే మగుఁ ౬౯౪

చ॥ జయముఁ బరాజయమ్ము మనశక్యమె దైవము కర్త గాక ని
శ్చయముగ బ్రహ్మవిష్ణుగిరిశప్రముఖుల్ తదధీను లన్నచో

బయిఁ బడుమంచిచెడ్డలకుఁ బాల్పడ కొడ్డ వశంబె దీనికిం
త యళుక నన్నుబోటి కొకదర్పమె యెట్లగు నట్ల యయ్యెడిన్. ౬౫౮

క॥ భవితవ్యానుగుణం బగు,వ్యవసాయ మొనర్చుజ్ఞానవంతులు తెల్విన్
దవిలియొకప్పుడుఁ జింతా,వివశులుగాకుండు రేను వెఱతునె మృతికిన్

వ॥ మానవంతు లగువారలు మరణభయమ్మువలనియాత్మధర్మ
పరిత్యాగమ్మున కోహటింతురు. సుఖదుఃఖాయుర్జీవితమరణాదికమ్ము
లెల్లరకును గాలచోదితమ్ములయి యనివార్యమ్ములై పైకొనుచుండు
హరిహర విరించులును దక్కటివేల్పులును దమతమయాయురవ
సానమ్మునం గిట్టువార కాని యుట్టిగట్టికొని యూఁగువారుగారు. ౬౫౯

శా॥ దైవాధీనతఁ జేసి యేను జయమో దైన్యంబొ వేఱొండొ నేఁ
డీవామాత్మికతమ్మునం గొనుదుఁగా కేలింత చింతింప, ని
స్సీ! పేరుల్ గడునవ్వఁ బాఱి యెటులే జీవింతునే! యింతకున్
జావే యెక్కుడు వీరధర్మ; మగునే సంగ్రామభీరుత్వముల్. ౬౬౦

వ॥ అది యట్లుండె విద్వాంసులు దైవంబు మిథ్యయనియు
నుద్యమంబు కర్తవ్యం బనియు దానఁ గార్యసిద్ధి యవశ్యం బగు నని
యుఁ జెప్పుదురు యుక్తియుక్తం బగుకతన నిత్తెఱంగు బుద్ధిమంతు
లకు గ్రాహ్యం బదృష్టంబ బలవంత మ్బనుకాతరులవచనమ్ములు గ్రా
హ్యమ్ము లయ్యెనేని యదృష్టసత్త్వమ్మునకుఁ బ్రమాణం బేమి! యదృశ్యం
బెన్నఁ డేని దృశ్యం బగునే యని వెండియు

గీ॥ లేదదృష్టపదార్థంబు లేశమేని, బుద్ధిమంతులుదుఃఖసముద్రమగ్ను
లైనవారలనూరార్పదీనిఁ గల్పి, తంబుగాఁ జేసిరిదిసిద్ధిదంబుగాదు

వ॥ ఇష్టకారిణియగు *చక్రిసమీపమునను న్నను నుద్యమంబు లే
కున్న నిష్టసిద్ధి గాని తెఱంగున నుద్యమశూన్యులు సిద్ధిమంతులు గాకుం
ట ప్రత్యక్షంబ యని మఱియును. ౬౬౨

క॥ తనబలము నెదిరిబలమును, గని కాలాదిక మెఱింగి కార్య మొన
ర్పన్, మునుకొను సిద్ధి యనుచుఁ దా, ననఁడె బృహస్పతి, ప్రయ
త్న మన్నిట ఘనమా ౬౬౩

---

* చక్రియన పిండినూఱుకొను సాధనము.

వ॥ ప్రయత్నం బొనర్చినను గార్యసిద్ధి గాకుండినచోఁ దన్మూల్య నత యుద్యమంబున నిడుట యుక్తియుక్తంబై యుండు నని కృతనిశ్చయుండై రక్తబీజుం గని నీబలమ్ములతోఁ గట్టాయితంబై సంగరమ్మునకు వెడలు మనుఁడు వాఁ డిట్లను ౬౬౪

ఉ॥ ఏఁ గలుగంగఁ జింత మది నించుకయున్ వల దిష్ట యేగి నీ రాగము చెప్పి యత్తరుణి రా గమకించెదఁ దక్కనేని బెన్ వేగఁ గగు నాజిలోనఁ దలఁచించి జయించి వశన్ బొనర్చి దా నీగతి నీకు నెల్లపుడు సేవ యొనర్పఁగఁ జేయ నేర్చెదన్ ౬౬౫

వ॥ అని కృతనమస్కారుండై యాజ్ఞఁ గొని హస్త్యశ్వరథ సంకులం బగు బలంబు పరివేష్టింప రథారూఢుండై సంగరమ్మునకు వెడలుటయు. ౬౬౬

క॥ దాదాదవ్వుల నంబిక, యాదానవుఁ గాంచి శంఖ మతిభీషణ రావోదారమ్ముగ నొత్తిన, భేదిల్లిరి రిపులు మది దివిజు లలరంగన్ ౬౬౭

రక్తబీజయుద్ధము

వ॥ అంత నద్దరరవంబునకు దలరక రక్తబీజుండు సమీపమ్మున కరిగి మృదుభాషణమ్ముల నిట్లను ౬౬౮

గీ॥ శంఖనాదమ్ములకు నేను జంక ధూమ్ర, లోచనుఁడఁ గాను వినుము నీపేఁచ మడఁతు, నరయవాకొ నన్ను రక్తబీజాభిధానుఁ, బఱచు వారలపంక్తి నేఁ బడితినొక్క. ౬౬౯

వ॥ మున్ను నీబిభీషికలకు డొంకి కాందిశీకు లగురక్కసులలో నొక్కనిఁగా నన్ను విచారింపక సుస్థిరత్వమ్మున రణస్థలమ్మున నిలువు మని వెండియు. ౬౭౦

గీ॥ వృద్ధసేవ యొనర్చితి విద్యలెల్ల, నేర్చితివటంచు వింటి నీనేర్పు చూత, మొక్కమాట వచించెద నువిద! దాని, తెలఁ గెఱుంగుము యది కదా తెలివికలిమి ౬౭౧

క॥ ఋతమై పథ్యంబై సా, హితి గలమానినులకెల్ల హిత మగు నని నేఁ బ్రతినం జేసి వచించెద, మతి గలవేని విను మిన్నిమాటలు కలవే ౬౭౨

గీ॥ నవరసమ్ముల విద్వజ్జనములమెచ్చు, గనురసమ్ముల వినుము శృంగా
రశాంత, రసము; లందును శృంగార మనము మగుట, రసములకు
నెల్ల నయ్యాది రాజుసుమ్ము. ౬౭౩
మ॥ సిరితో విష్ణువు గౌరితో శివుఁడు జేజేపెద్ద యవ్వాణితో
సురనాథుండు పులోమజాతరుణితో సూనాంకు సేవింతు్రి సుం
దరి! వృక్షంబు లతన్ గపోతిని గపోతంబున్ మృగం బమ్మృగిన్
గర మాసించు జరాచరమ్ములకు శృంగారాప్తి నేఁ డబ్బనే ౬౭౪
గీ॥ ఎవ రసంప్రాప్తభోగులై దివులు దవులు,వారలో వారలే దైవవంచి
తులు ము, తీశ్వరులు; సంసరణసుఖ మెఱుఁగ లేక, వంచకులవంచన
లకు లోఁ, బడిననరులు. ౬౭౫
క॥ మనమునఁ గామక్రోధము, లనయము గిరిగొనుచునుండ నంగజుఁ
డును లోఁ,గొని యేచుచుండ శాంతం, బును వైరాగ్యమును జ్ఞాన
మును గలుగునొకో. ౬౭౬

వ॥ కావున నీయౌవన సంభావనకై శుంభునొండె నిశుంభునొం
డెఁ బతిగా వరించి సమస్తసుఖమ్ము లనుభవింపు మని బోధించు రక్త
బీజుప్రలాపమ్ములకు నంబికయుఁ గాళికయు నగిరి పదంపడి దేవి హా
సం బొనరించి మేఘగంభీర భాషణంబుల నిట్లను. ౬౭౭
క॥ మును చెప్పితి రూపాదిక,ము నాకుందుల్యుఁడేని మోహించెద నం
చును మాటిమాటి కీగతిఁ,జను నే వెడమాట లాడఁ జతురుని పగిదిన్
వ॥ నాప్రతిజ్ఞ యిట్టిది యని శుంభనిశుంభులకడ కేగి చెప్పు
మొండె, నొండె సంగరం బొనరించి నన్నుం జయించి విధిచోదితంబు
గ వివాహం బొనరింపుము. ౬౭౮
క॥ భయ మొదవెనేని నిప్పుడ, రయముగఁ జని పతికిఁ జెప్పి రక్కసులె
ల్లన్, బయలు వెడలి వెంబడి రాఁ, బ మనం బొనరించు టొప్పుఁ
బాతాళమ్మున్. ౬౮౦

వ॥ అనవుఁడు రక్తబీజుండు క్రోధతామ్రాక్షుండై.
శా॥ ఎట్టెట్టూ యని యార్చి యంపగములెన్నేనిం బ్రయోగించి బల
ధట్టుండై మృగరాజు నొంచినఁ గనతామ్రాక్షియై దేవి పి

న్గట్టంబోనితదస్త్రశస్త్రచయముం గూల్చెన్ శితాస్త్రమ్ములన్
రెట్టింపం దగునట్లు రక్కసుని మర్దించెన్ వెసన్ మూర్ఛిలన్.

వ॥ ఇట్లు రక్తబీజుండు రథమ్ముపయిన్ బడిన దైత్యసైన్యమ్ములు హాహాకారంబు విస్తరించె. ౬౮౨

క॥ బుంభారవమున సేన ల, హుంభావం బుడుగుటెఱిఁగి యసురులఁ గని
యా,శుంభుండు దైత్యులను సం, రంభమ్మునఁ బనిచెఁ బోండు రణ
మున కనుచున్. ౬౮౩

వ॥ ఇట్లు కాంభోజకాలకేయాదిదానవప్రపంచమ్ము నొక్కటనెస కొల్పిన భీషణాకార భాషణాడంబరమ్ముల నుద్ధవిడి నద్దనుజులు రణాభిముఖులగుటయు నంతంత నేతెంచువారలం గనికాళి ఘంటానాదంబొనరించెఁ బరాంబికయు శంఖంబు పూరించి జ్యాటంకారం బొనరించి యకాళి కుక్కెక్కింప మింటికి మంటికిఁ దానయై యాపె ప్రబలి సింహారావం బొసర్చిన నంత సింగంబును గర్జిల్లె ౬౮౪

ఉ॥ ఆనినదమ్ములన్ విని మహానినదమ్ములు నింగిముట్ట న
ద్దానవులెల్ల శస్త్రములతండములన్ బరఁగించి ముంపఁ బో
రీనియతిం దనర్చె నని యెన్న ననర్హము గా నిలింపు లం
బానుచరత్వ మందఁ దమయందలిశక్తుల నంపి రంపినన్. ౬౮౫

గీ॥ బ్రహ్మ మొదలుగలట్టిదేవతలశక్తు,లాత్మ దేవోచితమ్ముగ నస్త్రశస్త్ర
భూషణంబులు ధరియించి పోరొనర్ప, నరుగుదెంచిరి జగదంబ నను
సరించి. ౬౮౬

వ॥ అట్టియెడ వరటారూఢయు శంఖచక్రగదాధరయుఁ బీతాంబరభూషితయుఁ బద్మహస్తయు నై వైష్ణవియు నర్ధచంద్రధరయు నహివలయయు శక్తిహస్తయు శిఖివాహనయు నై కౌమారియు శ్వేతగజవాహనయు వజ్రహస్తయు నై యింద్రాణియుఁ బ్రేతపీఠాసనయు సూకరాకారయు నై వారాహియు నృసింహసదృశాకారిణియై నారసింహియు దండహస్తయు భయప్రదయు మహిషారూఢయు నై యామ్యయు వారుణియుఁ గౌబేరియు లోనుగాఁ గలయనేకశక్తులు స్వస్వబలసహితమ్ముగ నరుదెంచిన దేవి యత్యానందభరిత యయ్యె ౬౮౭

శా॥ తత్తచ్ఛక్తిపరీతుఁడై హరుఁడు తత్సంగాద్రిమరంగమ్ము ద
ళ్లోత్కత్తన్నిల్చి పరాంబఁ గాంచి యను “లోకోద్రేకసంపాదనా
యత్తుల్ శుంభనిశుంభు లాదిగలదైత్యానీకముం దున్ముఫు మీా
సత్తుల్ తోడుగ నెల్లలోకములకున్ సంతోష మెంతేఁదగన్ ౬౮౮

సీ॥ యజ్ఞభాగమ్ముల నమరులు మునుపోలె గతభీతులైపొందఁ గాంతు
గాక, స్థావరమ్ములకును జంగమమ్ములకును సంతోషమెంతే నెసం
గుఁ గాక, ఉడుగక వెడలెడియుత్పాతములు నీతిబాధలు నేటితోఁ
బాయుఁగాక, యయ్యయికాలమ్ములం దనుగుణముగ మంచి మేఘ
ములు వర్షించుఁగాక. ౬౮౯

గీ॥ కృషి బహుఫలప్రదం బయి కెరలుఁగాక, గోద్విజాంగన లభ
యమ్ము గొందురుగాక, పిదప శత్రులు తమతము వెడలుచోట్ల
కేగ జగదంబ నీయాజ్ఞ మెఱఁగుఁగాక ౬౯౦

వ॥ అని శంకరుండు పలియించునాలోనన చండికాశరీరమ్ము
నుండి ప్రచండయు నద్భుతశక్తియు శివాశతనినాదినియు భీషణాకృ
ఘోరరూపయు నగునొకశక్తి యుద్భవించి సస్మితాననయై శంక
రుం గాంచి యిట్లనియె. ౬౯౧

ఆ॥ వె॥ దేవదేవ! యీావు దితిజులకడ కేగి దూతవై పచింపు తొలఁగి
యమరుర, పదము వీడి యిపుడు పాతాళమున కరు, గుంచు బ్రి
తుకుచెలువు గోర్కియేని. ౬౯౨

వ॥ పిదప సురేంద్రుండు తనపదమ్ము నందికొని సుఖం బుండ
నమరులెల్ల యజ్ఞభాగమ్ము లనుభవించువారు. ౬౯౩

కం॥ మరణంబు గోర్కియేని బ, వరమునకుం బలము గొలువ వచ్చునది
పరం,పరలై మానక్కలుపిశి,తరనాస్వాదనము చేసి తనియనొక్కర్తున్

వ॥ ఇట్లు మద్వచనమ్ములుగా నుడువు మనుఁడు హరుఁడును
శూలపాణి యఁగుచు శుంభనిశుంభులకడ కరిగి యిట్లనియె. ౬౯౪

ఉ॥ ఏను బురాంతకుండ జగదీశ్వరి మీాకడ కంపె నాపె మీా
దానవులం దనుగ్రహముదాల్చి పచించినచొప్పు చెప్పెదన్

మానము ప్రాణము న్నిలుప మావస మేని దివంబు వీడి మా
మీ నెఱిచుట్టలన్ గలిసి మేకొనుఁ డేగి రసాతలమ్మునన్. ౬౯౫

క॥ కాదేనిఁ బోరితమునకు, రాఁ దగు నని చెప్పె నను మ రక్కసులు
మహో, న్మాదులు మీఁదునెఱుంగక, యాదేవి నెదుర్చ వచ్చి రని
మొనకు వడిన్. ౬౯౬

వ॥ రక్కసులకడకు శివు నంపినకతననయ్యంబ శివదూతి నాఁ
బరఁగె ని ట్లుక్క మిగిలి రక్కసు లొక్కుమ్మడి సంగ్రామరంగమ్మునకుఁ
దెగి నిశితమ్ము లగు శరశతమ్ములు వఱపిన నక్కాళిక శూలపాతమ్ముల
నేలం గలిపియు బ్రహ్మాణి కమండలుజలసేకమ్మున రూపు మాపియు
వైష్ణవి చక్రగదాపాతమ్ముల నుగ్గు చేసియు మాహేశ్వరి శూల
మ్మునఁ దూలించియు నైంద్రి వజ్రప్రహారమ్మునఁ గసిమసంగియు వారా
హి తుండఘాతమ్ములఁ జండియు నాగసింహి నఖనికరమ్ముల వ్రచ్చియుఁ
బరాక్రమించు నెడ నాశివదూతి బవరమ్మునకుం దవిలి యట్టహాసం బొన
రించి భంజించు దానవులంబట్టి కాళికయు జాముండయు భక్షించు చుండఁ
దద్బలార్ణవమ్మున నతిఘోరం బగుబుంభారవమ్ము సంభూతం బయ్యెఁ
దదారవంబు విని రక్తబీజుండు తక్కటిదానవులం గలసి సంగరమ్మున
కభిముఖుండై జ్యాటంకారం బొనర్చెనని వెండియు. ౬౯౭

గీ॥ రక్తబిందువు లెన్ని యారక్కసుని శరీరమునుండి వెడలు నారీతి
నంఖ్యుద్భవింతురు రక్కసు లొక్కమొగిన, టంచు వర మిచ్చె
వానికి నభవుఁ డధిప. ౬౯౮

క॥ తాదృశవరదానాయా,తోదారబలంబు కలిమి నుక్కు మిగిలి మాం
సాదనుఁడు వేగమునఁ గా,శీదేవులఁ గవిసె వీర్యలీల చెలంగన్,

మ॥ గెరటామంతునిపై జగద్విలయభంగిన్ బేర్చునవైష్ణవిం
బరశక్తిం గని దైత్యుఁ డల్కమెయిఁ దామ్రింబైననేత్రద్వయిన్
బొరిఁ జూపట్టు కృశానుకీలలు జగమ్ముల్ మండఁగాఁ జేయురీ
తిరవుల్సన్ బొలుపారునొక్కపటుశక్తిం బైఁ బ్రయోగించినన్.

క॥ శక్తి[illegible]ు నొకగద గొని యా, శక్తిం దునుమాడి మఱియుఁ జక్ర
ము గొని యా,నక్తంచరుపై విసరిన, రక్తమయశరీరుఁ జేసె రక్కసు
నదియున్ ౨౦౧

వ॥ ఇట్లు చక్రాభిహతం బగుతదీయ శరీరమ్మునుండి గిరిశిఖరమ్ము నుండి సెలగొ ఱులవడువునవల్ల కాలువలు తండోపతండమ్ములై వెడలినక తమున ననేకరక్తబీజులుద్భవించి యెక్కుపెట్టదేవిం బొదువుడు నైంద్రి వజ్రప్రయోగమ్మునను బ్రహ్మాణి బ్రహ్మదండంబునను మాహేశ్వరి త్రిశూలంబునను నారసింహి నఖాఘాతమ్ములను వారాహి తుండఘాత మునను గౌమారి శక్తిప్రయోగమ్మునను నద్దానవులఁ దరమినఁ దదాయుధాఘాతజనితరక్తబిందుపాతమ్మునంజేసి రక్కసులు వేనవే లావిర్భవించి పిఱుసనక పోరిన నప్పోరు ఘోరంబై దివి వైమానికు లగుసుర లకు ఖేదంబు నొనఁగూర్ప వార లిట్లు వితర్కించిరి. ౨౦౨

క॥ ఇది యేమి వింత! నూఱ్ఱుకోట్లఁ దితిదైత్యులు వొడమి రకట! లావున
వీరిం, బొదువుట కష్టం బే వెఱవు దలంచునో దేవి యేమి పోలునో
చేయున్. ౨౦౩

క॥ అని కిది సమయం బని శుంభనిశుంభులు గూడ వచ్చి మార్కొం
దురు వారును బలియు రనుచుఁ జింతామనస్కులయి భీతి వడి రమ
ర్త్యులు పెలుచన్. ౨౦౪

వ॥ దేవియు సంగరరంగం బంతయు రక్తబీజమయం బగుట యెఱింగి కాళికం బిలిచి యిట్లనియె. ౨౦౫

ఉ॥ మార్తుఱ నెల్ల రక్కఁ బిలుకుమార్చు నుపాయము చూడు మిట్టు లీ
ధూర్తులు నెత్తు రుర్విఁ బడఁ దోరముగా జనియించుచుండ్రు నీ
నోర్వగ విచ్చి రక్త మదనుం గని వ్రేల్మిడిఁ ద్రావు మేను ని
మ్మార్తుఱ నింతలోనఁ బరిమార్చెద నుగ్రరణాంతరమ్మునన్. ౨౦౬

క॥ ఇదియ యుపాయం బీరీతి దనుజులన్ గసిమసంగి దేవేంద్రుని న
య్యదితిజులం బ్రోచిమదిం బదిలముగాఁ జేసిసుఖముఁబడయుట తగదే.

వ॥ అని యానతిచ్చిన నక్కాళికయు నట్ల వదనంబు తెఱచి రుధిరమ్మొక్కచుక్కైన నేలం బడనీక త్రావుచున్నంత నంబికయుఁ దదాపాతజాతు లగుకృత్రిమరక్తబీజుల నందఱ నొక్కనిముసమ్మునఁ జక్కడంచి

మ॥ అసిచేతంగొని "రక్తబీజ! నిలురా" యంచుఁ బలప్రాభవం
బు సురల్ సన్నుతిచేయుచుండ రుధిరంపుం బిందు వొండైనఁ ద
ద్రిసపైనిఁ బడకుండఁ గాళికయుఁ దత్పార్శ్వమ్మునం దుండి త్రా
వ సురారీశ్వరుకంఠముం దునిమె గంభాస్త్రంభ మట్టాల్ వడిఁ.

వ॥ హతశేషు లగురక్కసులొక్క మొగి రణాంగణంబు విడిచి శుంభువాలికిం జని దేవా రక్తబీజుం డక్కాంతచే నిహతుం డయ్యె దదీయం బగుశోణితం బెల్లఁ దత్సహచారిణి చాముండ యనునది త్రావె నింత యుక్కజంపుఁబరాక్రమంబు గలకామిని నెయ్యెడం గాన మింత యేల తదీయవాహనం బగుసింగంబును ననేకులరక్కసుల నుక్కడంచె నింక దేవర ప్రమాణం బని చెప్పి మఱియు నిట్లనిరి. ౨౦౯

ఉ॥ కొందఱు కాంత లామెకు సఖుల్ రణసీమ సహాయు లైరి వా
రందఱు లావుఁ జేవ గలయట్టిరు చక్కనివారు వార గె
ల్వం దర మౌనె! యోదనుజవల్లభ! యంతటిరక్తబీజుచా
వుందలపోయఁ గొందలము వొందదె నెమ్మది నేరికేనియుఁ. ౨౧౦

ఉ॥ ఆలము మాని పౌరుషము లాయుము కిప్పనఁ జేసి మీఁదఁబా
తాళము సంకఁ బోవు టుచితం బని తోఁచెడి మాకుఁ జూడ న
బ్బాలికరూపుఁ గన్గొనఁగఁ బ్రాకృతమాత్రము గాము దోఁచు దే
వాళినిఁ బ్రోవ మాయ యిటు లాకృతి దాలిచె రాక్షసాధిపా

చ॥ అనుమొనవారిపల్కులు సురారికు లేశ్వరుఁ డాలకించి చ
య్యనఁ గనుదోయి కెంపు జిగి యానన మంత యుఁ బర్వఁ జేసి వె
చ్చ నిగుడఁ బల్కు భీతిలి రసాతల మేగిన నేగుఁ డీరు కా
మినికిఁ దలంకి యేఁ జనిన మీఁద యశంబు నశింపకుండునే. ౨౧౨

గీ॥ దేవనాయకు నోడించి దేవలోక, మేన పాలించినాఁడ నీమేనితోడ
నొక్క కాంతకు రణమున నోహటించి, పాఱి పోదు నె యింతటిబ్రి
తుకు బ్రతికి. ౨౦౩

ఉ॥ నామబహిర్గతాసువులు నాయెడ భక్తి గలారు రక్తబీ
జాదులు నానిమిత్త మొకయంగనచేత రణావనిన్ బలం
బేది గతాసు లైరయది యెంచక యయ్యబలన్ జయింపఁగా
రా దని భీతిమైఁ జెనఁటిప్రాణము డాఁచిన నుర్వి మెచ్చునే ౨౦౪

మ॥ జననం బందినవారి కేరి కయినం జావున్న దెప్పాటఁ బో
యిన రా నున్నది రాక తీరదు భయం బేలా వివేకంబు క
ల్గిన వానిన్ బెగడొందఁ జేయుఁ'; దగుభంగిన్ దెచ్చుకొన్నట్టికీ
ర్తినిఁ బ్రాణానకు జంకి వ్యర్థముగ వార్ధిం గల్పఁ గా వచ్చునే

చ॥ బవరమునన్ జయమ్ము లిరువాఁగునకున్ గలుగంగఁ బోవు నే
డివి భువియున్ బలమ్మున నెదిర్చి జయమ్మును గొన్ననాఁడు రెం
డవయెడవారునుం జయము నందిరె! కాన మనుష్యయత్నసా
ధ్యవిధి యొనర్పఁ గావలయు నావల దైవము చేయుచేఁతకున్ ౨౦౬

గీ॥ అని నిశుంభునివంకఁ గన్గొనుచుఁ బలికె, నీవు సేనానివై వెంట నేగు
దెమ్ము, సురనికాయము మనములు క్షోభమంద, నిపుడ యానాతి
మిన్న జయించి తెత్తు ౨౦౭

వ॥ అని విక్రమించుచున్నయన్నం గని యనుజుండిం తేల
గడెలో నే నావనితన్ జయించి తెచ్చెద ననుమానమ్ము విడిచి సుఖమ్ము
లందు మని మోడియు ౨౦౮

గీ॥ సకలజగముల నొకసారి జయముగొన్న, మద్భుజాదండబల మేడ
మార్దవంపు, ముద్దు యగుముద్దరాలితో మొనసి పోరు, చేయు టేడ
గటా! యెంత చేసె నజుఁడు ౨౦౯

ఆ॥ వె॥ ఇట్టినీచకృతికి నేనుండ దేవర, గమన మనుచితంబు గడియ
లోన, మానినిని జయించి మగిడి వచ్చెద నన్నుఁ, బనుపు మయ్య
పెక్కుబాసలేల. ౨౧౦

క॥ అనుచుఁగృతనిశ్చయుండై, యనికిం గాల్దవ్వుచున్న యనుజుని
గని నె, మ్మనమున ననుమానించుచుఁ, జయ మని సెల విచ్చె దను
జచంద్రుఁడు పేర్మిన్ ౨౨౧

## నిశుంభయుద్ధము.

వ॥ నిశుంభుండు జయం బొందెడె మరణంబొందెడెఁ గాని మ్మని
సేనాసమేతమ్ముగా నయ్యంబికం జుట్టుముట్టుడు శుంభుండు సహోదర
సంగరసమాలోకనకుతూహలమ్మునం దనబలమ్ములతోడ వెనువెంటం జని
యంతంతఁ జూచుచుండె నట్లు నిశుంభుం డయ్యంబికం గదిసి శార్ఙ్గమ్ము గు
చాపమ్మున నారింబూరించి ప్రళయకాలకాలాంబుదమ్ము వడువున శరా
సారమ్ములు గురిసె నంత. ౨౨౨

క॥ దేవియుఁ గాళినిఁ గని యీ, దేవారులమహాత్మ్య మింత దెప్పర మగు
నే, చావునకుఁ దలఁకరు జయా, శావలమానాంతరంగసంభ్రము
లగుచున్.

క॥ ఆశాపాశముకన్నను, బాశంబు జగానఁ గలదె బలియురు తనవా,
రాశమనపురికిఁ జనిన జ,యాశాభూతంబు వదల దారా! వీరిన్

వ॥ అని ప్రశంసించుచుఁ గాలమ్ము సమీపించిన వారు యుక్తా
యుక్తమ్ము లెఱుంగుదు రే యని శరాసనంబు నారించి నిశితంబు లగు
శరమ్ములుదొడిగి యన్నిశుంభు మేనెల్లం గప్పిన నప్పిశితాశనుండును బది
యాఱువాఁడితూపుల నమ్మానవతిలలాటంబు గాఁడ నేసె నిట్లుపరస్పరం
బును సమాలోకమానాలోకభీకరం బగుసంగరంబు కరంబు ప్రవర్తిల్లు
చుండఁ దద్వాహనం బగుసింగంబును దనయోపినకొలఁదిఁ గేసరమ్ముల
విదుర్చుచు నఖాఘాతమ్ముల గుచ్చియు దంతమ్ములఁ గఱచియు సైన్య
సాగరమ్ము నల్లకల్లోలంబుగా బిలుకుమార్చె. ౨౨౬

క॥ శుంభుండును దేవిసం,రంభము గని యోర్వలేక రణభూమికి నై,
న్యాంభోధి గొలువవచ్చె ని,శుంభునకుం దోడు వడిమె శుంభల్లీలన్

వ॥ ఇట్లువచ్చి

సీ॥ రౌద్రిరసమ్మును బ్రథమరసమ్మును నిరుదెసఁ గాన్పింపఁ గరుణ యొ
క్క, వైపున నలు కొక్కవంకను దైవారఁ జూడ్కులు కనుదోయి
సొగసు దెలుప, జగదతీతంబైనసౌందర్యగరిమఁ గొవ్విమ్మించుచాడ్పున
మిఱుమిట్లు గొలుప, బవరంబు సేయునప్పరశక్తిఁ గన్గొని విస్మయ
మ్మున నాపెవిధము నెల్లఁ, తే॥ గీ॥ జూచుచును మిన్నకుండనాసుదతి
మోము,నందుఁజిఱునవ్వు వొలయ దైత్యద్వయంబు, గాంచిపామరు
లార! నిక్కముగ నెచటి, కేనియేగుఁడు జయకాంక్ష లింకవిడుఁడు
క॥ అభయం బిచ్చెద; గాదే,ని భయము విడనాడి యీయనిన్ బ్రాణ
ము వ్రాసి భటస్వర్గముఁ గైకొనుఁ, డుభయులు నన శుంభుఁడల్క
యుదయించి వెనన్. 228
మ॥ కని ఖడ్గంబున సింహశీర్షమును మొక్కల్ వోవఁగా నేయఁ ద
ద్ఘనపాతంబు సహింప కద్ది నఖపాతచ్ఛిన్నకాయుం బొన
ర్చిన నాలో గదఁ బూని దేవియును గాసిం జెందఁ గా నేసె దై
త్యుని బాహాంతరమందు, మింట సుర లోహో యంచు నగ్గింపఁగన్
వ॥ అంతం బోక బాహుమూలమ్మును ఖడ్గతాడితమ్ము చేసి య
య్యంబ విజృంభించిన.
క॥ వ్రేటునడి వాఁడు వేదన, నూటాడక మాటు పలిచి యొకబాణము
నన్, గాటముగ నేసెఁ బవిలి ల,లాటము పాలాశసుమవిలాసము
దాల్పన్. 230
వ॥ పిదప నయ్యంబిక నిశుంభవధారంభసంరంభయై పునఃపునః
పానంబునం బొదలి ఘంటానాదం బొనర్చుచు నెదిర్చె నిట్లు ఘోరం
బుగ సంగరంబు చెల్లు నంత. 231
క॥ కుక్క లొకపెట్టఁ గూసెన్, నక్క లఱచెఁ గాకి గ్రద్ద నాఁ జనుప
క్కుల్, దిక్కు లదురెఁ బఱ తెంచెన్, రక్కసులయొడలిపలము గ
రంబు భుజింపన్. 232
వ॥ అంత నిశుంభుండు దైత్యమారణంబునకు సైఁపక గదం గొ
ని భీషణాకారమ్మున నడరి హరింగొట్టి యట్టహాసం బొనరించి యయ్యం
బం దాడించిన. 233

ఉ॥ ఆపెయు వల్గితభ్రుకుటియై మొగమంతయు జేవురింప దై
త్యాపశదా! చలింపకు మటంచుఁ గరాళతరాసి పూని య
ప్పాపునికంధరంబు తెగవ్రైచెఁ దటాలున, మింటిపైఁ దదీ
చూపరు లైనదైవతనికాయము శోకముతోడ వెఱ్ఱిల్లిడెన్. ౨౩౪

ఉ॥ నెత్తురు కాల్వలై పరఁగె నేఁగి వియచ్చరసంచయంబు పూ
ల్వొత్తిరి సోఁకుమూఁకలు నవోనవ యంచును గాల్కొలంది ప
ర్వెత్తిరి కొంద ఱందు బలహీనతఁ బాఱుమొన న్మరల్చుచున్
రిత్తకు రిత్త సేయురజనీచరవల్లభుఁ గాంచి యీసునన్. ౨౩౫

క॥ దేవా నీయనుజన్ముని, చా వాలోకింతె మెట్టచాడ్పునఁ బడె గృ, ధ్రా
వళి మాంసముఁ బొడుచఁగ, నేవారిఁక ననికిఁ గడఁగి యిటు కా
రక్షో. ౨౩౬

క॥ అనిలోన నీకు జయ మ్మబ్బ ననుట గడు సందియంబు బుధకార్య
ము సే,యను ఎచ్చినమాయయ కా,మిని గా దది నిజము చావమికి
మనతరమే. ౨౩౭

క॥ కలకాల మొక్కవిధమున, నిలఁ గాలము చనునె తనక హితముగ
నొకచో,బలవంతుని దుర్బలు దు,గ్బలుసిన్ బలవంతుఁ జేయు రా
క్షసనాథా. ౨౩౮

క॥ ఇంద్రాదినిర్జరులును ను,పేంద్రుఁడుశంభుఁడు విరించి యినుఁడు జ
ముండున్, జంద్రుఁడు మొదలగువా రీ,సంద్రము కాలమ్ము దాఁటఁ
జాలరు తలఁపన్. ౨౩౯

చ॥ మును పృథివీశు లందఱు సమున్నతిమై నరివెట్ట సర్వమే
దినియునిరంకుశం బగుగతిన్ బరిపాలన చేసినట్టిపే
వని నొకకాంత కోడుదె! కటా!యిది కాలమురీతి గాక; త
క్కిన వొనరింపఁ జాలునొకో! కీడును మేలును బ్రాణికోటికిన్. ౨౪౦

క॥ కావునఁ బాతాళమునకుఁ, బోవుద మిప్పటికి; బ్రతుకఁ బోలదె! రాజ్యం
బేవారికి శాశ్వతమగు, నే! విధిచోదితము గడవ నేర్తురె యెరున్.

క॥ అను సేనానులపల్కులు, విని దైత్యవిభుండు కోపవివులీకృతలో,చనుఁ
డగుచుఁ గటములదరఁగ, నసలజ్వాలాకరాళ మగుగతి దోఁపన్

చ॥ చెఱ్ఱు లవియుంగ నిర్భయతఁజెన్నఁటిపల్కులు పల్కువారె! యీ
రవమున జాల్ములార! యని; భ్రాతృసుహృద్గణమంత్రిరాజబాం
ధవతతి నొక్కయోఁడువి మదమ్మెయిం దెగటార్పఁ జూచి యే
బవరము మాని యీకటికిప్రాణము దాఁచికొనంగ నవ్వరే. ౨౪౩

వ॥ శుభాశుభమ్ములు చక్రనేమిక్రమ్మునం దిరుగు నీసంసారమ్మున భవితవ్యాభవితవ్యమ్ములకుఁ దజ్ఞులు చింతింపరు పర్జన్యం డప్పటప్పట యోగ్యకాలం బగు శ్రావణమ్మునఁగురియక తదితరం బగుమార్గశీర్షపౌషమాసమ్ములం గురియుట గనుఁగొన్నఁగాలం బెద్దానికిని గారణంబు గామి తెల్లం బగు దైవనిర్మితం బగుగతికెన్నండు నన్యథాత్వమ్ము గలుగ దని మఱియును. ౨౪౪

గీ॥ జగములెల్ల జయించి యశంబు గొన్న, శూరవర్యులు రక్తబీజుఁడు
నిశుంభుఁ, డోహటించిరి రణమున నొక్కయబల,కకట! దైవము కార
ణ మనుట తగదె. ౨౪౫

వ॥ పరార్థద్వయసమ్మితం బగుకాలంబు సంప్రాప్తం బగుడు విరించియుఁ దద్ద్విగుణితం బగుకాలమ్మునకు హరియుఁ దద్ద్విగుణిత మగుకాలమ్మునకు శంకరుండును నశింతురు బ్రహ్మకొక్కదివసం బగు నంతకుఁ బదునాల్గురింద్రులు చెల్లుదురు సూర్యచంద్రమహీమహీధరసముద్రాదిసకలచరాచరములకును దైవనిర్మితం బగునాశంబు తప్పదు కావున మృతికిఁ జింతింపక రణమ్మునకుం బోదుఁగాకేమి విధిచోదితంబై జయంబైన నయ్యెడి నని తే రాయితంబు చేయించి చతురంగబలమ్ములు పరివేష్టింపం జని. ౨౪౬

సీ॥ జగదతీతం బగుసౌందర్య మొప్పార నఖిలభూషణభూషితాంగియ
గుచు, దివినుండి ముదమున దేవతల్ మందారకుసుమవర్షమ్ములు
గురియుచుండ, కిన్నరీబృందంబు కిన్నెరల్ మీటుచుఁ జిన్నారిగాన
ముల్ సేయుచుండ, శంఖనినాదంబు సల్పుచు ఘంట వాయించుచు
సింగార మెసకమెసఁగ॥గీ॥ సింహవాహనయై యున్న చెలువచెలువ

మారఁ గన్గొని దైత్యుండుమారబాణ, తాడితాంతరుఁడగుచుయు
ద్ధప్రసక్తి, తిగిచి మనమున నిట్లు చింతింపఁ దొడఁగె. ౨౮౭

కం॥ ఒయ్యారం బయ్యారే,! తియ్యందన మౌర! రూపు తేట బళీ! యీ,
యొయ్యారి పంచబాణుని, కయ్యానకుఁ గాక పోరఁగాఁ దగి
నదియే. ౨౮౮

ఉ॥ చిక్కనిచన్నదోయియెడఁ జీమకుఁదూఱఁగ రాదు మేనినుం
జక్కనిజవ్వనంపురుచి చంచలకుం బగుపెచ్చు వచ్చు న
మక్క గదే మనోభవునిమానినికన్నను జక్క దీని నా
యక్కునఁ జేర్చుకోలున కుపాయము సేయుదు నేయుదేనియుక్ ౨౮౯

వ॥ మంత్రాదిప్రభావమ్ములు సర్వమంత్రస్వరూపిణి యగునీజగన్మో
హినియందువిఫలమ్ములు సామదానభేదమ్ములు నమ్ములట్లు గాదేని. ౨౯౦

ఆ॥ వెలఁదిచేతఁ జచ్చె విశ్వైకవీరుండ, వితతకీర్తి శుంభుఁ డతులుఁ
డనుచు, గేలి సేయు కుండునే! లోక మకట! దండమున మనముఁ
జొన్పిన నిది నిజము. ౨౯౧

వ॥ తన కెన యగుప్రౌఢవరు నెదిరించి చచ్చియుఁ బుణ్యలో
కమ్ముదెస కరుగుదు రని పెద్దలు వచింప వింటిమి గాని యబలాకర్తృ
కం బగుమరణం బుత్తమలోకావహంబు గా నేరదు వేయేల యస్మ
త్కులనాశమ్మున కివ్వెలఁది యే తెంచె ననియెఱుంగుదు నైనను మరణంబ
యుత్తమంబు కానిపలాయనంబు కర్తవ్యంబు గా దని నిశ్చయించుకొ
ని యమ్మేటి యద్దేవి కభిముఖమ్ముగ నరిగి యి ట్లనియె. ౨౯౨

కం॥ అని సేయుఁగ మది యే నో,ననభోడి! గడంగు పోరునాతిశేఁ దగునా!
యనియును నీయత్నము విత, యనియును మదిఁ గొంకు చుంటి
నంతియ తరుణీ. ౨౯౩

సీ॥ కనుబొమల్ విల్లు లోచనములె శరములు హావభావాదులె యా
యుధములు, సరసచక్యంబు విచక్షణుఁ డగుపురుషుండె లక్ష్యము
మనోజుండె తేరు, గడపునేర్పరి భేరి కానినాదమె మధురంపుఁబల్కు
లు మనోరథమె రథము, మదనాగమమ్ములె మంత్రితంత్రిమ్ములు వీ
ణానినాదంబె వింటిమ్రోఁత, ।గీ॥ మదనయుద్ధ బె యుద్ధంబు మాన

వతుల, కెదిరి మగనేఁత సేయుటయే జయంబు, గాని వాలును బల
కయుఁ బూనికడఁగి, బవర మొనరించు టది విడంబనము కాదె.

క॥ మందగమనంబు గలసీ,కుం దలమే కేలు గదను గొని తెఱుఁగుట,
చ, న్నుందోయికి నానందం, బొందించునె! వింటి(ర్రొ)తాటిమొరపులు
తరణీ. ౨౫౫

సీ॥ అని సేయుతలఁపేని మనమున నోసనబోణి! లంబోష్ఠంబు పుప్పిగో
ళ్లు, లంబపాదంబులు లంబస్తనంబులు కాకిరూపును బిల్లికనులు
గార్ధ, భారావమును గర్కశాలాపములుఁ గిర్తిముఖమున కెనయా
గుమొగముగలుగు,చెలువవై యుద్ధంబు సేయుము గాకున్న నీతోఁడ
గడఁగి యనిని బోసంగఁ॥ గీ॥ జేయఁగాఁ జేతు లాడవు కాయజాత
కామినీతులితాకృతి గలవు నాఁగ, నగుచు శ్రీదేవి వానియానన
మునంకఁ, జూచి యిట్లనెఁ దీయని సూక్తు లలర,

గీ॥ పంచబాణహతుండవై వనటుఁ గుందు, మందబుద్ధివి నాతో సమ
రము సేయఁ,గలవె చాముండతోనొండెఁ గాళితోఁడ,నొండెఁ బో
రుము నేను బైనందు దాన. ౨౫౬

వ॥ అని కాళివంక గనుంగొని యిద్దురాచారు సంహరింపుమని
యానతిచ్చిన నాపెయు గదాదండంబు కేలం గొని గిరగిరం ద్రిప్పి వై
చిన వాఁడు తదాఘాతంబుదప్పించుకొని తద్భుజాంతరంబు గుఱిగా
గదాదండంబు వైచిన నసిచేతం దునిమి. ౨౫౭

క॥ కుడిచేయి నఱికి వానిం, బొడిచిన వెన్నిక రుధిరపుంగాల్వలు మైఁదు
డిచికొనుచునావంతయు,జడియక యొక కేలఁగడఁగినాహనలీలన్ ౨౫౮

చ॥ గద గొని యామెవక్షమున గాడఁగ నేయఁగఁజూచి యల్కమై
గుదుకునఁ దద్భుజాంతరముగూడ దటాలున మ్రించెఁ గాళి దు
ర్దుఁ డయి వాఁడునున్ రయముమైఁ దల దన్నఁగవచ్చినంతఁ ద
త్పదయుగ మూర్ధ్నపైఁ బడఁగ వైచెఁ గరాళతరాసిఁ బెల్చునన్ .౨౬౦

క॥ కాళులుఁ జేతులుఁ దెగియున్, జాలింపక వాఁడు కాయజం బగు
గతి న,క్కాళిక్షపై కురికిన నవ, లీలం దచ్ఛిరము దూఁటలీలం దఱిగెన్.

క॥ మించుగతి సురలు దివి వా,యించిరి దుందుభులు పేర్మి యింపారఁగ
న,గ్గించిరి విరిసోనలు వ,ర్షించిరి భయ ముడిగి సంతసించిరి మఱి
యున్. ౨౯౨

వ॥ హతశేషు లగురరక్కసు లద్దేవికిఁ బ్రణమిల్లి యభయంబు
వడసి పాతాళమ్మునకుఁ జనిరి. ౨౯౩

క॥ ఇది శుంభవధ యనం జనుఁ, జదివిన వ్రాసినను విన్న జనులకు
సౌఖ్య,ప్రదము సుతప్రదము జయ,ప్రదము ధనప్రదము కడుశుభ
ప్రదము నగున్. ౨౯౪

వ॥ అన విని జనమేజయుండు మహాత్మా! మహామహిమ యగు
నప్పరశక్తి నారాధించి మఱియు ము న్నెవ్వరు వరంబులం బడసి రన
వుడు సాత్యవతేయుం డి ట్లనియె. ౨౯౫


సురథోపాఖ్యానము.

సీ॥ పుడమివేల్పులయెడఁ బున్నెంపు నేఁతయు యజనంబు నిత్యసత్యవ్ర
తంబు, గంభీరభావంబు కరుణాపరత్వంబు నీతియు నేకపత్నీవ్రతంబు
చాపకౌశల మాదిసర్వశాస్త్రప్రవీణత్వ మాశ్రితరక్షణంబు శుచియు
గురుభక్తి మొదలగుగుణములు గల్గుసురథుఁ డనునొకమహారాజు
మున్ను॥ గీ॥ నేల నాల్గుచెఱంగులు నేలుచుండ, నదిప్రవాసులు మ్లేచ్ఛు
లత్యధికబలులు, కొంద ఱతనికిఁ బగతులై కొండగుహల, నుండి
తమదండుతోడ నుద్దండు లగుచు. ౨౯౬

క॥ తాఁకిన నాతండును దన,మూఁకలతో నెదిరి కదనమున నాయవనా,
నీకమున కోడి దుర్గ, ప్రాకారముఁ జేరి మదికి వగ వాటిల్లన్. ౨౯౭

క॥ పగతుఱకుం బ్రెగడలు లో, నగుటయు దైవమ్ము తనసహాయము
గామిన్, మగతనము వృథా యగుటయుఁ,దగ నాలోచించి యిట్లు
దలపోసె వెసన్. ౨౯౮

శా॥ పాపాచారులు మంత్రు లక్కట! ననున్ వంచించి యేనాఁటికే
నాపాపాత్ములబారిఁ ద్రోయుదురు సత్యం బింత యవ్వారిఁ బైఁ
గాపుం జేసి మెలంగ రాదు పిశునక్రౌర్యంబు సంబంధకృ
త్యాపాతమ్మునకుం దలంకునె! శుచివ్యాపార మగ్గించునే. ౨౯౯

క॥ తాతలుఁ దల్లులుఁ దండ్రులు, భ్రాతలు స్నేహితులుఁ చుట్టపక్కాలని
తా, మేతాదృశసంబంధము, చూతురె యెం దేని లోభశూరులు
పుడమిన్. ౨౨౦

చ॥ పగతురఁ జేరి వారిసదుపాయమె చూచు ప్రధాను లెందు న
మ్మఁగఁ దగువారె! యంచు గతిమత్తురగంబు నొకండు నెక్కి యొం
టిగఁ వనసీమకుం జనెఁ గడిందిగ ధైర్యము పూని యక్కటా!
జగతిఁ గుటుంబవైరము పొసంగిన నెవ్వని కార్తి గూరదే. ౨౨౧

వ॥ ఇట్లు చని చిమ్మచీఁకటిఁ జీమకుం జొర రానియయ్యరణ్యానిం
ద్రియుగగవ్యూతిమాత్రం బగుపథంబు గడచి. ౨౨౨

సీ॥ వలిగాడ్పు విసరుకీవల నల్లిబిల్లిగాంచిన చెట్లు తటముల జెలఁగు
నదుల, నానందముగ రజతాద్రులు వోని సైకతములఁ దిరుగుసింగ
ములుఁబులులు, హరిణంబు లేన్గులు నాదిగమృగములు చదువుసం
తల బ్రహ్మచారులఱచు, ప్రాఁబల్లులును హోమపక్వనీవారాన్న
గంధఁబు పతితపక్వఫలములును ॥గీ॥ నింద్రియమ్ముల కెంతయు
నింపునింపఁ దగినయొకముని యాశ్రమస్థలము గాంచి, సైంధవము
నొక్కభూరుహచ్ఛాయ నునిచి, వినయమునఁ జనె నమ్ముని విభుని
యెడకు. ౨౨౩

సీ॥ చనితపఃకృశు మృగాజిననిషణ్ణుని శాంతు దాంతునిర్మత్సరుద్వంద్వర
హితు, నఖిలాగమాంతరహస్యమర్మ్ముల నొగి శిష్యులకుఁ దెల్పు
చున్నవాని, గని కుండజలవోలెఁ గన్నీరు కాల్వలై పాఱ నమ్ముని
పురోభాగమందు, సాష్టాంగ మెఱఁగి దండాకృతినొందిన లెమ్ము
లెమ్మని ముని లేవ నెత్తె॥ గీ॥ శిష్యునొక్కరుఁ దగుమృగాజినము
దేరఁ, బనిచి పరపించి కూర్చుండఁ బనిచి యతని, నుచితవిధిఁ బూజ
సేయించివచనరచన, శాంతి యిగు రొత్తనిటు త దుదంత మడిగె.

క॥ ఎటనుండి వచ్చి తిటకుం, గటకట పడ నేమి వచ్చెఁ గలతెఱఁ గెల్లన్
దటుకునఁ దెల్పుము నాచెం, గటి కరుదెంచియును వగవఁగా నీఁక
నేలా?. ౨౨౪

వ॥ నీమనోవాంఛితంబు దుస్సాధ్యంబైనను సాధింతు ననవుఁడు గద్గదికతో నతని కతం డిట్లనియె. ౨౨౮

క॥ సురథుఁ డను పేరిధరణీ,వరుఁ డను శత్రులకు నోటువడి వారలదు,ష్ప
రిభావము కతమున మీ, చరణద్వంద్వమ్ము గొంటి శరణు మహాత్మా!

క॥ ఇల్లాలిల్లును రాజ్యం, బెల్లరఁ దనయులను విడిచి యీవనమున మీ
కాళ్లఁ బడి శరణుఁ జెందితిఁ, దల్లియుఁ దండ్రియును నీవ దైవము దేవా

వ॥ మీకు దాసుండనై మీఁ పనిచిన కార్యం బెల్లఁ జేయుచుండు నన దనగు నన్నుం గరుణించి శత్రుభయంబు వాపి నాకూర్చువారిం గూర్పవే యని కటకటం బడు నన్నరపతి కభయం బొసంగి ముని యిట్లనియె. ౨౨౯

క॥ వనవృత్తిని నీవారా, శనమున శుచి వగుచు హింస సలుపక నీయం
తన యాశ్రమమున విహరిం,పు నృపాల! లభించు సౌఖ్యములు
నీకు నొగిన్. ౨౩౦

వ॥ అను మునివచనమ్ములకు సంతసిల్లి మునివృత్తి నట వసించుచుఁ గొండొక కాలమ్మున నొకశీతలతరుచ్ఛాయ నాశ్రయించి దైవికం బగు నాపదకు వందురుచు రాజ్యపరిత్యాగమ్మును దారపుత్రవియోగంబును వైరికృతపరాభవమ్మును దలపోయుచున్నంత దీనుం డగు నొక బచ్చ చ్చోటికి వచ్చినం గని యుపవిష్టుం జేసి నీ వెవ్వండ! వే కతమ్మున నిట రాక! శోకకారణం బేమి! నావుడు నతం డతని కిట్లనియె. ౨౩౧

ఆ॥ వె॥ బచ్చుకొలమువాఁడ బహుధనవంతుఁడ, సత్యరతుఁడఁ గడుయ
శంబు నీసు,లేమి యోగి దుఃఖి, గామియుఁ గల్గినవాఁడ నాఁగ
వినుతి వడయువాఁడ ౨౩౨

వ॥ ఏను ధనలుబ్ధులును నసాధులును నగుపుత్రదారాదులచే నిరస్తుండనై యివ్వనమ్మున కేతెంచితి నా పేరు సమాధి యందురు భవదీయోదంతంబు విన వలయు దేవర యాననంబు గాంచిన భాగ్యవత్త్వ ప్రకటం బగుచున్నయది యని వినయవినమితుం డగు నక్కోమటికి సురథుం డిట్లనియె. ౨౩౩

క॥ సురథుఁ డను పేరిధరణీ, వరుఁడను బగతులకుఁ జిక్కువడి నీవలె దు
ర్భరణభయమ్మున నిటఁ గ్రు, మ్మరు నిర్భాగ్యుండ నిరభిమానుఁడ జడుఁడన్

వ॥ దైవయోగమ్మునం జేసి మనకిరువురకుం బరిచయంబు వాటి
ల్లె నిఁక శోకంబు విడిచి యిట సుఖమ్ముగ వసింత మనవుఁడు సురథున
కక్కిరాటుం డిట్లనియె॥ ౨౮౫

సీ॥ భార్య మేన సుఖంబు వాటిల్ల దనియుఁ గుటుంబంబు గడు నిరాలంబ
మనియు, నప్రయోజకు లయి యాత్మజు లే నుప్వ లేనియవాగువు
నైనఁ ద్రావి, కూడఁ బెట్టిన సొమ్ము కొల్లపెట్టి దరిద్రులై యాప
దలకుఁ బా లగుదు రనియు, మనను శాంతింపదు మానవనాథ
భార్యను బిల్లలను నేమరల బ్రతికియుఁ॥ గీ॥ గాంతునో లేదో యంచు
దుఃఖమ్ము వార్ధి, భంగిఁ దరఁగలు గట్టి లోపల నిముడక, పొంగు
చున్నది నే నేల పోలియ నంచు, గడవలకొలంది కన్నీరుగాఁగ
నేడ్చె॥ ౨౮౬

క॥ అని యేడ్చుకోమటిఁ గనుఁ, గొని సీ! ని న్నిల్లు వెడలఁ గొట్టినవారిం
దనుజుల దనుజాకారులఁ, గనుఁగొనినను సుఖము నీకుఁ గల్గునె చె
ప్పుమా॥ ౨౮౭

వ॥ అని యేనును రాజ్యవిహీనుండఁ గదా! యని చింతింతు దైవి
కమ్ము లగు నాపద లనుభవమ్మునం గాని తీఱ వైనను మన మిరువురము
నేగి యిట నున్న మునినాథుఁ గాంచి సవినయమ్ముగా శోకనాశోపాయం
బడిగి తెలిసికొంద మను రాజుమాటల కక్కోమటియు వల్లె యని యతని
గలసి యమ్మునికడ కేగి మ్రొక్కి నిలువం బడి యున్నంత సురథుండు
ముని కిట్లనియె॥ ౨౮౮

ఉ॥ బచ్చెకఁ డీకఁ డివ్వనము సజ్జనె నాకును మిత్రుఁ డయ్యె నీ
సచ్చరితుండు దారతనుజాతులచేత నిరస్తుఁడై గడున్
హెచ్చినశోకవారినిధి నీఁదుచు ని మ్మభయంబు వేఁడఁగా
వచ్చినవాఁ డనాథుఁ డగువాఁడు ననున్ బలెఁ గావవే మునీ ౨౮౯

వ॥ ఏనును భవదీయపాదసేవాసమాసాదిత సుఖాతిశయమ్మునం
జేసి కాలంబు గడప నుంకింతు నైనను నాపద్దయిదుములు తలంపునకు

వచ్చి నిద్రాసుఖమ్ములు దూరమ్ము లగుచుండు మహాత్మా! మ మ్మనుగ్ర
హించి శోకనాశోపాయం బానతీవే యనుసురఘునకు మునివరుం డి
ట్లనియె. ౨౯౦.

గీ॥ హరిహరబ్రహ్మలైన మాయకుం దలంకి, మోహవారాశిలోపల ము
న్గుచుంద్రు, మనుజమాత్రులు మీర లామాయ గడచి, యుండ
నేర్తురె మోహంబు గం డడంచి ౨౯౧

వ॥ ఇందుల కొక్కయితిహాసంబు దెల్పెద నాలకింపుఁడు కృత
యుగమ్మున నారాయణుండు సితద్వీపమ్మున ననేకదివ్యవత్సరమ్ములు దపం
బొనరించుచున్నంత నచ్చోటన విరించియు మోహనివృత్తికై తపంబు
సేయుచుండె నిట్లుకొంతకాలమ్ము కడచినపిదప నిరువురు నత్తావు వదలి
చనుదెంచుచు నొక్కయెడఁ దారసిల్లి పరస్పరజిజ్ఞాసం జేసి యీవెవ్వం
డీవెవ్వండ వని యడిగికొని రందు విరించి చరాచరాత్మకం బగుజగమ్ముం
తయు నిర్మించినవాఁడ ననుఁడు నారాయణుం డతని కి ట్లనియె. ౨౯౨

భువనసుందరీమాహాత్మ్యము

శా॥ ఏనాఁటం జగమెల్లఁ జేసితిని నేనే యంచు నాయొద్ద నీ
యీనైపుణ్యము గట్టిపెట్టుము బళే! యీవెంత! యీసర్వము
న్నానిర్మించినవిశ్వ మచ్యుతుఁడ నే; నాఁ డామధుక్ గైటభుల్
బ్రాణాపేతులఁ జేసి ని న్నరసి సంరక్షించుటల్ వోయెనే. ౨౯౩

గీ॥ రాజసుఁడ వేల యింతగర్వమ్ము నీకు, నిన్నుఁ గని పెంచిదానవానీక
మనికిఁ గడఁగిపోదువంగ వారిధాకలకుఁగొంకు, మైఁ దలఁపక
యిటు పల్క నగునె మూర్ఖ. ౨౯౪

చ॥ అనిన విరించి యిట్లనియె నోరి! సురాదులతోడఁ బోరునాఁ
డెనసి పరాంబతోడగుట యించుకయుఁ దెలియంగ రాదె! యీ
మనువునఁ బల్క నీకు నెటులాడెడి నాలుక, యిట్టు లిద్దఱుఁ బనిఁ
గొని వాదు సల్పఁ గన వచ్చెను లింగ మొకండు వారికిన్. ౨౯౫

క॥ ఓనారాయణ! యోచతు, రానన! మీరిరువురుఁ గలహము మాని
వినుం డేనొకపల్కు వచించెద, బూటకమైఁ బక్షపాతమును గన
కుండన్. ౨౯౬

వ॥ ఈద్వీపమ్మున నిపు డుద్భవించిన యీమహాలింగమ్మున కగ్ర మ్మెక్కడను నాదియొక్కండును జూచి రయమ్మున నెవ్వం డరుదెంచు వాండు మీయిరువురం దధికుండు నావుడు వల్లె యని హరి పాతాళ మ్మునకును విరించి యాకాశమ్మునకును జని రందు. ౯౮

మ॥ హరి పాతాళము నేగియేగియును లింగాదిన్ విలోకింప కె
క్కరణిం గాంతు నటంచుం జింత గొనె నక్కంజాసనుండుం దదం
బరవిధిం బడి యేగి లింగమునకుం బారంబుం బోరామి ను
ద్ధురలజ్జాధికశోకదైన్యములలోంతుం గాంచి యట్టాండుచున్.

వ॥ ఒక్కచో నుపవిష్టుండై దైనికమ్ముగాం దదీయశిరమ్మునుండి భూమిపయిం బడునొక్క మొగలిపూవుం గాంచి దానిం బరిగ్రహించి సంతసమ్మున నయ్యసురాంతకుపాలికిం జని యేను లింగాగ్రంబు గాంచి యచ్చట నున్న మొగలిదళంబు గొనివచ్చితి నని చూపిన హరి యక్కేతకి కిట్లనియె. ౯౯

క॥ నిజముగ లింగశిరం బీ,యజుండు గనుంగొనెనె! నీవు నచ్చోట సుర
వ్రజపూజితమవె! నావుడు, నిజ మని యమ్మొగలిపూ వనృతము
వచించెన్ ౧౦౦

వ॥ హరియును దానిపలుకు విశ్వసింపక లోకంబునం గొందఱు ధనాశంజేసి కూటసాక్ష్యం బిత్తు రని పలికి యివ్విషయమ్మున నాకు మహాదేవుండ ప్రమాణం బనినం దిరోహితుం డగుచు శివుం డతని కిట్లనియె. ౧౦౧

గీ॥ అనృతవాదిని కేతకి యకట! నాదు, మస్తకమునుండి పడుచు నమ్మా
ర్గమధ్య।మంచుం గంటం బడంగం జతురాననుండు।చేతం గొని వచ్చెం
గాని మచ్ఛిరముం గనండు. ౧౦౨

వ॥ అని పలికి కోపమ్మునం గేతకిం గాంచి యనృతం బాడితివిగాన నిది మొదలు నాకుం బూజింపం దగ వని శపించెం బిదప వారిరువురును యథేచ్ఛం జనిరి. ౧౦౩

క॥ కావున మోహము జగమున, నేవారును దాఁట లేరు నృపవర! మిగు
లగ్; బ్రావీణ్యము కలవారిను,నోవృత్తుల నైన మాయ నూలొ్కనఁ
జేయుగ్. ౨౦౪

గీ॥ అట్టిమాయకు లోనుగా కంబ యొక తె, సర్వమును సృష్టిఁ జేసి
రక్షణ మొనర్చి, లయము గావించు నాయంబ లక్షణములు, తెలిసి
కొన్నను మోహవార్ధినిఁ దరించు. ౨౦౫

వ॥ నావుడు సురఘుండు తల్లక్షణంబు నెఱింగింపు మనుడు

సీ॥ రాజేంద్ర! విను శుభప్రదమును గామదమును నగునంబికాపూజ
చొప్పు,నియ తేంద్రియుఁడయి మునిఁగి తెల్లనిమడుంగు గట్టి వా
ర్చియు శుభాగారమందు, గోమయుల ప్తమై గోముఖాలం కృతమై
యొప్పగనుమంటపాంతరమునఁ,దనశక్తికొలఁది నెంతయుఁ బూజకై
తగుదవ్యమ్ములను గొని భవ్యరీతి, ॥గీ॥ ధరణి నాత్మను గాలంబు
దగ విశుద్ధి, చేసి చిత్తంబు శుద్ధంబు చేసి పిదపఁ, దామ్రమయ మగు
నొక్కపాత్రమ్మునందు, ద్విజులతోఁగూడ వేదచోదితము గాఁగ.

వ॥ షట్కోణం బగుయంత్రమ్ము లిఖయించి దానికెలన సప్తకోణ
యంత్రమ్ము నాసాదించి పదంపడి నవాక్షరమంత్రబీజమ్ములు యథాన్యా
సమ్ముగా వ్రాసి ప్రాణప్రతిష్ఠ యొనర్చి షోడశోపచారమ్ములం బూజించి
శక్త్యనుసారమ్మునఁ దన్మంత్రజపం బొనర్చి తజ్జపసంఖ్యాదశాంశమ్మున
హోమమ్మును దద్దశాంశమ్మునఁ దర్పణమ్మును దద్దశాంశమ్మున బ్రాహ్మణ
భోజనమ్మును గావించి చరిత్రత్రయపాఠం బొనరించి విసర్జింప వలయు
నని చెప్పి వెండియు. ౨౦౬

క॥ సువ్రతు లగువారికి ని, త్యవ్రత మాశ్వయుజమాసమందు న్నవరా,
త్రివ్రత మది సెప్పెద విబు, ధవ్రజమతముగ నిది విని తనియుఁ
డు మీరల్. ౨౦౭

వ॥ ఆశ్వయుజచైత్రమాసమ్ము లను నీరెంట నాది యాదిగ
నవరాత్రమ్ములు జితాహారుండై జప్యమంత్రమ్ములచే శర్కరామధుఘృత
యుత మ్మగుపాయసమ్ముననొండె ఛాగమాంసమ్మునొండె బిల్వపత్ర
మ్ములనొండె హోమంబు గావించి ద్విజభోజనం బొనర్చినవారికి నొ

కం డన నేల సహస్రకామమ్ములును గరతలామలకమ్ము లగు నిందుజాతి భేదంబును స్త్రీపుంసభేదమ్మును నకించిత్కరమ్ములు విధిచోదితంబుగ నె వ్వం డేని మండలం బొనరించి పుష్పమాలాలంకృతం బగువితానంబు సంధించి కలశస్థాపనం బొనర్చి యంత్రప్రతిష్ఠిత యగునద్దేవిని త్రికా లమ్ములయందు ధూపదీపాదికమ్మున నర్చింపుచు గీతాదికమ్ములును వేద పారాయణంబులును విస్తరింపఁ జేయుచు యథామతి యథాశక్తిగ విత్తశాఠ్యం బొనరింపక సుగంధతైలచందనభూషణాదులచేఁ గన్యకల నర్చించుచు నవరాత్రమ్ములు గడపి ద్విజభోజనపురస్సరమ్ముగా దశమినాఁడి నమ్మునఁ బారణం బొనర్చి క్రతుసమాప్తి గాంచిన వాఁ డుత్తమలోక మ్మున కేగి దేవిసాయుజ్యమ్ముగాంచు నని వెండియు ౮౯

క॥ నవరాత్రవ్రతమున కెన, యవ్రతము మఱొండు గాన మవనీశ్వ
రా! యీ,యవనిఁ బలుములు నందఁ, నవశ్య మం దెదవు దేవి నర్చిం
పు మిటుల్. ౯౦

వ॥ అని సహూర్థిం గాంచి.

కం॥ ఓవైశ్యోత్తమ! నీవును, గావింపుము దేవిపూజ; క్రమముగ నీదుః
ఖావేశమడంగును ధని, నై వర్ధిల్లెద వటంచు నానతి యీఁగన్.

వ॥ వారలిరువురును హర్షోత్ఫుల్లలోచనులై మ్రొక్కి దేవరదర్శ నంబునఁ జేసి యుస్తత్తాపంబు వాసె ధన్యుల మయ్యెద మమ్మంత్రరా జంబుపదేశింపవే యనుఁడు ధ్యానబీజపురస్సరమ్ముగా నవాక్షర మంత్ర మ్ముపదేశించిన మునిపతి కెఱఁగి చని యొక్కనదీతీరమ్మున విజనప్రదే శంబు నాశ్రయించి శుష్కపర్ణాశను లగుచు రెండువత్సరమ్ములు జపించి యంత నొక్కనాఁడు స్వప్నమ్మున రక్తాంబరధారిణియై దేవి పొడఁగట్టినం గాంచి యుఁ దపంబు చాలింపక తృతీయవత్సరం బంతయుజలాహారంబు గఁ గడపి పదంపడి దేవిసాక్షాద్దర్శనంబు గానక ౯౧

మ॥ ఒకకుండమ్మును ద్రవ్వి పావకుని నందూర్థాత్ముఁ గావించి పా
యక దేహంబు త్యజింపఁగాఁ దెగువ సేయం బూని మాంసంబు పా
వకునందుం దెగఁ గోసి హోమ మొనరింపన్ దాన శ్రీదేవి యు
య్యకలంకాత్ములకుం గనం బడియె ధ్యేయాకార మేపారఁగన్.

వ॥ ఇట్లు చూపట్టి మీసాహసంబువలన నేను బ్రిసన్నునైతి వరం బు గోరుఁ డనవుడు సురథుం డి ట్లనియె. ౮౧౪

మ॥ జననీ! మార్తుఅచేతఁ జిక్కివడి రాజ్యం బేది యీకాననం
బున నిన్నాళ్లు వసించి నాదువితతింపుంబుణ్యముఁజేసి నీ
మనురాజంబు జపించి నీకరుణ సమ్మానంబు గైకొంటిఁ గా
వున నాతొల్లిటిరాజ్య మిచ్చి యశుభంబుల్ వాపుమా నావుడున్.

సీ॥ పగతుఱు నీచేతఁ బడుదురు బల మేది,నీమంత్రులెల్లరు నిన్నుఁగొల్వ
నేతెంతు, రీవు నీయిల వేయి సంవత్సరములు మహాప్రాభవమున నే
లఁగల విం కే కేగుము కళ్యాణములు సమకూరుకాలము నీకుఁ జే
రువయ్యె,నని యంబ సెలవీఁగ నవనీపతియు ముద మంది తొల్లిం
టిహాయమ్ము నెక్కి ॥గీ॥ పగతుఱను గొట్టి పృథివి చేపట్టి మంత్రి,వ
రులతోఁ గూడ రాజ్య మవార్యలీలఁ,బాలన మొనర్చి వేయిసంవత్స
రమ్ము, లుంచి తుది దేవదేవిసాయుజ్య మందె. ౮౧౫

వ॥ కోమటియును నా ఎ కెఱఁగి యిట్లనియె.

క॥ తల్లీ! ధనధాన్యమ్ముల, నొల్లన్ వేటొండునొల్ల నుల్లాసములం
దెల్ల నుపశింప నేరని,యుల్లాసము గోరువాఁడ నుల్లము దనియన్.

వ॥ అనిన దేవియు నతనికి దివ్యజ్ఞానం బొసంగి యంతర్ధానంబు చేసెఁ బదంపడి వాఁడును తీర్థాటనాదిపుణ్యకార్యమ్ములచేఁ గాలయాపనం బొనర్చి ముక్తసంగుండై తుదకుఁ దత్సాయుజ్యంబు వడసె నియ్యాది భూపవైశ్యులచరితంబు దేవ్యారాధనఫల ప్రాప్తిదృష్టాంతంబు దీనిం జదివినను విన్నను బురుషార్థమ్ములు గలుగు నని వ్యాసుండు జనమేజయునకుం జెప్పినట్లకథకుండు మునులకుం జెప్పుటయు. శ్రీశ్రీశ్రీ ౮౧౭

క॥ కడిమెద్దపురవిరాజిత, మృడపాదాంభోజచంచరీకహృదయ ద్రా
విడశాఖాభూషాయిత, జడవిజ్ఞానప్రదాన శాస్త్రనిధానా. ౮౧౯

క॥ నానాతీర్థాటనసం, ధానాపారాన్న దానతతవిద్యాదా
నానూనపుణ్యసంభృత, మానాతీతోరుకీర్తి మద్గురుమూర్తీ. ౮౨౦

భుజంగప్రయాతము.

సదానందచిత్తా ప్రశస్తార్థవేత్తా, వదాన్యాగ్రవర్తీ శుభఖ్యాతకీర్తీ!
పదాలంబిభూపా కృపాధూతపాపా, నిదాఘార్కకాంతీ మునిశ్లాఘ్యశాంతీ. ౮౨౧

గద్య

ఇదిశ్రీ...తిరుపతివేంకటేశ్వర ప్రణీతం బయిన దేవీభాగవతం
బనుమహాపురాణమ్మునందుఁ బంచమస్కంధము
సంపూర్ణము. శ్రీ. శ్రీ. శ్రీ.

4 వ స్కంధములో

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 25 | 19 | కుక్షి | కుది | 48 | 20 | దీండిగ్రిం | దేవ్రిల్లిం |
| 25 | 5 | మ్ముల | మ్ము నుల | 53 | 8 | కామె | కా నె |
| 23 | 25 | జేఁచి | జేచి | 61 | 17 | దారు | తాలు |
| 31 | 2 | గ్చ్చము | ర్చ్చము | | | మారు | మాలు |
| 44 | 27 | ర్ధా | ర్థా | 71 | 11 | ణి | ణ్ని |

12వపుటలో 96పద్యములో 3 వ చరణముతుదనుండి,,మిాతపస్సుద్దామతియెంతయేనియుముదంబిడెఁజాలుఁ బరిశ్రమంబిఁకన్,,



## అశుద్ధశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 17 | గృష్ణు | కృష్ణు |
| 9 | 7 | గుర్మ్మ | గుమ్మ |
| 10 | 1 | పూబోడి | పూఁబోఁడి |
| 10 | 15 | దేరి | దేఱి |
| 18 | 24 | వాదుం | సవాదుం |
| 19 | 4 | గ్రమ్మరిం | గ్రమ్మఱిం |
| 19 | 13 | నిదా | నిద్రా |
| 20 | 22 | నుబో | నుపో |
| 21 | 21 | దరిగి | దఱిఁగి |
| 24 | 5 | త్తారిమై | ద్ధేతువై |
| 26 | 2 | రుద | రుత |
| 30 | 11 | విథ | విధ |
| 31 | 3 | డెగా | డెఁగా |
| 33 | 14 | దారు | దార |
| 35 | 14 | మఱుఁగుఁ | మరగుఁ |
| 35 | 11 | గామా | కామా |
| 37 | 11 | బోటి | బోఁటి |
| 40 | 1 | మికి | మిఁకి |
| 40 | 7 | వధీ | సధీ |
| 40 | 9 | తేకు | తేఁకు |
| 40 | 11 | డి | డ |
| 44 | 25 | గాడి | గాఁడి |
| 47 | 10 | ముగృ | ముకృ |
| 47 | 21 | ముబో | ముఁబో |
| 51 | 16 | దంప | జంప |
| 59 | 24 | ఉద్ధి | ఉత్థి |
| 61 | 1 | తిరినే | తిరిణే |
| 61 | 8 | దుదీం | దుగోం |
| 67 | 19 | యధో | యథో |
| 68 | 10 | దురు | దుదు |
| 69 | 1 | నును | నుడు |
| 69 | 6 | వేడు | వేఁడు |
| 71 | 17 | దికి | దితరి |
| 72 | 27 | కా | క్తా |
| 74 | 6 | చీఱ | చీర |
| 82 | 12 | గఱంచి | గరంచి |
| 84 | 12 | రేఁగా | రేఁగి |
| 84 | 18 | బీట | బీఁట |
| 84 | 18 | వార | వాఱ |
| 87 | 2 | దరిగి | దఱిగి |
| 95 | 10 | లోఁ,బ | లోఁబ |
| 95 | 26 | వుఁడు | వుడు |
| 95 | 28 | నతా | నత్తా |
| 99 | 21 | ర్తుఱ | ర్తుర |
| 101 | 9 | తీర | తీఱ |
| 107 | 4 | ఒర | ఒఱ |
| 107 | 27 | కురి | కుఱి |
| 108 | 16 | రఘు | రఘు |
| 108 | 17 | తుహై | తుహ్రై |
| 109 | 13 | లఱచు | లనెడి |
| 110 | 1 | సాధ్య | సాధ |

## తిరుపతి వేంకటేశ్వరుల పుస్తకములు
## క్రొత్తగా వచ్చుచున్నవి.

| | | |
|---|---|---|
| 1 | గీరతము (ప్రథమభాగము) ... ... | రు 0—10—6 |
| 2 | దేవీభాగవతము 5 వ స్కంధము ... ... | రు 0—12—0 |
| 3 | కవిసింహగర్జితములు .. .. ... | రు 0—2—0 |
| 4 | పశ్యాంపుశ్యాం ... ... ... | రు 0—2—0 |
| 5 | గుంటూరి శతావధానము ... .. ... | రు 0—2—0 |
| 6 | బ్రాహ్మణకోడూరు శతావధానము ... ... | రు 0—2—0 |
| 7 | పినపాటి శతావధానము ... ... ... | రు 0—2—0 |
| 8 | బాపట్ల శతావధానము ... ... ... | రు 0—2—0 |
| 9 | నర్సారావుపేట శతావధానము | రు 0—3—0 |
| 10 | మైలవరపు శతావధానము | రు 0—3—0 |

ఇతరులవి.

| | | |
|---|---|---|
| 1 | గుంటూరుకాలేజి శతావధానము .. ... | రు 0—4—0 |
| 2 | తెనాలి శతావధానము ... ... . | రు 0—3—0 |
| 3 | బిడాలోపాఖ్యానము ... . | రు 0—2—0 |

పైమూఁడును శివరామశాస్త్రి కృతములు.

| | | |
|---|---|---|
| 1 | కవితావిమర్శనము ... ... ... | రు 0—5—0 |
| 2 | ఆత్మస్తుతి విమర్శనము ... ... . | రు 0—5—0 |
| 3 | ఖండనముండనము(అచ్చగుచున్నది) ముం॥ కృ॥ వెం॥ | |
| 1 | సంగరోపము (మల్లికార్జునకవి కృతము) ... | రు 0—3—0 |

1 గీరతము 2 వ భాగము, (గురుదక్షిణ) 3 వ భాగము (లోకాభిరామాయణము) 2 గుంటూరిసీమ, (గుంటూరిలో మాపైఁ గాలు ద్రవ్విన వారికిని మాకును జరిగిన విద్యావిషయికముగు వర్ణ యుండును) 3 కలగూరగంప, 4 హరిణప్లుతము (చకరాని ప్రహసనము,) ఈమొదలగునవి 1 వత్సరములో తయారగును, ఆపైన శ్రవణానందము, మొదలుగాఁగల గ్రంథములెల్ల సిద్ధముగనే యున్నవి.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శతావధాని,

కృష్ణాభైరవ ప్రెస్, బందరు.